# శాంతిని సాధించగలము

రచన: పాల్ జి. హాఫ్మన్

# శాంతిని సాధించగలము




పాల్ జి. హాఫ్మన్

మిషిగన్ నియోజక వర్గానికి చెందిన సీనియర్ సెనేటరు ఆర్థర్ హెచ్. వాన్‌డెన్ బర్గ్ శాంతి సాధనకై చేసిన కృషి, ప్రబోధాలు శాంతి ప్రియులకు సదా ప్రోత్సాహం కలిగించగలవు. ఆయనకు ఈ గ్రంథం అంకితం.

## కృతజ్ఞత :

ఈ గ్రంథకర్తను నేనే అయినప్పటికీ ఆర్థిక నిర్వాహణాశాఖలోని నా సహచరులు దీని రచనకు అమితంగా తోడ్పడ్డారు. వారు చేసిన సహాయం ఎంతటిదంటే, ఒక విధంగా వారే ఈ గ్రంథకర్తలని చెప్పాలిగాని, నేను కాదు.

నాతో అత్యంత సన్నిహితంగా కృషి చేసిన హార్ట్ ప్రెస్టన్‌కు, హెర్బర్ట్ హారిస్‌కు ముఖ్యంగా కృతజ్ఞుడను.

ఈ గ్రంథంలో సిఫారసు చెయ్యబడిన కార్యక్రమ మంతటికీ సంపూర్ణ బాధ్యత నాదే నని స్పష్టం చేస్తున్నాను.

పాల్ జి. హాఫ్మన్.

# విషయ సూచిక


| అధ్యాయము | | పుట |
|---|---|---|
| 1. | శాంతికాలంలో అయినా యుద్ధకాలంలో అయినా మన లక్ష్యం శాంతియే ... | 6 |
| 2. | శాంతి సాధనకై శాంతి సమరాన్ని జరపాలి | 15 |
| 3. | స్వతంత్ర రాజ్యాలపై నాయకత్వం అమెరికాకు ఇష్టం లేకపోయినా తప్పదు ... | 39 |
| 4. | నాయకత్వంలో సాధక. బాధకాలు ... | 53 |
| 5. | శాంతి సాధనకై సైనిక రంగంలో జాగ్రత్త పడాలి ... | 78 |
| 6. | శాంతి సాధనకై ఆర్థిక రంగంలో జాగ్రత్త పడాలి ... | 105 |
| 7. | శాంతి సాధనకై రాజకీయ రంగంలో జాగ్రత్తపడాలి ... | 143 |
| 8. | శాంతి సాధనకై సమాచార రంగంలో జాగ్రత్తపడాలి ... | 166 |
| 9. | శాంతి సాధననిమిత్తం చేయవలసిన వ్యయం | 196 |
| 10. | జయం పొందగలమా ? ... | 214 |

# సుదీర్ఘకాలం ప్రజాసేవచేసిన ఘనుడు
# పాల్ హాఫ్‌మన్

అమెరికా ఆర్థిక సహకార కార్యశాఖకు లోగడ రెండు సంవత్సరాలు డైరెక్టరుగాను, ప్రస్తుతం సలహాదారుగాను పనిచేస్తూన్న పాల్ జి. హాఫ్మన్ వ్యాపారంలోను, ప్రభుత్వోద్యోగంలోను కూడా విజయం సాధించారు. లోగడ కొన్నాళ్లు స్టూడిబేకర్ ధర్మనిధికి అధ్యక్షుడుగా పనిచేసిన ఈయన ప్రస్తుతం ఫోర్డ్ ధర్మనిధికి డైరక్టరుగా పనిచేస్తున్నారు. ప్రస్తుతం ఈ సంస్థ శాంతి సాధన కృషి నిమిత్తం 23,80,00,000 డాలర్లు వెచ్చించడానికి నిర్ణయించుకున్నది. అమెరికా ప్రతినిధుల సభ విదేశ వ్యవహారోప సంఘ సమావేశంలో చేసిన ఒక ప్రసంగంలో హాఫ్మన్ ఇలా అన్నారు: "ప్రచ్ఛన్నయుద్ధంలో మనం విజయం సాధించగలం. మరొక పది సంవత్సరాలలో ప్రపంచంలోని స్వతంత్ర రాజ్యాలు శాంతియుతమైన ప్రపంచ జీవనానికి శాశ్వతమైన పరిస్థితులు కల్పించగలవని నేను విశ్వసిస్తున్నాను."

పాల్ హాఫ్మన్ 1891 ఏప్రిల్ 26 వ తేదీన షికాగోలో జన్మించారు. ఇలినాయిస్‌లోని లాగ్రాంజ్ స్కూలులో పట్టం పొందినమీదట 1908–9 లలో షికాగో విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేశారు.

తరువాత మోటారు కార్ల వ్యాపారంలో ప్రవేశించి, ఇతర వ్యాపారస్థులకన్న ఎక్కువ కార్లు అమ్మకం చేశారు. 1915లో ఆయన లాస్ ఏంజెల్స్‌లోని బ్రాంచి మేనేజరుగా నియమించబడ్డారు. మరి రెండు సంవత్సరాలలో ఆయనకు ఆ జిల్లా బ్రాంచి మేనేజరు పదవి లభించింది.

1917 లో హాఫ్మన్ ప్రథమ ప్రపంచ సంగ్రామంలో పాల్గొన్న అమెరికా సైన్యంలో చేరి, 1919 లో ఒక కవచ దళానికి లెఫ్టినెంట్ గా పనిచేస్తూ, సైన్యంనుంచి విడుదలై వచ్చారు.

తిరిగి మోటారు వ్యాపారంలో చేరి తన కంపెనీ అమ్మకపు శాఖకు ఉపాధ్యక్షుడుగాను, ఆ కంపెనీ డైరెక్టర్ల బోర్డులో ఒక డైరెక్టరుగాను ఎన్నిక అయి నారు. అప్పటికి ఆయన వయస్సు 30 సంవత్సరాలు మాత్రమే.

ప్రచ్ఛన్న యుద్ధంలో స్వతంత్ర దేశాలకు చాలా విజయావకాశా లున్నాయనీ, ప్రపంచంలోని పారిశ్రా మిక శక్తులలో నాల్గింట మూడు వంతులు స్వతంత్ర రాజ్యాలలో ఉండడమే దీనికి కారణమనీ, సిద్ధాంత వాద బలంకూడా స్వతంత్ర దేశాలకే విశేషంగా ఉన్నదనీ ఆయన అభిప్రాయం. ప్రత్యక్ష సమరంలో విజయం సాధించడమనేది ఒక జాతికిగాని కొన్ని జాతుల ముఠాకు

గాని అసంభవమని ఆయన నిశ్చయం. తృతీయ ప్రపంచ మహా సంగ్రామంలో రోజుకి 10,00,00,000 డాలర్లు ఖర్చు చేయవలసి వస్తుందనీ, అంత ఖర్చు ఎవరూ భరించ లేరనీ ఆయన వాదం.

పాల్ హాఫ్మన్‌ను గురించి ఐసెన్‌హోవర్ ఇలా అభివర్ణించారు: "తన చర్యలవలన పాల్ హాఫ్మన్ అమెరికాకు, ఆ రీత్యా ప్రపంచంలో స్వాతంత్రతకు విశేషంగా తోడ్పడ్డారు."

# శాంతిని సాధించ గలము

రచన : పాల్ జి. హాఫ్‌మన్

# శాంతి కాలంలో అయినా, యుద్ధ కాలంలో అయినా మన లక్ష్యం శాంతియే

## 1 వ అధ్యాయం

క్రిందటి సంవత్సరం వసంత ఋతువులో ఒక రోజు సాయం కాలం బెర్నార్డ్ బరూష్ వాషింగ్టన్‌లోని మా యింటికి భోజనానికి వచ్చారు. ఆ సందర్భంలో మా ఇద్దరి మధ్య జరిగిన సంభాషణలో వెలెస్లీ కాలేజిలో నేను ఇవ్వబోయే ఉపన్యాసం ప్రసక్తి వచ్చింది. ప్రపంచంలోని స్వతంత్ర రాజ్యాలకూ, సోవియెట్ రష్యాకూ ఈనాడు జరుగుతున్న భయంకర సంఘర్షణల సహజ స్వరూపాన్ని వెలెస్లీ కాలేజి ప్రసంగంలో వివరించ దలచుకున్నానని బరూష్‌తో అన్నాను.

ఈ నాటి అతి క్లిష్ట పరిస్థితికి కారణమైన ఈ మహా సమస్యకు సంబంధించిన సర్వ విషయాలలోనూ బరూష్ క్షుణ్ణంగా తెలిసినవారని అందరూ అంగీకరించిన విషయమే. నా అభిప్రాయాల్ని వివరంగా తెల్పుతూవుంటే కుర్చీలో కూర్చునివున్న బరూష్ నా వైపు కొంచెం వంగి, నా సంభాషణను అత్యంత ఆసక్తితో వినడం మొదలుపెట్టారు.

"ప్రచ్ఛన్నయుద్ధం మంచి యుద్ధం" అన్న విషయాన్ని గురించి వెలెస్లీ కాలేజిలో మాట్లాడ దలచుకున్నాననే

సరికి, బరూచ్ హఠాత్తుగా నాకు అడ్డుతగిలి "ప్రచ్ఛన్న యుద్ధం ప్రస్తావన కట్టిపెట్టి, శాంతిసాధన కృషినిగురించి ప్రజలకు తెలియచెప్పనంతకాలం, ఈ సంఘర్షణ వాస్తవ స్వరూపాన్ని వారు గుర్తించలేరు" అని అన్నారు.

నేను బరూచ్ అమూల్య సలహాను స్వీకరించి, శాంతి సాధనకు చేయవలసిన కృషినిగురించి వెలెస్లీ కాలేజీలో ఉపన్యసించాను. తర్వాత కొద్దిరోజులకే అగ్నిపర్వతాలు ప్రేలి మహాప్రళయం ముంచుకొచ్చిందా అన్నట్లు ప్రపంచంలో భయంకర సంఘటనలు జరిగాయి. ఆ పరిస్థితులలో శాంతికోసం ప్రాకులాడడం అసహజంగా కన్పిస్తుంది. 1950 జూన్ 25 వ తేదీన ఉత్తర కొరియనులు దక్షిణ కొరియామీద దురాక్రమణ ప్రారంభించారు. వారి టాంకులు, శతఘ్నిదళాలు 38 వ అక్షాంశ రేఖను దాటి దక్షిణ కొరియాలోకి ప్రవేశించాయి. కమ్యూనిస్టులు రెండు నాల్కలతో మాట్లాడే తమ సహజ ధోరణిలో ఈ దురాక్రమణకు "శాంతి యాత్ర" అని నామకరణం చేసి, ప్రచారం ప్రారంభించారు. ఐక్యరాజ్య సమితికి చెందిన భద్రతాసంఘం కమ్యూనిస్టుల దండయాత్ర నిర్హేతుకమైన దురాక్రమణ చర్య అని ఖండించింది. దానిని నిరోధించడానికి సమితిలో సభ్యత్వంగల దేశాలన్నీ శాయశక్తులా సహాయం చేయాలని భద్రతా సంఘం ఆదేశించింది. ఐక్యరాజ్యాల సైన్యాలు దాని

ఆ దేశాన్ని అనుసరించి రంగంలో ప్రవేశించాయి. ఆ సైన్యాలలో అధిక భాగం అమెరికాకు చెందినవే. కమ్యూనిస్టు సైన్యాలను ప్రతిఘటించడంలో సమితిసైన్యాలు అనేక కష్టనిష్ఠురాలకు లోనయాయి. కొన్ని తాత్కాలిక విజయాలను పొందాయి. పరిస్థితి యేక్షణంలో ఏ విధంగా మారుతుందో ఊహించడానికి కూడా అవకాశం లేకపోయింది. వాలంటీర్లు అనే పేరుతో అనేక లక్షలమంది కమ్యూనిస్టు చైనా సైనికులు ఉత్తర కొరియనులకు తోడుగా రంగంలో ప్రవేశించడంతో, ప్రపంచ పరిస్థితి మరింత విషమించింది.

ప్రపంచ పరిస్థితి అతి భయంకరంగా పరిణమించినందున, 1950 డిసెంబరు 16-వ తేదీన ప్రెసిడెంట్ ట్రూమన్ అమెరికాలో జాతీయ ప్రమాద పరిస్థితి ఏర్పడిందని ప్రకటించారు.

ద్వితీయ ప్రపంచ యుద్ధంలో గెలుపొంది, విజయోత్సవాన్ని జరుపుకొని ఆరు సంవత్సరాలైనా తిరుగకముందే అమెరికాలో సైనిక సమీకరణచేసి, యుద్ధసాధనాలను అధికంగా నిర్మిస్తూ యుద్ధ సన్నద్ధం కావలసి వచ్చింది.

ఈ లోపునే, ఇరాన్, సాదీ అరేబియాలలోని నూనె గనులను కబళించడానికి రష్యా ఇంతకు ముందుకంటె సిద్ధంగా కూర్చున్నది. ఫ్రాన్సు, లెబనాన్, బ్రెజీల్,

ఇండొనీసియాలలోనేగాక మిగతా అన్ని దేశాలలోను కమ్యూనిస్టులు కల్లోలాన్ని ప్రజ్వలింప జేశారు. వారి విధ్వంసక చర్యలు, దుష్ప్రచారం, రోజు రోజుకూ ఎక్కువ కాజొచ్చినాయి. తనమీద ఏ క్షణంలో పిడుగు పడుతుందో నని పశ్చిమ యూరప్ భయంతో కంపిస్తున్నట్లుగానే, అట్లాంటిక్ రాజ్యాలకు ఎర్రసైన్యాల దండయాత్ర ప్రమాదం ఏర్పడింది.

కమ్యూనిస్టులు ప్రదర్శిస్తున్న ఈ ధోరణినిబట్టి, అనుసరిస్తున్న విధానాలనుబట్టి ప్రపంచ రాజ్యాలు ఇంతకు ముందెన్నడూ ఇంత ప్రమాదానికి గురి కాలేదనే విషయం నేను పూర్తిగా గ్రహించాను. ఆ కారణంచేతనే, శాంతి సాధనకు ఇదివరకెన్నడూ చేయని కృషిని ఇప్పుడు మనం ప్రారంభించాలని నాకు గట్టి విశ్వాసం ఏర్పడింది. ఈరోజున శాంతికోసం కృషి ప్రారంభించినా అది అందని దానికోసం అర్రులు చాచినట్లు కాజాల దని నా నిశ్చయాభిప్రాయం.

ఐక్యరాజ్య సమితి, మన రాజకీయ వేత్తలు ఎంతగా కృషి చేసినా, మూడవ ప్రపంచ యుద్ధం తప్పని సరిగా వచ్చే పరిస్థితులు కన్పిస్తున్నాయి. నిజంగా యుద్ధమే వస్తే శాంతి సాధనకు ఒక నిర్ణీత కార్యక్రమాన్ని తయారుచేసి యుద్ధంలోకి దిగాలి. ఆ కార్యక్రమం యుద్ధాన్ని సక్రమంగా నడిపించడానికి తోడ్పడుతుంది. యుద్ధంలో విజ

యం పొందడమే మన లక్ష్యం కాకూడదు, శాంతి సాధనకు యుద్ధం చేయాలి.

దూర దృష్టితోనూ, ధైర్యంతోనూ శాంతి సాధనా కృషిని మనం తక్షణం ప్రారంభిస్తే, మరొక ప్రపంచ యుద్ధం రాకుండా నివారించడానికి అవకాశం ఉన్నదనే నా వాదన. కానిపక్షంలో మనది శాంతి ప్రియుల స్వభావం కాదనే చెప్పాలి. ఈ సారి యుద్ధం సంభవిస్తే ఇంతకు ముందెన్నడూ కని విని ఎరుగ నంతటి దారుణ పరిణామాలు ఏర్పడ గలవు. ఆ యుద్ధాన్ని నివారించ లేకపోతే, మనం నాగరికుల మని చెప్పుకొనే అర్హత పోతుంది.

శాంతి సాధనా కృషిని చాకచక్యంతో ప్రారంభించాలంటే, మనచుట్టూ ఎటువంటి యుద్ధం సాగుతున్నదో ముందు గుర్తించాలి. సోవియెట్ రష్యా, కమ్యూనిస్టు రాజ్యాలు కాని వాటిమీద ఒక క్రొత్తరకం యుద్ధాన్ని ప్రారంభించింది. యుద్ధశాస్త్ర కోవిదుడు రియర్ ఆడ్మిరల్ బెర్న్ ఆండర్సన్ ఆ విషయం అతి ప్రధాన మైనదని చెప్పారు. యుద్ధం అనేమాట వినేసరికి మనలో చాలామందికి భయం వేస్తుంది. రక్త పాతం, కల్లోలం, హింసాకాండ, సైనికుల సంఘర్షణ, రోడ్లవెంట నిరాశ్రయుల ప్రవాహం మొదలైన దృశ్యా లన్నీ చటుక్కున జ్ఞాపకం వస్తాయి. యుద్ధ రంగంలో విజయాన్ని సాధించ

డమే యుద్ధంయొక్క లక్ష్య మని, విజయాన్ని పొంద డంతో యుద్ధం ముగిసి పోతుం దని మనలో చాలామంది అభిప్రాయం. సోవియెట్ రష్యా అభిప్రాయం మాత్రం కాదు. స్వతంత్ర రాజ్యాలమీద రష్యా సాగించే నిరంతర యుద్ధంలో, సైనిక సంఘర్షణ బహిరంగంగా కన్పించే ఒక భాగం మాత్రమే. రష్యా నాలుగు రంగాలలో ఈ యుద్ధం సాగిస్తున్నది. అందులో సైనిక సంఘర్షణ ఒక రంగం మాత్రమే. మిగతావి ఆర్థిక రంగం, రాజ కీయ రంగం, మానసిక రంగం. లెనిన్ వాటిని ఆ విధంగా విడదీసి వాటికి ఆయనే నిర్వచనాలు చెప్పాడు. పాత కాలపు సాంఘిక ఆచారాలను, పద్ధతులను రూపు మాప డానికి చేసే యుద్ధంలో పైన పేర్కొనబడిన నాలుగు రంగాలు అతి ముఖ్యమైనవని లెనిన్ ప్రకటించాడు. "కృత నిశ్చయంతో, నిర్దాక్షిణ్యంగా సాగించవలసిన యుద్ధంలో ఆ నాలుగుకూడా పరస్పరం ఆధారభూత మైనవి. ఒకవైపున రక్తపాతంతోకూడిన యుద్ధం జరుగు తూంటే, మరొకవైపున రక్తపాతంలేని యుద్ధాన్ని చెయ్యాలి. ఒకవైపున దౌర్జన్య చర్యలను జరుపుతూ వుంటే మరొకవైపున శాంతియుత చర్యలను సాగించాలి. అదేవిధంగా సైనిక రంగంలో జాగ్రత్త పడుతూ వున్నప్పుడే ఆర్థిక రంగంలో శ్రద్ధ వహించాలి. విద్యా రంగంపట్ల శ్రద్ధ వహిస్తూనే పరిపాలనా రంగంలో కట్టు

దిట్టాలు చెయ్యాలి." ఇవన్నీ బూజుపట్టిన సంఘం శక్తులను, సాంప్రదాయాలను నాశనం చెయ్యడానికి జరపాలని లెనిన్ అన్నాడు.

సైనిక రంగంలో సోవియెట్ రష్యా భారీ యుద్ధ యంత్రాలను, బ్రహ్మాండమైన సేనలను సమకూర్చు కొన్నది. దాని ఉపగ్రహ రాజ్యాల సైనికబలాన్ని కూడ సమీకరించు కొన్నది.

ఆర్థిక రంగంలో తన దేశాన్ని తన ఉపగ్రహ రాజ్యాలనూ యుద్ధసన్నద్ధం చేస్తూ, ఫ్యాక్టరీలలోను, వ్యవసాయ కేంద్రాలలోను ఉత్పత్తులను అతివేగంగా చేస్తున్నది. తన అధీనంలో లేని ఇతర దేశాల ఆర్థిక వ్యవస్థను ఛిన్నాభిన్నంచేసి కల్లోలాన్ని లేవదియ్యడానికి ప్రయత్నాలు చేస్తున్నది. ఆ దేశాలలో సమ్మెలను చేయించడం, విధ్వంసక చర్యలను జరిపించడం, కార్మికులు సక్రమంగా పనిచేయకుండా చేయడం మొదలైన వన్నీ రష్యా నిర్వహణక్రింద సాగుతున్నవే. కూలి తక్కువ ఇస్తున్నారని కార్మికులను రెచ్చగొట్టడం, ప్రభుత్వం శిస్తులు ఎక్కువ వసూలు చేస్తూందని రైతులను పురికొల్పడం ద్వారా కల్లోలాన్ని లేవదీయడానికి ప్రయత్నాలు చేస్తూంది.

రాజకీయ రంగంలో తన దేశప్రజలు స్వేచ్ఛగా వోటు చేయడానికిగాని, స్వతంత్ర అభిప్రాయాలు ప్రక

టించడానికిగాని లేకుండా చేసింది. స్వతంత్ర రాజ్యాలలో ఉన్న రష్యా ఏజెంట్లు ఆ దేశాల ప్రభుత్వాలు జరిపే ప్రతిచర్యమీద అక్కడి ప్రజలకు అనుమానం కలిగేటట్లు చేస్తారు. ఒక దేశంపైకి మరొక దేశాన్ని పురికొల్పడం, స్వతంత్రరాజ్యాలు తమ మధ్య చేసుకున్న ఒడంబడికలను, సంధులను భంగపరచడానికి ప్రయత్నించడం, ఐక్య రాజ్య సమితి సభ్యత్వంద్వారా ప్రపంచ సహకారానికి చేస్తున్న ప్రతి పనిని నిరోధించడం రష్యా విపరీతంగా సాగిస్తున్నది.

మానసిక రంగంలో, సంఘంలోని అన్ని తరగతుల ప్రజలమధ్యా కక్షలు, కార్పణ్యాలు, అనుమానాలూ కలిగించి పోరుపులు పెడుతున్నది. యజమానిమీద ఉద్యోగులచేత తిరుగుబాటు చేయించడం, మధ్యతరగతి ప్రజలను రైతులపైకి ఉసికొల్పడం, రష్యా ఆచరిస్తున్న కార్యాలు. మానవుడికి తోటివాణ్ణిచూస్తే మహాద్వేషం పుట్టుకొచ్చేటంత దారుణ విషబీజాలను రష్యా నాటింది. రాజకీయ, ఆర్థిక వ్యవహారాలలో అతి స్వల్ప విభేదాలు సంభవిస్తే, గోరంతవాటిని కొండంతలుగా చేసి ప్రచారం ప్రారంభిస్తున్నది. ఈ మహాత్కార్య సాధనకు కల్లోలాలను నిత్యం ఎక్కడో ఒకచోట లేవదీస్తున్నది. ఒకరికి ఇంకొకరికి మధ్య విద్వేషాన్ని పుట్టించడమే ఈ రంగంలో రష్యా వెచ్చిస్తున్న పెట్టుబడి.

అమెరికాపైన, ఇతర స్వతంత్ర రాజ్యాలపైన సోవియెట్ రష్యా క్రొత్తగా ప్రారంభించిన యుద్ధం ఇదే. ప్రపంచాధిపత్యాన్ని సాధించడానికి పైన పేర్కొనబడిన నాలుగు రంగాలలోను రష్యాయుద్ధాన్ని సాగిస్తున్నది. రష్యాకు పరాజయం కలిగించడానికి ఆ నాలుగు రంగాల లోనూ శాంతిసాధన కృషిని ప్రారంభించాలి.

ఈ మహా సాహసకార్యాన్ని సాధించడానికి భిన్న లక్ష్యాలు గలవారికి భిన్నమార్గాలు ఉంటాయి. ప్రజలలో చీలికలు కలిగించి, వారిని లోబరుచుకొని, తర్వాత బానిసలుగా తయారుచేయడమే రష్యాసంకల్పం. అందుకోసం దౌర్జన్య విధానాలను, హింసాకాండను, రష్యా ప్రయోగించక తప్పదు. వివిధదేశాల ప్రజలలో ఐకమత్యాన్ని చేకూర్చి, వారితో మనం సహకరించి, వారు స్వాతంత్ర్యం పొందడానికి, పొందిన స్వాతంత్ర్యాన్ని రక్షించుకోడానికి సహాయంచేయాలని ఆశిస్తున్నాము. మనం ప్రజాస్వామిక పద్ధతులను ముందుకూడ అనుసరించక తప్పదు.

ఇకనుంచి మనలోని ప్రతివారు శాంతిసాధనకు కృషి చేయాలి. వెంటనే దానిని ఆచరణలో పెట్టాలి. మనకు ఇప్పుడున్నది పోగొట్టుకోకుండా, మన ఆశయాలను, లక్ష్యాలను సఫలీకృతం జేసుకోవాలంటే స్వతంత్ర ప్రజలందరూ ఒకటై నిలబడాలి.

# శాంతి సాధనకై శాంతి సమరాన్ని జరపాలి

## 2-వ అధ్యాయము

యుద్ధానికి దిగేముందు, దాని భయంకర పరిణామా లను నిర్లక్ష్యం చేసినా, అవసరమైన ధనాన్ని ఖర్చు పెట్టకపోయినా, విజయాన్ని సాధించజాలమని మనకు తెలుసు. పైపెచ్చు, మన దేశంలోని మేధావంతుల సహాయంతో అద్భుతమైన యుద్ధవ్యూహాన్ని పన్ని, అది విజయవంతంగా అమలుజరగడానికి గుమ్మరించవలసిన ధనానికి వెనుతీయకుండా, మన ప్రతిభా సామర్థ్యాలను వినియోగిస్తేనే విజయం సిద్ధించగలదన్న పరమసత్యాన్ని మనం గుర్తించాము. రెండవ ప్రపంచయుద్ధ సమయంలో మన దేశంలోని అనేకమంది మేధావులు, ప్రజ్ఞావంతులు, దేశరక్షణకోసం సేవచేయడానికి రంగంలోకి దుమికిన విషయం మీరు మరువలేదనుకుంటాను. యుద్ధావసర కార్యాలకోసం అమెరికన్ కాంగ్రెసు కోట్లకు కోట్లు డాలర్లను మంజూరుచేసేది. మనమందరం నడుములు బిగించి అవసరమైన తుపాకులను, టాంకులను, విమా నాలను, నౌకలను త్వరత్వరగా తయారుచేసేవాళ్ళము. క్షతగాత్రులకు సేవచేసే రెడ్‌క్రాస్ సంస్థద్వారా మనవా రెందరో అమూల్యమైన సేవచేశారు.

యుద్ధం? అది అందరికి తేలికగా అర్థమయ్యేమాట. యుద్ధం దారుణసంఘర్షణల, భయంకరమైన పోరాటాల

సమ్మేళనం. ఆ దృశ్యాలన్నీ ప్రతివారికీ ప్రత్యక్షంగా కన పడేవి కాబట్టి దాన్ని అందరూ తేలికగా బలపరుస్తారు.

శాంతి? అది అగోచరమైనది. దానిగమనం అతి నిదానమైనది. పత్రికలలోని ప్రధాన శీర్షికలలో అది ఎక్కడా కన్పించదు. కాని, దానికోసం మనం బాగా శ్రమపడి కృషిచేస్తే, "శాంతి" ని మనం ప్రత్యక్షంగా చూడవచ్చును. శాంతి సాధనకోసం రాత్రింబగళ్ళు కృషి చేయాలన్న విషయాన్ని మనం గ్రహించలేక పోతు న్నాము. మనదేశంలో జరిగిన అంతర్యుద్ధంలో నేమి, రెండు ప్రపంచ యుద్ధాలలో నేమి సంభవించిన దారుణ పరిణామాలకు, శాంతికోసం కృషిచేయాలని గుర్తించలేని అజ్ఞానమే, అవివేకమే, మన ప్రధాన కారణాలు.

అంతర్యుద్ధం ముగిసిన తర్వాతకూడ "ఇతరులను ద్వేషించరాదు; అందరిపట్ల ధర్మ బుద్ధితో ప్రవర్తిం చాలి" అన్న అబ్రహాంలింకన్ ప్రవచనాలను ఉత్తర రాష్ట్రాలవారు పాటించి, దక్షిణ రాష్ట్రాలను విలీనం చేసుకొనడానికి శాంతి మార్గాలద్వారా కృషి చేసి నట్లయితే, శాంతి సౌమనస్యాలద్వారా అతి త్వరలో అభ్యుదయాన్ని పొందగలిగి వుండేవాళ్ళము. వ్యవసాయం చేసుకొనడానికి యంత్రపరికరాల నిమిత్తం, జీవనోపాధికి అవసరమైన ధనసహాయం నిమిత్తం, కొన్ని లక్షల డాలర్లు దక్షిణరాష్ట్రాల వారికి అప్పుగా ఇచ్చినట్లయితే,

మన సోదరులలో కొన్ని లక్షలమంది మనకు దక్కేవారు. అట్టి సహాయ సంపత్తులు ఆనాడే అందజేసినట్లయితే గొప్ప విపత్తునుండి మనం తప్పుకో గలిగేవాళ్ళము. ఒక్క రాత్రిలో అమెరికా సంయుక్తరాష్ట్రాలు మళ్ళీ ఒకటిగా అయిపోయేవి. ఉత్తర రాష్ట్రాలవారు దక్షిణాది వారికి ఆర్థిక సహాయాన్ని పంపడానికిబదులు, అవినీతి మార్గాలద్వారా డబ్బు దోచుకునే వారిని పంపింది. అంత యుద్ధం ముగిసి 50 సంవత్సరాలు గడిచినా, దక్షిణ రాష్ట్రాలలో ఉంటున్న ఉత్తరాది వారిపైన నాకు, అప్పుడు వారుచేసిన పొరపాటుకు ఆగ్రహం, విచారం రెండూ కలుగుతూ ఉంటాయి. ఆనాడే ఉత్తరాదివారు శాంతి కోసం కృషి చేయలేదు గదా అని దుఃఖం కలుగుతూ ఉంటుంది.

మొదటి ప్రపంచ యుద్ధం తర్వాతకూడ మనం దూర దృష్టితోను, పట్టుదలతోను శాంతికోసం కృషిచేసి నట్లయితే దానిని సాధించి వుండేవాళ్ళము. స్టాక్ హోం నుంచి సమర్ఖండ్ వరకూగల ప్రజలందరూ 'శాంతి'కోసం తహతహలాడారు. కాని మనంమాత్రం దానికోసం ప్రయత్నమైనా చెయ్యలేదు. నానాజాతిసమితిని కూడా కాళ్ళతో తన్నివేశాము. మనం తిరిగి మన 'ఒంటెత్తు' విధానానికి వచ్చేశాము. బ్రిటను, ఫ్రాన్సుల మధ్య అప నమ్మకాలు ఎక్కువకాజొచ్చినాయి. ఈ అవకాశాలు

హిట్లర్‌కు బాగా లాభించాయి. అందుచేత, హిట్లర్ మరొక యుద్ధానికి కావలసిన సామగ్రినంతా సమకూర్చుకున్నాడు.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం, శాంతికోసం కనీసం కొంత వరకైనా కృషి చేశామని అంగీకరించక పోవడం న్యాయం కాదు. ముఖ్యంగా గడచిన మూడు సంవత్సరాలలోనూ, ప్రెసిడెంటు ట్రూమన్ సిద్ధాంతం, మార్షల్ ప్రణాళిక, ఉత్తరఅట్లాంటిక్ సంధి ఒడంబడిక, సమష్టిరక్షణ సహాయ కార్యక్రమం, ఐక్యరాజ్య సమితిని బలీయం చేయడానికి చేస్తున్న ప్రయత్నాలు, అత్యంత వివేకంతో శాంతిసాధన కోసం చేస్తున్నకృషికి నిదర్శనాలు. నేటివరకూ మనం ఆ కృషిలో కృతకృత్యులం కాలే దనేచెప్పాలి. దానికి రెండు కారణా లున్నాయి. ప్రపంచాధిపత్యాన్ని పొందడమే సోవియట్‌రష్యా ప్రధాన ఆశయమని తెలుసుకోడానికి మనకు చాలాకాలం పట్టింది. అది మొదటికారణం. రష్యా నిగూఢ వాంఛ పట్ల మనం తెలియజేసిన అయిష్టతను, నిరాకరణను అది అతి నేర్పుతో స్వప్రయోజనాలకు ఉపయోగించుకున్నది.

ద్వితీయ ప్రపంచయుద్ధ విజయోత్సవాన్ని జరుపుకున్న తర్వాత మనం ఒక విధమైన నిర్లక్ష్య వైఖరిని ప్రదర్శిస్తూ వచ్చాము. యూరప్‌లోని మన సైన్యాల

నన్నిటినీ ఉపసంహరించి, దేనిని రష్యా కోరుకుంటున్నదో ఆ పనిని మనమే నెరవేర్చాము. మనం హాయిగా టెలివిజన్ యంత్రాలను, రేడియోలను తిప్పుకుంటూ కాలం గడపడం ప్రారంభించాము. రష్యా మాత్రం రాడార్ పరిశోధనలను సాగించినది. దురాక్రమణకు ప్రణాళికలు తయారుచేసింది. బ్రహ్మాండంగా యుద్ధ సన్నాహాలు చేసింది. ఎర్రసైన్యం బలంతో పోలెండ్, హంగరీ, రుమేనియా, బల్గేరియా దేశాలను రష్యా తన వలలో చిక్కించుకొన్నది.

కమ్యూనిస్టు కుట్రదారులు చెకోస్లొవాకియాలో సైనికకుట్ర జరిపి ప్రభుత్వాన్ని వశపరుచుకొన్నారు. ఇతర స్వతంత్ర రాజ్యాలను కబళించడానికి నాందీ ప్రస్తావనగా స్వతంత్ర రాజ్యాలలోని కమ్యూనిస్టులకు మాస్కో కొన్ని ఆదేశాలు పంపింది. ఆ రాజ్యాలలోని ప్రజాస్వామిక ప్రభుత్వాలను కూలద్రోయాలనీ, కార్మికులు, కర్షకులు, ఉత్పత్తులను నిరోధించాలనీ, అల్లకల్లోలాన్ని లేవదీయడానికి ఇతర విధ్వంసక కార్యకలాపాలన్నీ సాగించాలనీ రష్యా ఆ రాజ్యాలలోని కమ్యూనిస్టులకు ఆదేశాలు పంపింది. చైనా కమ్యూనిస్టు నాయకుడు మో-సే-టుంగ్ దూరప్రాచ్యంపై సంపూర్ణాధిపత్యం పొందడానికి, మాస్కో ఆదేశానుసారం ప్రణాళికలు తయారుచేస్తున్నాడు.

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత శాంతిని సాధించ లేకపోవడానికి రెండవకారణం, దానికి అవసరమైన మహత్తర కృషిని మనం గ్రహించలేక పోవడం. శాంతి సాధనకు తొలిచర్యగా ఐక్యరాజ్యసమితిని బలీయంచేయ డానికి పూనుకొన్నాము. ప్రపంచంలోని మిగతా రాజ్యాలపట్ల మన ఔదార్యాన్ని, అభిమానాన్ని బహి రంగంగా ప్రకటించాము. యూరప్‌లోని బాధితులకు టన్నులకొద్దీ ఆహారపదార్థాలను, వస్త్రాలను పంపాము. ప్రపంచ యుద్ధ విజయోత్సవదినం మరు సంవత్సరం బ్రిట నుకు 3,75,00,00,000 డాలర్లు అప్పుగా ఇచ్చాము. యూరప్‌కు తాత్కాలిక సహాయ ప్రణాళిక క్రింద 55,50,00,000 డాలర్లకుపైగా సహాయం పంపాము. ఐక్యరాజ్యసమితి పునరావాస, పునరుద్ధరణశాఖ క్రింద 2,50,00,00,000 డాలర్లకు పైగా వ్యయపరిచాము. చైనాలో అనేక కోట్ల డాలర్లు ఖర్చు చేశాము. ప్రపంచ బ్యాంకుకు సహాయం చేశాము. అమెరికా ఆర్థిక సహాయ నిర్వహణశాఖ ఉద్భవించక పూర్వమే, ఒక్క యూరప్‌కే సుమారు 12,00,00,00,000 డాలర్లు సహాయం చేశాము. ఒక సమగ్రమైన ప్రణాళికను తయారు చేయకుండా, వారి అవసరాలనుబట్టి ఆదరా బాదరా ఈ సహాయాన్ని పంపడంవల్ల సంపూర్ణ ప్రయోజనం కలగని మాట యదార్థమే. క్రెమ్లిన్

కలిగించిన అల్లకల్లోలాన్ని అణచడానికి ఈ సహాయం సరిపోలేదు.

అయితే శాంతి సాధనకు ఇంకే విధంగా కృషి చెయ్యాలి? ఈప్రశ్నకు అనేక మంది అనేక రకాల సమాధానాలు చెప్పారు. వాటన్నిటిలోనూ, రెండు మాత్రం (దృక్పథాలు భిన్నమైన వైనా) అతి ప్రధాన మైనవి. సోవియట్ రష్యాతో మనం సక్రమంగా వ్యవహరించడానికి అవకాశమున్న దని వాదించే ఒక వర్గం అమెరికనులలో ఉన్నది. కాని, ఈ వర్గం క్రమక్రమంగా క్షీణిస్తున్నది. రష్యా ఎలాగూ అమెరికామీద దాడి చేయనున్నది కాబట్టి, మనమే ముందు యుద్ధం రష్యామీద ప్రకటించాలని వాదించే మరొక అమెరికన్ వర్గ మున్నది. ఈ రెండవ వర్గంయొక్క బలం రోజురోజుకూ హెచ్చుతున్నది. యుద్ధ మనేది అసలు రాకుండా చేయాలనే వారి అభిప్రాయాన్ని ఈ రెండవ వర్గంవారు బలపరుస్తున్నారని చెప్పవచ్చును. ఈ రెండు వాదాలు పరిశీలించ తగినవే.

పశ్చిమ యూరప్‌ను లోలోపల కుట్రలద్వారా, కల్లోలాలద్వారా వశపరచుకోడానికి రష్యా చేస్తున్న కుతంత్రాలను నిర్శోధించి, రష్యా ఆటకట్టిస్తే, దురాక్రమణ వాంఛను విడనాడి సోవియట్ ప్రజల అభ్యుదయానికి రష్యా తన శక్తిని కేంద్రీకరిస్తుందేమో నని

ద్వితీయ ప్రపంచయుద్ధం ముగిసినతర్వాత కొన్నాళ్ళ వరకూ అనుకుంటూ ఉండేవాణ్ణి. చెకోస్లావాకియాను రష్యా కమ్యూనిష్టుల కుట్రలద్వారా వశపరచుకున్నది. రష్యా ఆనాటినుంచి ఈనాటివరకు తన ఆదాయంలో నూటికి 35 వంతులను సాయుధబలాల నిర్మాణానికి, తన దేశంలోని వ్యతిరేక శక్తులను అణిచివేయడానికి ఉపయోగిస్తున్నది. రష్యా యుద్ధ ప్రయత్నాలకు చేస్తున్న ఈ వ్యయం తగ్గించుకుంటే, తన ప్రజల జీవన ప్రమాణాలను పెంపొందించడానికి ఆ మొత్తాన్ని వినియోగించవచ్చును. ఇది చాల మంచిమార్గమనీ, రష్యాకూడ త్వరలోనే ఈ విషయాన్ని గుర్తిస్తుందనీ ఆశించాను. తాను, తనతోపాటు ఇతరులు, సుఖంగా జీవించడానికి రష్యా తన బుద్ధిని మార్చుకోగలదని నేను విశ్వసించాను.

ఈ విషయంలో, రాజకీయ దృష్ట్యా నేనుకూడ నాతోడి అమెరికనుల మాదిరిగానే తప్పుడు అంచనా వేశానని ఒప్పుకుంటున్నాను. అది మా సహన భావానికి నిదర్శనం కావచ్చునుగాని రాజకీయంగా తప్పటడుగే అని చెప్పాలి. తూర్పు ఐరోపా రాజ్యాలను తన చేజిక్కించుకోనడం రక్షణ చర్య అని రష్యా తన్ను తాను సమర్థించుకోడానికి ఎంత ప్రయత్నించినా, ప్రపంచాధిపత్యాన్ని పొందడానికి, తన దేశంచుట్టూ ఉన్న

దేశాలను తన అదుపు ఆజ్ఞలలో పెట్టుకొనడానికి చేస్తున్న ప్రయత్నమే నని స్పష్టపడిపోయింది. రష్యా తలపెట్టిన దురాక్రమణ యాత్రలో ఆ దేశాలు మజిలీల వంటివి.

మార్షల్ ప్రణాళిక అమలులోకి రావడానికి పూర్వమే, 1947 జూలైలోనే రష్యా ఉద్దేశ్యాలు ఏమిటో తెలిసి పోయినాయి. జార్జి మార్షల్ ఇటీవల హార్వర్డు విశ్వ విద్యాలయంలో ఇచ్చిన ప్రసంగంలో, యూరపులోని రాజ్యాలన్నీ ఛిన్నాభిన్నమైన తమ ఆర్థిక వ్యవస్థలను సరి చేసుకోడానికి పరస్పర సహకారంతో సమష్టి కృషి సాగించాలని ఉద్బోధించారు.

ఆర్థిక వ్యవస్థ పటిష్ఠంగా లేని పక్షంలో రాజకీయ స్థిరత్వం చేకూర దనీ, ఆ కారణంగా ప్రపంచంలో శాంతి ఏర్పడడం అసంభవ మనీ, వాటిని సమకూర్చి ఆ మహా త్కార్యాన్ని నెరవేర్చడానికి అమెరికా తన సర్వస్వం ధారపోయాలనీ, ఆయన తన ప్రసంగంలో పేర్కొ న్నారు. ఒక దేశంలోగాని, ఒక సిద్ధాంతం విషయంలో గాని జోక్యం కలిగించుకొనడం అమెరికా ఉద్దేశ్యం కాదనీ, దారిద్ర్యాన్ని, క్షామబాధను నివారించి కల్లోల పరిస్థితులు ఏర్పడకుండా కాపాడడమే అమెరికా లక్ష్య మనీ మార్షల్ ఆ ప్రసంగంలో స్పష్టంగా చెప్పారు.

అట్టి సహాయాన్ని చేయడానికి అమెరికా యెట్టి షరతులను గాని, నిబంధనలను గాని విధించడంలేదు. రాజకీయంగా స్వార్థ ప్రయోజనాలకోసం ప్రజలకు దుర్భర పరిస్థితులు కలిగించడానికి ప్రయత్నించే ప్రభుత్వాలను, రాజకీయపక్షాలను అమెరికా శత్రువులుగా పరిగణిస్తుందన్న విషయం మాత్రం అందులో ఇమిడి వున్నది. వివేకవంతులు దానిని అంగీకరిస్తారు. అమెరికా సహృదయతతోను, గాఢ విశ్వాసంతోనూ ఈ సహాయం చేస్తా నని ముందుకువచ్చింది. స్వేచ్ఛా, స్వాతంత్ర్యం, శాంతి సుస్థిరంగా నిల్చి, మానవులు సుఖజీవనం చేయగలిగే నూత్న ప్రపంచ నిర్మాణానికి పునాదులు వేయాలనే సత్సంకల్పంతో అమెరికా యీ సహాయం చేస్తానంటున్నది.

అమెరికా చేస్తానన్న సహాయానికి బ్రిటిష్ విదేశాంగ మంత్రి బెవిన్ ముగ్ధుడై, తక్షణం ఫ్రెంచి విదేశాంగ మంత్రి జార్జి బిదాకు కబురుచేశారు. వారిద్దరూ కలిసి రష్యా విదేశాంగ మంత్రి మాలటోవ్‌ను సంప్రతింపులకు రమ్మని ఆహ్వానం పంపారు. పదిరోజుల అనంతరం వారు ముగ్గురూ పారిస్‌లో సమావేశమైనారు. ఐరోపా రాజ్యాలన్నీ పరస్పర సహకారంతో సమష్టిగా కృషి చేయడానికి అంగీకారం కుదరగలదని వారి తొలి సంప్రతింపులప్పుడు అనుకున్నారు. కాని సంప్రతింపులు ప్రారంభమైన ఆరవరోజున మాలటావ్ 'అవును, కాదు,' అని ఎవరి

తో నూ ఏమీ చెప్పకుండా సమావేశంనుంచి బయటికి వచ్చి విమానంలో మాస్కో వెళ్ళిపోయారు. రష్యా ఉపగ్రహ రాజ్యాలైన పోలెండు, హంగరీ, బల్గేరియా, రుమేనియా, ఆల్బేనియా, యుగోస్లావియా దేశాలు మాస్కో ఆదేశాల ననుసరించి తర్వాత కొద్ది రోజులకే జరిగిన అఖిల ఐరోపా సమావేశానికి పంపిన ఆహ్వానాలను తిరస్కరించాయి. మార్షల్ సహాయానికి సంబంధించిన సంప్రతింపులలో పాల్గొనరాదని రష్యా చెకొస్లొవాకియాను బలవంతపెట్టడం జరిగింది.

మాలటోవ్ ఆ సమావేశం నుంచి హఠాత్తుగా నిష్క్రమించడం రష్యన్ ప్రతినిధులు మామూలుగా చేసే చర్య కాదు. యదార్థం చెప్పాలంటే, రష్యా ఐరోపాలోని స్వతంత్ర రాజ్యాలమీద ప్రచ్ఛన్న యుద్ధానికి దిగడానికి నాందీ ప్రస్తావన జరిగిందన్నమాట. రష్యా పరిపాలన ప్రస్తుత సోవియెట్ పాలకుల చేతుల్లో శాశ్వతంగా ఉండిపోవడానికి స్వతంత్ర రాజ్యాల ఆర్థిక సముద్ధరణను వ్యతిరేకించడమేగాక స్వతంత్ర రాజ్యాలనే నాశనం చేయాలని పోలిట్ బ్యూరో చేసిన నిర్ణయానికి మాలటోవ్ నిష్క్రమణ ప్రతిబింబం. ఈ రెండు లక్ష్యాలను ఏకకాలంలో సాధించడానికి ఒక సాధనంగా 1947 సెప్టెంబరులో రష్యా కోమిన్ ఫారమ్‌ను స్థాపించింది. మార్షల్ ప్రణాళిక అమెరికా సామ్రాజ్య విస్తరణ

వాంఛకు ముఖ్య సాధన మని ప్రచారం ప్రారంభించి, దానిని ప్రతిఘటించే ఉద్దేశ్యంతో దానిని స్థాపించింది. మార్షల్ ప్రణాళిక అమలులోకి వచ్చిన మూడు సంవత్స రాలలోనే, స్వతంత్ర రాజ్యాల సముద్ధరణకు మనం చేస్తున్న అన్ని ప్రయత్నాలనూ క్రొత్త విధానాలతో విఫలం చేస్తూ వచ్చింది. అంతకు పూర్వం చేసుకొన్న ఒడంబడికలను రద్దు చేసింది. ఒప్పందాలను ఉల్లంఘించ డం ప్రారంభించింది. మన దేశాన్ని, ఇతర స్వతంత్ర రాజ్యాలనూ అది బెదిరించిన సందర్భాలు అనేకం ఉన్నాయి.

అమెరికాపట్ల రష్యా ఇటీవల అవలంబిస్తున్న విధా నాలలోను, జరుపుతున్న చర్యలలోను, అది ఎన్ని వాగ్దా నాలను భంగం చేసిందో ఈ క్రింద ఉదహరిస్తున్నాను:

1. 1943 లో టెహరాన్‌లో జరిగిన సమావేశంలో పోలెండ్, తదితర రాజ్యాలలో ప్రజాభీష్టానుసార ప్రభు త్వాలు ఏర్పరుచుకొనే హక్కును కలుగ చేస్తా మని రష్యా వాగ్దానం చేసింది. ఒక్క సందర్భంలోకూడా రష్యా ఈ వాగ్దానాన్ని పాటించ లేదు.

2. 1945 లో పోట్స్‌డమ్‌లో జరిగిన సమావేశంలో జర్మనీలో ప్రజాస్వామిక పద్ధతులపై ఏర్పడిన అన్ని రాజకీయ పక్షాలకు ప్రోత్సాహ మిస్తానని రష్యా హామీ

ఇచ్చింది. రష్యన్ ఆక్రమణ క్రిందగల జర్మనీలోని కమ్యూనిస్టుల ఆధిపత్యం క్రింద ఏర్పడిన సోషలిస్టు యూనిటీ పార్టీని మాత్రం బలపరచి మిగతా అన్ని రాజకీయ పక్షాలనూ రష్యా అణగద్రొక్కి వేసింది.

3. నిరాయుధులుగా చేయబడిన జపాన్ సైనికులను స్వదేశానికి తిరిగి వెళ్ళనిస్తానని పోట్సుడమ్ సమావేశం లోనే రష్యా వాగ్దానం చేసింది. రష్యా అధీనంలో నున్న 377,000 మంది జపాన్ యుద్ధఖైదీలలో 95,000 మందిని మాత్రమే స్వదేశానికి తిరిగి పంపింది.

4. ఐక్యరాజ్యసమితి భద్రతాసంఘం కార్యకలాపాలలో ప్రతిష్టంభన కలిగించడానికి ఉద్దేశ్యపూర్వకంగా "వీటో" అధికారాన్ని ఉపయోగించరాదని 1945 జూన్ 7 వ తేదీన జరిగిన అగ్రరాజ్యాల సమావేశం నిర్ణయాన్ని రష్యా ఆమోదించింది. ఆనాటినుంచి, రష్యా "వీటో" అధికారాన్ని ఉపయోగించిన సందర్భాలు 47 వరకు ఉన్నాయి.

5. బెర్లిన్‌లో వైమానిక నిబంధనలను సడలించిన కారణంగా రష్యాకు నైతికంగా కలిగిన అపజయం అనంతరం, తూర్పు, పశ్చిమ జర్మనీలమధ్య రాకపోకలు అవిచ్ఛిన్నంగా సాగనీయాలని 1949 జూన్ 20 వ తేదీన పారిస్‌లో జరిగిన సమావేశంలో రష్యా అంగీకరించి,

1950 మొదల్లోనే ఆ రెండు ప్రాంతాలమధ్య రాక పోక లకు అవరోధాలు కలిగించింది.

6. కొరియాకు క్రమంగా స్వాతంత్ర్యాన్ని కలుగ చేయడానికి అంగీకరించి, ఉత్తర కొరియా పరిస్థితులను పరిశీలించడానికి ఐక్యరాజ్య సమితి పంపిన కమీషన్ ఉత్తర కొరియాలో అడుగుపెట్టడానికి నిరాకరించింది.

కొరియాలో సోవియెట్ రష్యా నిర్వహిస్తున్న పాత్ర, అనుసరిస్తున్న విధానాలు రష్యా దురాక్రమణ యాత్ర లోని ఒక భాగమే. యూరప్‌లో తను చేస్తున్న ఇంద్ర జాలాన్నే రష్యా తిరిగి కొరియాలో ప్రదర్శిస్తూంది. ఇట్టి పరిస్థితులలో స్టాలిన్‌తో సమాధానం కుదుర్చుకోవాలని ప్రయత్నించడంవల్ల ఫలించే దేమీ లేదు. పైగా, స్టాలిన్ చాల కఠినమైన షరతులు కోరుతున్నారు. పశ్చిమ యూరప్ ఆయుధ పునర్ధారణ కార్యక్రమాన్ని మనం ఉపసంహరించు కోవాలట. తూర్పు జర్మనీని సంపూ ర్ణంగా తమ అధీనంచేసి పశ్చిమ జర్మనీమీద పెత్తనం చేయడానికి కొంతవరకు అవకాశం ఇవ్వాలట. ఫార్మోజా లోని సప్తమ సైన్యాన్ని, కొరియాలోని మన సేనలను ఉపసంహరించి ఆగ్నేయాసియా నంతనూ రష్యా, కమ్యూ నిస్టు చైనాలకు కట్టబెట్టాలట. స్టాలిన్ గొంతెమ్మ కోర్కెలు అంతటితో ఆగలేదు. జపాను భవిష్యత్తును

రూపొందించే విషయంలో నిర్ణయాధికారం తనకే వుండాలనీ, ఐక్యరాజ్య సమితిలో ఇప్పుడు జాతీయ చైనాకున్న సభ్యత్వాన్ని కమ్యూనిస్టు చైనాకు కట్ట బెట్టాలనీ అంటున్నారు. వీటన్నింటినీ మించినకోర్కె మరొకటి ఉన్నది. ప్రపంచంలోని అన్ని ప్రాంతాలను కమ్యూనిస్టుమయం చేసి, అమెరికాను ఏకాకిగా నిలబెట్టి, స్వాహా చేయాలని స్టాలిన్ తలపోస్తున్నారు.

స్వతంత్ర రాజ్యాలన్నీ శక్తి సామర్థ్యాలు కలిగివున్నా యనీ, ఐకమత్యంతో వ్యవహరిస్తున్నా యనీ, దురా క్రమణ దారుల ఆట కట్టించడానికి దృఢ సంకల్పంతో వున్నాయనీ స్టాలిన్‌కు, ఆయన జోహుకుందారులకు గుణపాఠం నేర్పినరోజున, శాంతి రాయబారాలు ఫల ప్రదమవుతాయి. ఆ రోజు వచ్చేవరకు, ఈ లోపల ఎంత ప్రయత్నించినా ప్రయోజనం లేదు. ముమ్మాటికీ లేదు. అయితే, రష్యా దురాక్రమణను అరికట్టగల యుద్ధం చెయ్యడం మాటేమిటి? ఆ యుద్ధం చెయ్యా లంటున్నవారి వాదం యిది: "మనం ఇప్పుడే బాంబు విసురుదాం. కొరియామీద కమ్యూనిస్టులు చేసిన దండయాత్ర, సాగిస్తున్న యుద్ధం, రష్యా యుద్ధోన్మా దాన్నీ దురాక్రమణ వైఖరినీ స్పష్టంచేస్తున్నాయి.

"రష్యా తీరుబాటుగా యుద్ధసన్నాహాలు పూర్తి చేసుకొని పెరల్ హార్బరుమీద జరిగినట్లు అకస్మాతుగా ముట్టడి జరిపేవరకు మనం ధర్మపరులులాగ చేతులు ముడుచుకొని కూర్చొనడం ఎందుకు ?"

అనేకమంది ఈ విధంగా ఎందుకు అంటున్నారో, దానికి కారణాలేమిటో నాకు తెలుసు. శాంతి సాధనలో నాకు సంపూర్ణ విశ్వాసమున్నా, నిర్బంధాలతో కూడిన శాంతిని అంగీకరించ లేను. సెనేటర్ వాన్ డెన్ బర్గ్ 1949 వ సంవత్సరంలో డార్ట్‌మత్ కాలేజిలో చేసిన ప్రసంగంలో "బుజ్జగింపు విధానం అవలంబించడం, ఒక్క సారి కాకుండా కొద్దికొద్దిగా శత్రువుకు లొంగిపోవడమే" అని ఆయన అన్న మాటలతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. జనరల్ మార్షల్ కూడ 1950 వ సంవత్సరంలో యుద్ధవీరుల స్మారక సభలో మాట్లాడుతూ, వాన్ డెన్ బర్గ్ వాదాన్ని బలపరిచారు.

మార్షల్ ఆ ప్రసంగంలో ఇంకా ఇలా చెప్పారు : "రెండు ప్రమాదాలలో ఒకదాన్ని మనం కోరుకోవలసి వచ్చినప్పుడు సహజంగా తక్కువ ప్రమాదం కలిగించే దానినే కోరుకొంటాము. ఆ దృష్టితోతప్ప, యుద్ధాన్ని ఎవరూ కోరుకోరు. దురాక్రమణదారులను బుజ్జగించడం కంటె యుద్ధమే మంచిది. ఎందువల్లనంటే దురాక్రమణ

చర్యలను నివారించడానికి ప్రయత్నించే మనం, దురా క్రమణదారులను బుజ్జగించడం మొదలుపెడితే, అది దురా క్రమణజరపడానికి వారిని ప్రోత్సహించడమే కాగలదు".

పైన చెప్పిన విషయాలు యథార్థమైనవే అయినప్ప టికీ, నేడు మానవ జాతిని యుద్ధంలోకి దింపడం తప్ప వేరే గత్యంతరం లేదని నేను అనుకోవడం లేదు.

యాటం బాంబులు ప్రయోగించి కమ్యూనిజాన్ని అణగద్రొక్కడానికి ప్రయత్నించడం నేలవిడిచి సాము చేయడం వంటిది. క్రెమ్లిన్ యుద్ధాన్ని తలపెట్టకుండా చేయగల యుద్ధానికి నివారణగా యుద్ధంలోకి దిగడ మంటే, మేధాశక్తిని ఉపయోగించవలసిన చోట ఆవే శాన్ని, ప్రశాంతతను ప్రదర్శించవలసిన చోట అలజడిని కలుగజేయడమన్న మాట. యుద్ధాన్ని యుద్ధంతో నివారించలేము.

కీర్తిశేషుడైన వెండెల్ విల్కీ 1942 వ సంవత్సరం వేసవిలో విమానంలో ప్రపంచ పర్యటన చేసివచ్చి, ప్రపంచంలోని అన్ని ప్రాంతాలవారికీ అమెరికాపట్ల అపరిమితమైన సుహృద్భావ మున్నదని వెల్లడించారు. అమెరికా దురాక్రమణ వాంఛలు లేనిదేశమనీ, ఉదార బుద్ధిగల దేశమనీ విదేశాలలో ఆనాడు కలిగిన అభి ప్రాయాలనే వెండెల్ విల్కీ ప్రత్యక్షంగా చూచి

వచ్చారు. రెండవ ప్రపంచయుద్ధ ప్రారంభంలో మనకు అపజయాలు కలిగినా, మన పూర్వపు మిత్రులకు విజయాలు సిద్ధించినా, శత్రువులు మనమీద దాడి ప్రారంభించేవరకూ సహించి ఊరుకొన్నందున ప్రపంచ సంఖ్యలో అధిక సంఖ్యాకులు మన నైతిక ప్రవర్తనను ప్రశంసించారు. మనకు సహాయం చేయడానికి ముందుకువచ్చారు.

వెండెల్ విల్కీ ప్రపంచ పర్యటన ముగించివచ్చిన తర్వాత, కొలది సంవత్సరాలకు రెండవ ప్రపంచయుద్ధం ముగిసింది. శాంతి భద్రతలను నెలకొల్పడంలో అమెరికా తోడ్పడింది. ఇతర దేశాల పునరుద్ధరణకు సహాయం చేసింది. మనం సామ్రాజ్యవాదులమనీ, యుద్ధోన్మాదులమనీ రష్యా ప్రపంచ విస్తృతంగా ప్రచారం ప్రారంభించింది. కాని ప్రపంచంలోని మెజారిటీ దేశాలు అమెరికా శాంతి స్వాతంత్ర్యాలకు చిహ్నమనీ, దురాక్రమణ నిరోధానికి తమ మిత్ర దేశమనీ భావిస్తున్నాయి. అమెరికా ఈ నాడు దురాక్రమణకు దిగినదంటే, దానికి నైతిక పతనం ప్రారంభమైనట్లే. శాంతిని సాధించగలమనే ధైర్యాన్ని, దానికి కావలసిన ఆత్మనిగ్రహాన్ని, మానసిక బలాన్ని కోల్పోయిందన్నమాట. నిస్పృహ, నిరాశల మధ్య చిక్కుకొని, అమెరికాయే అందరికంటే ముందు దౌర్జన్యానికి దారి తీసిందన్నమాట.

యుద్ధాన్ని నివారించడానికి యుద్ధం ప్రారంభించడం దురాక్రమణతో సమానమే. దురాక్రమణ మిగతా అందరి విషయంలోను నైతికంగా అపరాధమయితే, మన విషయంలోనూ అపరాధమే. నైతిక విలువలు శాంతి కాలంలో ఒక విధంగాను, యుద్ధకాలంలో మరొక విధంగాను ఉండజాలవు. సౌశీల్యం మన ముఖ్యసంపద. మనము చేసే పనులు మన అంతరాత్మ ఆమోదాన్ని, మానవజాతి ఆమోదాన్ని పొందగలిగినంతకాలమే మన ఆత్మ గౌరవాన్ని నిలబెట్టుకోగలమని నా పరమవిశ్వాసం.

యుద్ధాన్ని నివారించడానికి యుద్ధం చేయాలనే సిద్ధాంతం ఎన్నడూ విజయాన్ని సాధించలేదు. అమెరికా బాంబరు విమానాలు ఒక అర్ధరాత్రి మన రహస్య స్థావరాలనుంచి యాటంబాంబులతో రష్యామీదకు బయలు దేరా యనుకోండి. మాస్కోమీద, లెనిన్‌గ్రాడ్‌మీద, రష్యాలోని ఇతర పారిశ్రామిక కేంద్రాలమీద బాంబులు వేయాలని సంకల్పించుకొన్నా యనుకొందాము. ఎట్టి అవరోధాలు లేకుండా ఆ విమానాలు అక్కడికి చేరి, రష్యా యుద్ధసామగ్రిని నాశనంచేసి రాగలవా? ఈ ప్రశ్నకు సరియైన సమాధానం నేనూ చెప్పలేను. ఇతరులూ చెప్పలేరు. యుద్ధసామగ్రిని తయారుచేసే అనేక రష్యను ఫ్యాక్టరీలు ఎక్కడో రహస్య స్థలాలలో నిర్మించబడ్డాయి.

ఈ ప్రయత్నాన్ని నిష్ఫలం చేయడానికి చాలినన్ని రాడార్ కేంద్రాలు గాని, విమాన విధ్వంసక శతఘ్నులు గాని రష్యాకు లేకపోవచ్చును.

ఒకవేళ మనం రష్యాలోని అనేక పట్టణాలను, కొన్ని ఫ్యాక్టరీలను నాశనం చేయగలిగా మనుకొందాము. అయినప్పటికీ రష్యా తన 175 డివిజన్‌ల సైనికబలంతో యుద్ధాన్ని సాగించగలదు. పశ్చిమ ఐరోపారాజ్యాల సైన్యాలన్నిటినీ చేర్చుకొన్నా రష్యా సైన్యాలను ప్రతిఘటించలేము. జర్మనీలో ఉన్న అమెరికా, బ్రిటను, ఫ్రాన్సుల కొద్దిపాటి సైన్యం, ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక క్రింద ఫ్రాన్సు, ఇటలీ, బెల్జియం, నార్వే, డెన్మార్క్, హాలెండు దేశాలలో ఉన్న కొద్ది సైనిక దళాలు కలిసినా రష్యా సైన్యాలను ఓడించలేవు. యూరప్‌లోని అనేక స్వతంత్ర రాజ్యాలు దెబ్బ తింటాయి. దురాక్రమణ పరులను యూరప్‌నుంచి తరిమి వేయడానికి యుద్ధాన్ని ప్రారంభించవలసి వస్తుంది. మనం విజయాన్ని సాధించడానికి ఎంతకాలం పడుతుందో ఎవరూ చెప్పలేరు. పరిస్థితి చేయిదాటి పోవకముందే విజయాన్ని సాధించి తీరుతామని గట్టిగా చెప్పగలను. కాని దీర్ఘకాలం ఘోరయుద్ధాన్ని సాగించవలసివస్తుంది. యుద్ధాన్ని నివారించడానికి యుద్ధం చేయాలనేవారు ఊహించేటంతటి తక్కువ వ్యవధిలో యుద్ధం పూర్తికాక

పోగా, వారు ఆశించే ఫలితాలకు వ్యతిరేకమైన ఫలితాలు వస్తాయి.

మనం తొందరపడి బాంబులు ప్రయోగిస్తే పైన పేర్కొన్న దారుణ పరిస్థితి ఏర్పడుతుంది.

ఇంతేగాక, "నివారణ యుద్ధం" జరపాలంటూ అమెరికాలో ఉద్యమం ప్రారంభమైతే, విదేశాలలో మనకు అపార నష్టం సంభవిస్తుంది.

సోవియెట్ యూనియన్ దురాక్రమణ యుద్ధాన్ని ప్రకటించకుండా నిరోధించడానికి పశ్చిమ యూరప్ రాజ్యాలు సంపూర్ణంగా మనతో కలుస్తున్నాయి. సోవియెట్ యూనియన్‌పై మనం దురాక్రమణ యుద్ధాన్ని జరిపినట్లయితే – అదిసమంజస మైనదైనా – మనతో కలవడానికి అవి ఇష్టపడవు. ఆ యుద్ధం పేరు చెపితేనే యూరప్‌లోని రాజ్యాలవారికి భయం పుట్టుకొస్తుంది. యుద్ధాలపట్ల వారు చాల విసుగుదలతో ఉన్నారు. ఒక తరంలోనే వారు రెండు ప్రపంచ యుద్ధాలను చూశారు. ఆ భయానక దృశ్యాలనూ, బీభత్స పరిస్థితులనూ వారు ఇంకా మరిచిపోలేదు. ఆ యుద్ధాల సందర్భంలో జరిగిన రక్తపాతానికి అంతు లేదు. నేలమీద పచ్చని గడ్డి అంతా రక్తంతో తడిసి, ఎర్రగా అయిపోయింది.

యూరప్‌లోని అనేక ప్రాంతాలు శిథిలమైపోయి నాయి. ఇప్పు డిప్పుడే ఆ ప్రాంతాలవారు ఆ దెబ్బలనుండి కోలుకొంటున్నారు. తమ పొలిమేరలలోకి మళ్ళీ యుద్ధం వస్తుందనే భావం కలిగితేనే వారు గజగజలాడి పోతున్నారు. సోవియెట్ రష్యా దురాక్రమణ చర్య లను నిరోధించడానికి ధైర్యోత్సాహాలతో మనప్రక్క చేరిన ఐరోపా రాజ్యాలకు, మనం ముందు దురాక్రమణ యుద్ధాన్ని ప్రారంభిస్తామనే అనుమానం కలిగినా ఈ సమష్టి ప్రయత్నం విఫలమైపోతుంది.

యుద్ధాన్ని ప్రారంభించి బాంబులు ప్రయోగించా లని అమెరికాలో తరుచుగా వినపడితే మనమే యుద్ధా నికి కాలుదువ్వుతున్నామని సోవియెట్ రష్యా ప్రచారం చేయడానికి, ఇతర దేశాలవారు ఆ ప్రచారాన్ని తేలి కగా నమ్మడానికి అవకాశాలు ఏర్పడుతాయి.

నివారణయుద్ధ సిద్ధాంతాన్ని గురించి సైనిక వ్యవ హారాల వ్యాఖ్యాత హాన్‌సన్ బాల్డ్విన్ ఇటీవలే న్యూయార్క్ టైమ్సు పత్రికలో ఈ విధంగా వ్రాశారు:

"ఈ సిద్ధాంతం రాజకీయంగా దివాళా కోరుతనాన్నీ, నైతిక పతనాన్నీ నిరూపిస్తూంది. ఇది సైనిక వ్యవహా రాల దృష్ట్యా అప్రయోజనకరమైనది. ఏ ఆశయాలను సాధించడంకోసం మనం కృషిచేస్తున్నామో, అవి మంట

గలిసి పోతాయి." ఆయన పేర్కొన్న ప్రతి అంశాన్ని నేను ఆమోదిస్తున్నాను.

స్టాలిన్‌తో మనం సక్రమంగా వ్యవహరించనూ లేక, యుద్ధమూ చేయకపోతే, గత్యంతరం ఏమిటి? దానికి ఒక్కటేమార్గం ఉన్నది. సోవియెట్ రష్యా అడుగు జాడలను కనిపెడుతూ, అది జరుపబోయే చర్యలను పసి కడుతూ, ఒకవేళ రష్యా దురాక్రమణ చర్యలకు దిగినా వాటిని వెంటనే నిరోధించాలి. దీనికంటే ముందు కమ్యూనిజానికి ఆహ్వాన దేవతలైన దారిద్ర్యం, అవిద్య, ఆర్థిక సాంఘిక రంగాలలోని ఒడుదుడుకులు మొదలైన వాటిని కమ్యూనిస్టు ప్రాపకానికి అనువైన ప్రాంతాల నుంచి తొలగించడానికి కృషి చేయాలి. ఈ విషయాలలో మార్షల్ పథకం విశేషంగా తోడ్పడగలదు. మార్షల్ పథకం అనేక ప్రయోజనాలను కలిగించగలదు. ఇతర దేశాలలో కమ్యూనిస్టులు సాగించే కుతంత్రాలను అది అరికట్టగలదు. మార్షల్ పథకం క్రింద ఆనకట్టలు, ఎలక్ట్రిసిటీ, మొదలైన ప్రాజెక్టులు, గృహనిర్మాణపు స్కీములు అమలులోకి రాగానే, రైతులకు వ్యవసాయపు పని ముట్లు, విత్తనాల సహాయం జరుగగానే కమ్యూనిస్టుల దుస్తంత్రాలన్నీ కట్టుపడి పోయినాయి.

ఆర్థిక, సాంఘిక, మానసిక రంగాలలో మనం తీవ్రమైన ప్రచారం ప్రారంభించడానికి తోడు, రష్యాక్

సైన్యం పరాయి దేశంమీద కాలుమోపకుండా సమష్టి రక్షణ సైన్యాన్ని ఏర్పరచి, కృషి సాగించాలి. ఈ కార్యక్రమాన్ని జయప్రదంగా సాగిస్తే, మూడవ ప్రపంచ యుద్ధమనేది రాకుండా నివారించవచ్చు. ప్రజాస్వామ్య రాజ్యాలలోని ప్రజల వ్యక్తి స్వాతంత్ర్యాన్ని రక్షిస్తూ శాంతి అభ్యుదయాల కోసం కృషిచేయాలి.

స్వాతంత్ర్యమంటే యుద్ధం జరుగకుండా శాంతిని సాధించాలనీ, బానిసత్వం లేనటువంటి స్వేచ్ఛ ఉండాలనీ నేను వాంఛిస్తున్నాను.

అంటే స్వేచ్ఛ, జీవనం, సౌఖ్యాన్వేషణ, ప్రపంచ మానవుల పరమవిశ్వాసాలు కావాలని నేను ఆశిస్తున్నాను.

# స్వతంత్ర రాజ్యాలపై నాయకత్వం అమెరికాకు ఇష్టం లేకపోయినా తప్పదు

3 వ అధ్యాయము

ప్రపంచ నాయకత్వ బాధ్యత లన్నింటినీ అమెరికా స్వీకరించే పక్షంలో ప్రపంచ శాంతి సాధనాకృషిని విజయవంతంగా నిర్వహించగలమని నాకు దృఢమైన విశ్వాసమున్నది. అందుకు అవసరమైన వస్తుసంపద, పారిశ్రామిక ప్రావీణ్యం, వ్యవస్థా నిర్మాణ కౌశలం, వాటన్నింటికితోడు కీలక స్థానం అమెరికాకు మాత్రమే కలదనే ధైర్యంతో నేను చెప్పగలుగుతున్నాను.

వ్యవహారాలలో మనం నిర్వహించ వలసిన నూత్న పాత్రను స్వీకరించడానికి మనకు ఇష్టం లేకపోయినా, పరిస్థితులకుతగినట్లు సక్రమంగా వ్యవహరించకపోతే, నిరంకుశత్వంతో కూడిన శాశ్వత బానిసత్వానికి నాంది అయిన అరాజక పరిస్థితిని ఏర్పడనీయవలసి వస్తుంది.

ప్రపంచంలోని స్వతంత్రరాజ్యాల నాయకత్వాన్ని మనం వహించడమంటే, ఆ దేశాలకంటె మనది అత్యధిక బలంగల దేశమైనది కనుక యావత్తు కార్యభారాన్ని మనమే వహించాలని అర్థం కాదు. లేక, బాధ్యత నంతనూ త్యజించడమూ కాదు. అట్టి విషయాలలో వంతులుపోవడం మన స్వభావానికి విరుద్ధమైనట్టిది.

ఇతర స్వతంత్ర రాజ్యాల శాంతి భద్రతల రక్షణకు మనం చేయూత నివ్వడం, వివేకవంతమైన స్వార్థ పరత్వమని చెప్పుకోవచ్చును. అది ప్రపంచ జ్ఞానంతో కూడిన సహేతుకచర్య. వాటికి సేనలను, ఆయుధాలను, ఆర్థిక సహాయాన్ని పంపగలము. శాంతి భద్రతల పరిరక్షణకు స్వతంత్ర రాజ్యాలు యథాశక్తినిబట్టి సమష్టి రక్షణభారాన్ని వహించడానికి వారిలో ఉత్సాహాన్ని ఉత్తేజాన్ని కలిగించడం మనకు అగ్నిపరీక్షవంటిది. కడు శక్తిసామర్థ్యాలతో వాటిలో నూత్న చైతన్యాన్ని కలిగించాలి. అమెరికా సుస్థిరత్వం ఇతర స్వతంత్ర రాజ్యాలతో ముడిపెట్టబడి ఉన్నదన్న పరమ సత్యాన్ని గ్రహించడం అంత తేలిక కాదనుకుంటాను.

మాడిసన్‌లో "షికాగోట్రిబ్యూన్" పత్రిక పూర్వపు కార్యాలయానికి నాలు గిళ్ల అవతల ఒక ఇంట్లో మా తండ్రి జన్మించారు. నేను షికాగో ప్రాంతంలో పుట్టి పెరిగాను. సముద్రతీరానికి ఆ పట్టణం కొన్ని వందల మైళ్ల దూరంలో ఉన్నది. యూరప్, ఆసియాలకు అనేక వేలమైళ్ల దూరంలో ఉన్నది.

స్వతహాగా నైతేనేమి, పుట్టి పెరిగిన వాతావరణాన్ని బట్టి అయితేనేమి, నాకు ఒంటరితనం బాగా అలవాటయింది. అమెరికా ఇతర స్వతంత్ర రాజ్యాల సంగతి

పట్టించుకోక ఏకాకిగా ఉండడం అసాధ్యమైన విషయమని రెండు ప్రపంచయుద్ధాలు మనకు గుణపాఠం నేర్పాయి. ధనాన్ని కోట్లకొలది కూడబెట్టుకొనే అవకాశం ఏర్పడిన 1920 సంవత్సరానికీ, ఖర్చుకు వెనుదీయకుండా ధనాన్ని గ్రుమ్మరించవలసిన పరిస్థితి ఏర్పడిన 1930 సంవత్సరానికీ మధ్య ద్రవ్యోల్బణాలూ, ఆర్థికమాంద్యాలు ప్రపంచమంతటా ఏర్పడినాయి. అనేక దేశాలలో నూతన నిరంకుశ విధానాలు తలెత్తినాయి. కమ్యూనిజం, నాజీజం, ఫాసిజం బాగా విజృంభించి, దేశ భద్రతలకు పీడాకరంగా తయారైనాయి. ఈ నూతన విధ్వంసక శక్తుల నరికట్టడానికి, వాటినుంచి మనలను రక్షించుకోడానికి మార్గం కన్పించ లేదు. 1938 వ సంవత్సరంలో వాల్టర్ లిప్‌మన్ షికాగో విశ్వ విద్యాలయంలో ఉపన్యసిస్తూ, పరస్పర ఆధార ఆధేయ సంబంధాలుగల నూత్న ప్రపంచంలో అమెరికా పాత్రనుగురించి నేను వెల్లడించిన అభిప్రాయాలనే విశదీకరించారు.

లిప్‌మన్ ఆ ప్రసంగంలో ఇలా చెప్పారు :

"ప్రపంచ శాంతి సాధనకు శక్తి సామర్థ్యాలు గల ఒక దేశ మున్నట్లు త్వరలోనే గుర్తించ గలుగుతారు. పూర్వకాలంలో రోము, బ్రిటను రాజ్యాలు నిర్వహించిన

పాత్రను ఆ దేశం నిర్వహించగలదు. ఆ మహత్కార్య సాధనకు ఆ దేశం అన్ని హంగులను సమకూర్చుకొని సిద్ధంగా ఉండాలి. ఆ దేశం అమెరికాయేనని నేను వేరుగా చెప్ప నవసరం లేదు." ఆయన మాటలను తల్చుకున్నప్పుడు, అట్టి మహత్తర బాధ్యతను అమెరికా నిర్వహించవలసి వస్తుందని ఆయనకు అప్పుడే ఎల్లా తెలిసిందా అని నాకు ఆశ్చర్యం కలుగుతూ ఉంటుంది. ఆయన అత్యుత్తమమైన సలహా ఇచ్చారనిమాత్రం నేను ఆనందిస్తూ ఉంటాను. లిప్‌మన్ ఆ ప్రసంగంలో ఇంకా ఇలా చెప్పారు :

"మనం నిర్వహించవలసిన పాత్రను బాగా అర్థం చేసుకొని వ్యవహరించడం ఎప్పుడూ మంచిది. అమెరికనులలో హెచ్చుమందికి నేను ఈనాడు చెప్పుతున్న మాటలు రుచించకపోయినా వాటిని కాదనలేరు. అమెరికనుల గొప్పతనం, ప్రపంచ రాజ్యాలలో అది గణించిన అగ్రస్థానం, ఉన్నత ప్రతిపత్తుల దృష్ట్యా ప్రపంచ నాయకత్వాన్ని వహించక తప్పదు."

అంతర్జాతీయ వ్యవహారాల విషయంలో సామాన్య బాధ్యతలను వహించడానికి కూడ అమెరికా 1938 నాటికి సిద్ధంగా లేదు. దానికి తోడు మనం నిష్ప్రయోజనమైన ఆలోచనలు చేస్తూ కూర్చున్నాము.

ఒకవేళ ప్రపంచ యుద్ధం సంభవించినా, తటస్థంగా ఉండగలమని, మనం చేసుకొన్న ఒడంబడికల దృష్ట్యా ఒడుదుడుకులు రావని భావించాము. రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది. 1940 లో అమెరికా అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికల సందర్భంలో మన సైన్యాలను విదేశాలకు పంపబోమని వాగ్దానం చేసినప్పటికీ, నాలుగు సంవత్సరాలు గడవకముందే మన సైనికులు అనేక యుద్ధరంగాలకు వెళ్లి నాజీలను, ఫాసిస్టులను, జపానీయులను ఎదుర్కొన్నారు.

ప్రపంచంలో అరాజక పరిస్థితులు తలెత్తి శాంతి భద్రతలకు భంగం కలిగినప్పుడు అమెరికా దూరంగాను, ఏకాకిగాను ఉండజాలదని రెండు ప్రపంచ యుద్ధాలలోను అమెరికా నిర్వహించిన పాత్రనుబట్టి చాలమందికి అర్థమై ఉండవచ్చును. మనం ఎటూ జోక్యం కలిగించుకోకుండా తటస్థంగా కూర్చున్నా శత్రువు మన పొలిమేరలలోకి ప్రవేశించిన తరువాతనైనా మనం యుద్ధంలోకి దిగక తప్పదు.

శాంతి భద్రతలకు భంగం వాటిల్లినప్పుడు అమెరికా ముక్కుమూసుకు కూర్చోదని రెండు ప్రపంచ యుద్ధాలలో నేమి, తదితర సందర్భాలలో నేమి ప్రత్యక్షసాక్ష్యం ఉన్నప్పటికీ, యూరప్, ఆసియాలను విడనాడి అమెరికా కడుపులో నీళ్ళు కదలకుండా స్వంత వ్యవహారాలు చక్క-

పెట్టుకోవా లనేవారు కొందరున్నారు. మన ఐశ్వర్యా న్నంతను స్వదేశరక్షణకోసం ఉపయోగిస్తూ, విదేశాలకు చిల్లిగవ్వనుకూడ పోనీయరాదని వారంటారు. మనదేశ రక్షణకు అట్టి సిద్ధాంతాలతో రూపొందించే ఏ కార్య క్రమంగాని, చేసే ప్రయత్నాలుగాని సంపూర్ణ ఫలితా న్నివ్వగలవని నేను నమ్మజాలను. పశ్చిమ యూరప్‌ను సోవియెట్ రష్యా కబళించివేస్తే, మిగతా దేశాలన్ని టినీ వాటి కర్మానికి వదిలివేసి, మనంమాత్రం సుర క్షితంగా కూర్చోడంకంటె ఘోరమైన అపరాధం మరొ కటి లేదు. యుద్ధావసర వస్తువులలో చాల వాటికోసం మనం విదేశాలమీద ఆధారపడవలసి ఉన్నది. మన అవసరాలను ఒకసారి చూచుకొంటే, అట్లాంటిక్, పసిఫిక్ రక్షణ సంధులు తమ్ము రక్షించగలవని విశ్వ సించే రాజ్యాలవారి ఆశలు అడియాసలు కాగలవు. ఉదాహరణకు, ఉక్కు సామగ్రిని తయారు చేయడానికి ముఖ్యమైన నూటికి 90 వంతులు మాంగనీసును, అల్యూ మినియము వస్తువులు తయారు చేయడానికి చాలాభాగం బాక్సైటును, పూర్తిగా తగరాన్ని, రబ్బరును విదే శాలనుంచి తెప్పించుకోవలసి ఉన్నది. మనకు అతి ముఖ్యావసరమైన దిగుమతులలో ఇవి కొన్నిమాత్రమే.

మనం ఇతర దేశాలమీద ఆధారపడకుండా స్వయంగా అన్ని రక్షణ ఏర్పాట్లు చేసుకొంటామని

మాట వరకు అనుకొందాము. వాటిని శాశ్వతంగా కొన్ని దశాబ్దాలవరకూ సాగించాలి. పశ్చిమ యూరప్ రాజ్యాలు మనకు తోడుగా ఉంటేనే రక్షణ భారాన్ని భరించడం కష్టమైపోతున్నది. అటువంటప్పుడు పశ్చిమ యూరప్ రాజ్యాలను మనం వదిలివస్తే మనం ఎంతపెద్ద భారాన్ని సహించవలసి ఉంటుందో గ్రహించాలి.

ప్రస్తుత పరిస్థితులనుబట్టి రక్షణ ఏర్పాటుల నిమిత్తం మన ఒక్కరికీ సాలుకు 12,500 కోట్ల డాలర్లు ఖర్చు కాగలవు. ఇతర స్వతంత్ర రాజ్యాలతో కలిసి ఇప్పుడు సమష్టి రక్షణకు సాలుకు మనవంతు 2,500 కోట్ల డాలర్లు ఖర్చు అవుతున్నాయి. యూరప్‌లోను, ఆసియాలోను రష్యా ప్రాబల్యం ఎక్కువైనకొద్దీ ఈ వ్యయం అంతకంతకు బాగా పెరుగుతూ ఉంటుంది. అంతటి వ్యయాన్ని రక్షణ వ్యవహారాలకు ఖర్చుచేస్తే, మన ప్రజల జీవన ప్రమాణం బాగా తగ్గిపోయి వారు అధోగతి పాలు కావలసి వస్తుంది. వీటన్నింటినీ మించిన దారుణ పరిణామాలు మరికొన్ని ఏర్పడగలవు.

మనవస్తు సంపదనంతనూ రక్షణ వ్యవహారాల నిమిత్తం ఖర్చుచేస్తే, నిరంకుశ రాజ్యాలకు పట్టుగొమ్మలైన కంట్రోళ్లను శాశ్వతంగా ఉంచవలసిన అగత్యం ఏర్పడి ప్రజలు నానావస్థల పాలవుతారు.

ఇక్కడే మనం అఘాతంలోకి పడిపోతున్నాము. మన స్వీయరక్షణ ఒక్కటే మనం చూచుకొంటే, ఏ స్వాతంత్ర్యాల్ని రక్షించడానికిమనం ఆతృత పడుతున్నామో, వాటికి తీరని ప్రమాదాన్ని చేకూర్చినవా రమవుతాము. అత్యవసర పరిస్థితులు ఏర్పడినప్పుడు తాత్కాలికంగా కొన్ని ఇబ్బందులను సర్దుకోగలముగాని దీర్ఘకాలం వాటిని భరించలేము. దీర్ఘకాలం మన వాణిజ్యాన్ని, జీవితాలను ఒకమార్గంలో నడిపిస్తూ, సమస్తాధికారాలను చెలాయించడానికి అలవాటుపడిన ప్రభుత్వం, అవసరం తొలగిపోయినా ఆ అధికారాలను వదులుకో గలదంటే నమ్మిమించిన ఆశావాదులు సయితం (నేను ముమ్మాటికీ ఆశావాదినే లెండి) నమ్మడం కష్టం. దానిని తొలగించడానికి చాలాకాలం తీసుకుంటుంది.

మనపాటికి మనం రక్షణ ఏర్పాట్లను చేసుకొని, మిగతా దేశాలతో సంబంధంలేకుండా ఒంటరిగా బందోబస్తు చేసుకొనడంలో గల ప్రమాదాన్ని గురించి హార్ట్‌ఫర్ట్‌లోని "కోరంట్" పత్రిక 1950 సంవత్సరం డిసెంబరు 21 వ తేదీన సంపాదకీయం వ్రాస్తూ ఈ విధంగా హెచ్చరించింది :

"అమెరికా ప్రభుత్వం ఈ విధానాన్ని అమలు జరుపదలుచుకొంటే, ముందుదాని పూర్వాపరాలను సంపూ

ర్ణంగా పరిశీలించాలి. ఆ విధానాన్ని మనం అమలుజరిపి తే అమెరికాను భయం, అలజడులతో కూడిన దేశంగా తయారు చేయడమన్నమాట. రానున్న సంవత్సరాలలో మనం తయారుచేసే 10,000 కోట్ల డాలర్ల బడ్జెట్ల మొత్తాలు, అట్టి పరిస్థితులలో మనకు అయ్యే ఖర్చులో నాలుగో వంతుకుకూడ సరిపోవు. తాత్కాలికంగా మనం ప్రవేశపెట్టిన మాయదారి కంట్రోళ్లు అప్పుడు శాశ్వతంగా ఉండిపోతాయి. ఇంత విశాలప్రపంచంలో మనం ఒంటరిగాళ్లమైపోతాము. కమ్యూనిస్టులు అతి ఉత్సాహంతో మొదటి యాటంబాంబును మన మీదకు వదిలితే మనం దాసోహ మనక తప్పదు.

అమెరికా ఈ నాడు ప్రపంచ నాయకత్వాన్ని స్వీకరించడం మనమందరం అయిష్టతతోనే అంగీకరించాము. అయితే ఆ నాయకత్వం జాతి స్వభావాన్నీ, నడవడినీ ఏ విధంగా ప్రతిబింబింప చేస్తుందీ, దాని ఆశయాలను ఏ విధంగా సఫలీకృతం చేస్తుందీ అనే విషయాలను ఇప్పుడే ఊహించడానికి వీల్లేదు. నాయకత్వాన్ని మనం సక్రమంగా నిర్వహించాలంటే మనం ఇతర స్వతంత్ర రాజ్యాలతో సమైక్యంగా వ్యవహరించాలి. వాటి అభిప్రాయాలను, కోర్కెలను గౌరవిస్తూ, బాధ్యతల నిర్వహణలోను, ఫలితాలను అనుభవించడంలోను వాటికి భాగస్వామ్యం కలుగచేయాలి. రాజ్యాంగ అధినేతల

దగ్గరనుంచి సామాన్య ప్రజానీకంవరకూ ఈ సిద్ధాంతాన్ని పాటించవలసి ఉన్నది. ఇతర స్వతంత్ర రాజ్యాలవారు మనతో కలిసి పనిచేయడానికి సిద్ధంగా ఉన్నారు. కాని మనం చెప్పినట్లల్లా నడుచుకు తీరాలని ఆదేశించడం మొదలుపెడితే వారు సహించరు. అమెరికా ఆర్థిక సహాయనిర్వాహణాధికారిగా పనిచేస్తున్నప్పుడు ఈ విషయాన్ని అనుభవంమీద తెలుసుకొన్నాను.

మొదటి ప్రపంచయుద్ధంలో మన శత్రుపక్షాన పోరాడి, రెండవ ప్రపంచ యుద్ధంలో తటస్థంగా నున్న టర్కీ ఈ నాడు మనకు అత్యంత మిత్రదేశమైనది. పరస్పర గౌరవం, సత్సంబంధాల ఫలితంగా ఈ మైత్రి రోజు రోజుకూ వృద్ధి పొందుతున్నది. నేను టర్కీ వెళ్ళినప్పుడు టర్కీ అధ్యక్షుడు సీలాల్ బయార్‌తో స్వతంత్ర రాజ్యాల రక్షణ ఏర్పాటులలో భాగం పంచుకోడానికి టర్కీ చాల ఆతురతతో నున్నదని నాతో చెప్పారు. టర్కీ ప్రస్తుతం ఆ పనే చేస్తున్నది. రెండు కోట్ల జనాభా గల టర్కీదేశం, ఉత్తమశిక్షణ పొందిన సుమారు 25 డివిజన్‌ల సైన్యాల్ని కలిగి ఉన్నది. టర్కీ, రష్యా సరిహద్దున ఉండికూడ, డార్డనెల్స్‌మీద ఆధిపత్యం వహించడానికి రష్యా చేస్తున్న ప్రయత్నాలను నిరోధిస్తున్నది. టర్కీ తన సైన్యాలను తగ్గించుకుంటేనే మార్షల్ సహాయం చేస్తామని నేను టర్కీ అధ్యక్షునితో అని

ఉన్నట్లయితే ఆయన ఏమి సమాధానం ఇచ్చేవారో ఊహించడానికి కూడ భయం కలుగుతున్నది. సక్రమ వ్యవహారణను ఒకప్పుడు నిక్కచ్చిగా ఉండవలసి వస్తే అది నియంతృత్వ స్వభావమని అనకూడదు. ప్రజలపై పెత్తనంచేయడం కాకుండా, వారి ఆమోదంతో వ్యవహారాలను నిర్వహించడమే సక్రమ నాయకత్వానికి ప్రధానలక్షణం.

నేను బ్రిటను వెళ్ళినప్పుడు అప్పటి విదేశాంగ మంత్రి ఎర్నెస్టు బెవిన్ ప్రపంచ నాయకత్వ బాధ్యతలను గురించి చర్చించారు. పదహారవ శతాబ్దం చివర భాగంలో స్పెయిను చేసిన నౌకా దండయాత్రను బ్రిటను ఓడించినప్పటి నుంచీ, మొదటి ప్రపంచ యుద్ధం వరకూ, బ్రిటనే ప్రపంచంలో అత్యధిక బలసంపన్నమైన దేశం. బెవిన్ సోషలిస్టు అయినప్పటికీ బ్రిటిషు సామ్రాజ్యంయొక్క అద్భుత విజయాలకు గర్వపడుతూండేవారు. బ్రిటను అంతకాలం అట్టి పలుకుబడిని కలిగివుండడానికి గల కారణాలను వివరిస్తూ బెవిన్ ఇలా చెప్పారు :

"బ్రిటను అట్టి ఉన్నతస్థానాన్ని పొందడానికి బ్రిటను యొక్క నౌకాదళం, నౌకాధిపతులే బాధ్యులని కొందరు అంటారు. బ్రిటిషువారి నిష్కల్మషబుద్ధి, ఉత్తమ

సంస్కృతి, అవినీతికి అవకాశంలేని న్యాయస్థానాలు, న్యాయవిధానాలు బ్రిటను సాధించిన మహత్తర విజయాలకు కారణాలు."

బ్రిటను నాయకత్వం వహించడంలో గొప్ప పేరు పొందింది. వివిధ దేశాలను ఒక కూటమిగా ఏర్పరిచి ఆ ప్రజలమధ్య సద్భావ సామరస్యాలు నెలకొల్పడం బ్రిటను నాయకత్వానికి మణిపూసవంటిది. అదే బ్రిటిషు మహాసామ్రాజ్యం. తర్వాత అదే కామన్వెల్తుగా మార్పు చెందింది. సామ్రాజ్యం అనేమాట అమెరికనులకు రుచించదు. ప్రపంచంలోని వివిధదేశాల ప్రజలు ఒకటిగా నిలబడి, సమష్టి ప్రయోజనాలకోసం కృషి చేయడమే, భవిష్యత్తులో చేయవలసిన పని. కామన్వెల్తు రాజ్యాల కూటంలో బ్రిటను ప్రముఖస్థానాన్ని అలంకరించింది. అదే విధంగా, నేడు ప్రపంచంలోని అన్ని స్వతంత్ర రాజ్యాలలో అమెరికా ప్రముఖస్థానాన్ని అలంకరించగలదు.

కాబట్టి స్వతంత్ర రాజ్యాల శక్తి సామర్థ్యాలను కాపాడే అంతర్జాతీయ సంస్థలను పటిష్ఠం చేయడానికి మనం శాయశక్తులా కృషిచేయాలి. ఇతర రాజ్యాల ప్రజలతో మనం సమైక్యంగా వ్యవహరించడానికి తీవ్రంగా కృషిచేస్తున్న సంస్థలలో ఐక్యరాజ్యసమితి

అగ్రస్థానానికి చెందినది. సమితిని మనం హృదయ పూర్వకంగాను, సంపూర్ణంగాను బలపరచాలి. ఇతర ప్రాంతీయ సంస్థలైన కౌన్సిల్ ఆఫ్ యూరప్‌ను, యూరప్ ఆర్థిక సహకార సంస్థను, అఖిల అట్లాంటిక్ సంధి సంస్థను, విశాల అమెరికన్ యూనియన్‌ను మనం బలపరచాలి. ప్రపంచ దేశాల వాణిజ్య పురోభివృద్ధికై ఏర్పడిన అంతర్జాతీయ వాణిజ్యసంస్థను అందరూ బల పరచాలి.

స్వతంత్ర ప్రజలలో సమైక్యతను ప్రభుత్వాలు, ప్రభుత్వసంస్థలు మాత్రమే కలిగించలేవు. అసత్య ప్రచారాన్ని అరికట్టడానికి ప్రతివ్యక్తి తన బాధ్యతను గుర్తించి, శక్తివంచన లేకుండా కృషిచేయాలి. వారు ఇతర స్వతంత్ర ప్రజలతో కలిసి పనిచేయాలంటే, ఎదుటివారి లోని మంచి లక్షణాలనుమాత్రం స్వీకరించి చెడునడతను త్యజించాలి.

ఇతర స్వతంత్ర దేశాలపట్ల అసహన భావాన్ని కలిగి ఉండడంగాని, వాటినిగురించి దుష్ప్రచారం చేయడం గాని అప్పుడప్పుడు మనకు తెలియకుండానే చేస్తూ ఉంటాము. ఆవిధంగాచేయడం, మనలో మనకు చీలికలు, పొరపులు కలిగించాలని తాపత్రయ పడుతున్న రష్యాకు గట్టి సహాయంచేసిన వారమవుతాము. సోవియట్ రష్యా

ప్రతిరోజూ ఏదో ఒక కొత్తపుకారును, ప్రచారాన్ని లేవదీసి, స్వతంత్రరాజ్యాల ఐకమత్యాన్ని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తూనే ఉంటుంది. ఒక నెలరోజుల క్రితం వివిధదేశాలలో రష్యా లేవదీసిన పుకారులను చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. రష్యాకు సహాయంగా బ్రిటను జెట్ విమానాలను తయారుచేస్తున్నదని అమెరికాలో ఒక పుకారును లేవదీసింది. జర్మనీలోని కోట్లాది ప్రజలకు అమెరికా ఆయుధాలను పంపుతున్నదని ఫ్రాన్సులో మరొక అబద్ధప్రచారాన్ని సాగించింది. జర్మనీలోని ప్రముఖ పారిశ్రామిక కేంద్రాలను నేలమట్టం చేయాలని ఫ్రాన్సు పట్టుపడుతున్నట్లు ఒక అసత్యవార్తను జర్మను ప్రజలలో ప్రచారంచేసింది.

"మనందర్నీ విడివిడిగా ఉరితీయడం తప్పనప్పుడు, అందరం కలిసి ఉరితీయించుకోవడం మంచిది," అని బెంజమన్ ఫ్రాంక్లిన్ ఏనాడో అన్నాడు. ఆ సూక్తి ఇప్పుడు మనకు అన్నివిధాలా వర్తిస్తుంది.

# నాయకత్వంలో సాధక బాధకాలు

## 4-వ అధ్యాయం

అమెరికాలోని 'కాడిల్లా మోటారు కంపెనీ'వారు 1915వ సంవత్సరంలో 'నాయకత్వంలోని సాధక బాధకాలు' అనే శీర్షికతో ఒక వ్యాపార ప్రకటన చేశారు. అమెరికాలోని వ్యాపార ప్రకటన సంస్థలవారికి అది ఈనాటి వరకూ జ్ఞాపకమున్నది. నాయకత్వం వహించినవారికి మెప్పులతోపాటు దెబ్బలుకూడా తగులుతూ ఉంటాయని ఆ ప్రకటనయొక్క సారాంశం. నాయకత్వం స్వీకరించడంతోటే అనేక గురుతర బాధ్యతలు పైన బడుతాయి. ఒక వ్యాపారసంస్థ ఉత్పత్తిచేసిన సరుకులు మార్కెట్టులో బాగా చలామణి అయి, ఒకసారి మంచి పేరు ప్రసిద్ధులు పొందితే, ఆసంస్థకు కొన్ని బాధ్యతలు వచ్చిపడుతాయి. సరకులయొక్క నాణ్యాన్ని తగ్గించడానికి వీల్లేదు. దగా చేయకుండా నైతిక ప్రతిష్టను నిలబెట్టుకోవలసి ఉంటుంది. ఇవి తప్పించుకోలేని బాధ్యతలు. వ్యాపార రంగంలోనే అట్టి బాధ్యతలు సంప్రాప్తమైతే, స్వతంత్ర రాజ్యాల నాయకత్వం వహించేవారు ఎట్టి మహత్తర బాధ్యతలను నిర్వహించవలసి రాగలదో ఊహించుకోవాలి.

తన స్వీయశక్తిని రక్షించుకొనడమే అమెరికా ప్రాథమిక బాధ్యత. ఇతర బాధ్యతలను సక్రమంగా

నిర్వహించడం దానిమీదే ఆధారపడి ఉన్నది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకూ, నిరంకుశ నియంతృత్వాలకూ మధ్య జరుగుతున్న ఈ సంఘర్షణలో అమెరికా ఒక 'యంత్రం' లాంటిది. అది ఆగిపోయినా, లేక గమనం మందగించినా, ప్రపంచంలోని అన్ని ప్రాంతాలు శక్తిహీనమైపోయి, వెలవెలపోతాయి. ఎక్కువ శక్తిని ఉత్పత్తి చేద్దామనే ఆశతో, దానికి ఎక్కువబరువు తగిలిస్తే, అది విరిగి పోతుంది. అందువల్లనే మనం మోయలేని భారాన్ని పైన వేసుకోరాదు. విద్యుచ్ఛక్తి ప్రవాహం సరిగా లేకపోతే యంత్రం ఆగిపోయినట్లే, మనలో మనకు కలతలు ఏర్పడితే, మన పురోగమన శకటం ఆగిపోయినట్లే.

ప్రపంచంలో అత్యవసర పరిస్థితి ఏర్పడిన ఈ సమయంలో మన మందరం కలసిమెలసి ఉండాలి. ఈ నాడు ఏర్పడిన అతివిషమ పరిస్థితులకు, క్లిష్టపరిస్థితులకు ఏ ఒక్క పక్షాన్నిగాని, కూటాన్నిగాని నిందించి ప్రయోజనం లేదు. వాటికి కారకులైన వారికోసం వెతుక్కుంటూ కూర్చుంటే కలిసివచ్చేది లేకపోగా, గతాన్ని గురించి విచారించడంవల్ల భవిష్యత్తుకూడ అంధకార బంధురమై పోతుంది.

రెండవ ప్రపంచయుద్ధం ముగిసినప్పటినుంచి రష్యా వైఖరిని గురించి మనం తప్పుడు అంచనాలు వేయడం

జరిగింది. అది మన బలహీనత అని ఒప్పుకోక తప్పదు. రెండవ ప్రపంచయుద్ధం తర్వాత శాంతి సాధనకు రష్యా మనతో కలుస్తుందని మనలోని అనేకమంది భావించారు. నామట్టుకు నేను గట్టిగా భావించాను. ఆవిధంగా అను కొన్నందుకు ఇప్పుడు నేను విచారించడంలేదు. అంత టితో ఆగక, మరొక బ్రహ్మాండమైన తప్పుచేశాము. రెండవ ప్రపంచయుద్ధ విజయోత్సవం జరిగిన వెంటనే మనం అత్యద్భుతమైన సేనలను తగ్గించి వేశాము. ఆ చర్యకు ఈనాడు మనం కాంగ్రెసును నిందించడానికి తయారవుతున్నాము. నేను మాత్రం ఆ పని చేయ జాలను. నా ఐదుగురు కొడుకులు యుద్ధ సమయంలో సైనిక శాఖలో పనిచేస్తూ విదేశాలలో ఉన్నారు. విజయోత్సవం ముగియడంతోటే వారిని ఇంటికి పిలి పించాలని నేను, నాభార్య ఆతృత పడ్డాము. ఇదేవిధంగా ఇతర తలితండ్రులు విదేశాలలో పనిచేస్తున్న తమ కొడుకులను ఇంటికి రప్పించాలని ఆరాటపడ్డారు. ఈ విషయంలో జరిగిన తప్పిదాన్ని అందరూ తలో కాస్త పంచుకో వలసినదే. నిర్దిష్టమైన సర్వపక్ష ఆమోదాన్ని పొందిన విదేశాంగ విధానం ఉంటేనే తప్ప ప్రపంచ బాధ్యతలను మనం సక్రమంగా నిర్వహించలేము. అది విజయవంతంగా అమలు జరపడానికి మన దేశంలోని రిపబ్లికన్ పక్షంవారు, డెమోక్రాటిక్ పక్షంవారు

సహృదయతతో, సమైక్యతతో కలసిమెలసి వ్యవహ రించాలి. ప్రపంచ ప్రజలకు మనం ఒక విషయాన్ని చెప్పేటప్పుడు, ఒక విధానాన్ని వివరించేటప్పుడు అమెరి కన్ జాతి అంతా చెపుతున్నట్లుండాలిగాని, అమెరికా లోని ఒక ప్రత్యేక పక్షంవారు చెప్పుతున్నట్లు ఉండ కూడదు. విదేశాంగ విధానాన్ని గురించి చర్చలు, విమర్శలు జరగరాదని నేను అనడంలేదు. సెనేటులో గాని, ప్రజా ప్రతినిధుల సభలోగాని విదేశాంగ విధానం పైన చర్చజరిగి, వోటింగుకు పెట్టినప్పుడు ప్రతిసభ్యుడూ అమెరికన్ వ్యక్తిగా వోటుచేయాలిగాని పార్టీ అభిమా నంతో చేయరాదని నేను అంటున్నాను. ఈ రోజున అమెరికాకు రిపబ్లికన్ పార్టీ విదేశాంగ విధానమనీ, డెమోక్రాటిక్ పార్టీ విదేశాంగ విధానమనీ రెండులేవు. ఒక్క విధానమే ఉన్నది. అదే అమెరికా విదేశాంగ విధానమని స్వీకరించడం మన మొదటి బాధ్యత.

మన విదేశాంగ విధానాన్ని అమెరికాలోని అన్ని పక్షాలవారు ఏకగ్రీవంగా ఆమోదించాలనే సూత్రం ఎల్ల ప్పుడు రాజకీయపక్షాల చేతుల్లో నలిగిపోతున్నది. ముఖ్యంగా ప్రభుత్వాన్ని నడుపుతున్న రాజకీయ పక్షం వారే శాసనాధికారాలను, ఎగ్జిక్యూటివ్ అధికారాలను కలిగివుంటూ ఉండడంవల్ల అది పార్టీ రాజకీయాలకు గురి అవుతున్నది.

కాంగ్రెసులో భేదాభిప్రాయాలు ఏర్పడినప్పుడు కూడ ఆ సిద్ధాంతానికి భంగం కలుగుతున్నది. మొదటి ప్రపంచయుద్ధం తర్వాత అమెరికా ప్రెసిడెంటు విల్సన్ యొక్క విదేశాంగ విధానాన్ని సెనేటరు హెన్రీ కాబట్ లాడ్జి నాయకత్వంక్రింద ఒక రాజకీయపక్షం వ్యతిరేకించడంవల్ల అప్పటి "నానా జాతి సమితి" (లీగ్ ఆఫ్ నేషన్సు) కార్యకలాపాలకు భంగం కలిగించింది. కాని రెండవ ప్రపంచయుద్ధం తర్వాత, మన విదేశాంగ విధానాన్ని అన్ని పక్షాలు బలపరచడంవల్ల విదేశాలలో మన ప్రభుత్వంయొక్క పలుకుబడి, ప్రభావం ఇనుమడించింది. రిపబ్లికనుల మెజారిటీగల 80 వ అమెరికా కాంగ్రెసు సభవారు ఉభయపక్షాల ఏకగ్రీవామోదంతో ఆర్థిక సహకార వ్యవస్థను నెలకొల్పారు. ప్రెసిడెంట్ విల్సన్ విదేశాంగ విధానాన్ని వ్యతిరేకించిన సెనేటర్ హెన్రీ కాబట్ యొక్క మనుమడు (ఆయన పేరుకూడ హెన్రీ కాబట్), అమెరికా విదేశాంగ విధానాన్ని అన్ని రాజకీయ పక్షాలు ఏకగ్రీవంగా ఆమోదించాలని గడిచిన కొన్ని సంవత్సరాలనుంచి విపరీతంగా కృషిచేస్తున్నారు. ఉభయ పక్షాలకు ఆమోదకరంగా ఉండేటటువంటి ప్రస్తుత విదేశాంగ విధానాన్ని సెనేటర్ టామ్ కోనల్లీ కూడ బలపరిచారు. కోనల్లీ 81 వ కాంగ్రెసు యొక్క

విదేశ వ్యవహారాల సంఘానికి అధ్యక్షుడు. ప్రజాప్రతినిధుల సభ, విదేశ వ్యవహారాల కమిటీ సభ్యుడు. రిపబ్లికన్ పక్షీయుడైన ఛార్లెస్ ఈటన్ కూడ దానిని బలపరిచారు. ఉభయపక్షాలకు ఆమోదకరమైన విధానాన్ని రూపొందించడానికి సెనేటర్ హెచ్. వాన్డెన్‌బర్గ్ ముఖ్య కారకుడు. ఆ గౌరవం ఆయనకే దక్కవలసి ఉన్నది. వాన్డెన్‌బర్గ్ సెనేటు విదేశ వ్యవహారాల కమిటీకి అధ్యక్షుడుగా ఉన్నంతకాలం, విదేశాంగ విధానంపైన ఎప్పుడు వోటింగు జరిగినా నిర్ణయాలు ఏకగ్రీవంగా జరిగేవి.

1950 మార్చిలో, మన విదేశాంగ విధానం అనేక ఒడుదుడుకులకు లోనయినప్పుడు సెనేటర్ వాన్డెన్‌బర్గ్ దానిని రక్షించడానికి క్రొత్త పార్టీని లేవదీశారు. 1948 నవంబరులో ఎన్నికలు జరిగినప్పటినుంచి ఉభయపక్షాలకు ఆమోదకరంగా ఉండాలనే సిద్ధాంతం సన్నగిలజొచ్చింది. ప్రభుత్వాన్ని నిర్వహిస్తున్న డెమోక్రాటిక్ పార్టీవారు సెనేటు, ప్రజా ప్రతినిధుల సభలో రిపబ్లికన్ పార్టీ నాయకులను సంప్రతించక పోవడంవల్లనే ఆ పరిస్థితి ఏర్పడింది. రిపబ్లికన్, డెమోక్రాటిక్ పార్టీలలోని కొందరు సభ్యులు అమెరికా విదేశాంగ విధానాన్ని తీవ్రంగా విమర్శించడంవల్ల కూడ ఆ పరిస్థితి ఏర్పడింది. ఆ పరిస్థితి నాకు చాల బాధ కలిగించింది. అత్యవసర

సహాయం చేయవలసిన అగత్యం ఏర్పడిన ఆ సమయంలో ఆర్థిక సహకార నిర్వహణ శాఖ కాంగ్రెసులోని రెండు పక్షాల ఆమోదం లేనిదే ఏ పని చేయజాలదని నేను భయపడ్డాను. సెనేటర్ వాన్‌డెన్‌బర్గ్‌కు నేను వెంటనే ఒక ఉత్తరం వ్రాశాను. తన పలుకుబడిని ఉపయోగించి రెండు పక్షాలకు సమాధానం కుదర్చవలసినదిగా ఆ లేఖలో కోరాను. రోగగ్రస్తుడై ఉన్న వాన్‌డెన్‌బర్గ్ నాకు ఈ క్రింది సమాధానం వ్రాశారు:

"అమెరికా ఆర్థిక సహకార నిర్వహణశాఖ ఏ పార్టీతోను సంబంధంలేకుండా నిష్పాక్షికంగా వ్యవహరించాలనే భావంతో నెలకొల్పబడింది. డెమోక్రాటిక్ పార్టీకి చెందిన కార్యవర్గం, రిపబ్లికన్ పార్టీ మెజారిటీగల కాంగ్రెసు ఆ సంస్థను ఏర్పరిచాయి. ఈ విషయంలో మనం ప్రదర్శించిన ఐకమత్యం మన సంప్రదాయానికి, మన భద్రతకు ప్రతిబింబం. పార్టీ ప్రమేయంలేని ఆ మహాసంస్థకు మీరు అధిపతులైనారు. మీరు చేస్తున్న మహత్తర సేవను అమెరికా పౌరుడుగా నేను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. మనం ఐకమత్యంతో మెలిగితే ప్రపంచంలో నిలబడగలుగుతాం. లేకపోతే పడిపోతాం. అమెరికా నిలబడాలనే నేను కోరుతున్నాను."

వాన్‌డెన్‌బర్గ్ నాకు వ్రాసిన పై సమాధానాన్ని అమెరికాలోని పత్రికలన్నీ ప్రకటించాయి. అమెరికన్

ప్రజలందరూ వాన్ డెన్ బర్గ్‌ను ప్రశంసించారు. ప్రెసిడెంటు ట్రూమన్ మెల్లిగా రిపబ్లికన్ నాయకులతో సంప్రతించడం ప్రారంభించారు. అమెరికా విదేశాంగ మంత్రి డీన్ ఎచిసన్ రిపబ్లికన్ పార్టీకి చెందిన జాన్ ఫాస్టర్ డల్లెస్‌ను, జాన్ షెర్మన్ కూపర్‌ను విదేశాంగ శాఖ సలహాదారులుగా నియమించారు. సెనేటు, ప్రజా ప్రతినిధుల సభలోని ఇరుపక్షాల సభ్యులను రప్పించి ఎచిసన్ అనేక సమావేశాలు ఏర్పాటుచేశారు. వాన్ డెన్ బర్గ్ వ్రాసిన లేఖ అమెరికనులలో బాగా పని చేసింది. రిపబ్లికన్, డెమోక్రాటిక్ పార్టీ సభ్యులు దాని ప్రభావాన్ని గుర్తించి విదేశాంగ శాఖకు సంబంధించిన ఆర్థిక సహకార నిర్వహణశాఖ మొదలైన సంస్థలను ఏకగ్రీవంగా బలపరచడం ప్రారంభించారు.

రెండు పక్షాలకు ఆమోదకరంగా ఉండే విదేశాంగ విధానాన్ని రూపొందించడమే కాక, అమెరికాలో ద్రవ్యోల్బణం ఎక్కువకాకుండా ఆర్థిక వ్యవస్థను చక్కపరచుకోవడం మన రెండవ బాధ్యత.

అమెరికాలో తీవ్రమైన ద్రవ్యోల్బణం ఏర్పడితే ప్రపంచంలోని అన్ని దేశాలలోను దాని విషమ పరిణామాలు ఏర్పడతాయి. యూరప్‌లో ద్రవ్యోల్బణాన్ని అరికట్టడానికి అమెరికా ఆర్థిక సహకార నిర్వహణశాఖ

నిర్వహిస్తున్న మహత్తర కృషికి భంగం కలుగుతుంది. 1948 వ సంవత్సరంలో యూరప్‌లో ఆర్థిక కల్లోలం చెలరేగింది. ఈనాడు వారికి ఆర్థిక స్థోమతు చేకూరింది. అమెరికాలో వస్తువుల ధర పెరిగిందంటే యూరప్ ఆర్థిక వ్యవస్థ దెబ్బతింటుంది. యూరప్ పునరుద్ధరణ, ఆయుధ పునరుద్ధరణ కార్యక్రమాలకు విఘాతాలు కలుగుతాయి. ధరలు విపరీతంగా పెరిగిపోతే సివిల్ ఉద్యోగులు, స్కూలు టీచర్లు, సాలీనావచ్చే ఆదాయంమీద జీవించేవారు ఎంత బాధపడుతారో మనకు బాగా తెలిసిన విషయమే. ప్రస్తుత సమయంలో ద్రవ్యోల్బణం తీవ్రంగా ఏర్పడితే, సామాన్య ఉద్యోగులేగాక, మన మందరం కూడ యమబాధలు పడవలసి వస్తుంది. మనరక్షణ వ్యయం ఎక్కువై పోతుంది. మన ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నమై పోతుంది. అద్భుతమైన ప్రావీణ్యాన్ని, చురుకుదనాన్ని ప్రదర్శించవలసిన ఈ సమయంలో మనకు మందకొడితనం ఏర్పడుతుంది.

ద్రవ్యోల్బణాన్ని మనం అరికట్టితీరాలి. కాని, ఏవిధంగా అరికట్టాలనేదే ప్రశ్న. వస్తువుల ఉత్పత్తి కంటె, వాడుక ఎక్కువైనందున ద్రవ్యోల్బణం ఏర్పడుతున్నది. దానిని అరికట్టాలంటె ఎక్కువ సరకునైనా ఉత్పత్తి చేయాలి. లేకపోతే ఉత్పత్తులనుబట్టి వినియోగాన్ని సరిచేసుకోవాలి.

వస్తువుల ఉత్పత్తి, ముడిపదార్థాల కొరత ఏర్పడి నప్పుడు వస్తువుల ధరలు విపరీతంగా పెరిగి ద్రవ్యోల్బణానికి దారితీస్తున్నవి. అప్పుడు ఉత్పత్తులను పెంపొందించడమే దానిని నివారించడానికి ఉత్తమమార్గం. మన దేశంలో ఉత్పత్తుల నధికంచేసి, విదేశాలలోకూడ ఉత్పత్తులు పెంపొందేటట్లు చూడాలి. ముఖ్యంగా రాగి, క్రోము, రబ్బరు, మాంగనీస్ ఉత్పత్తుల నెక్కువచేయాలి. అత్యవసరమైన ఈ వస్తువులను నిల్వ చేయడానికి ఆర్థిక సహకార నిర్వహణశాఖ తోడ్పడుతున్నది.

మన దేశంలోని పారిశ్రామిక సంస్థలన్నీ అధికంగా ఉత్పత్తి చేయడానికి, అందుకు కావలసిన యంత్ర పరికరాలను సమకూర్చు కొనడానికి ప్రభుత్వం సహాయం చేయాలి. ఈ సందర్భంలో మనం నిర్వహించ వలసిన అతి ముఖ్యమైన విషయం ఒకటి ఉన్నది. దానికి పెట్టుబడి అవసరం లేదు. మన దేశరక్షణ దృష్ట్యా దీర్ఘ కాలిక స్వల్పకాలిక అవసరాలను వేరుచేసి, అవసరమైన ముడి పదార్థాలను తెప్పించుకోడానికి ఏర్పాట్లు చేసుకోవాలి. సైనిక అవసరాలకు ప్రాధాన్యం ఇచ్చి, వాటికి అన్ని ఏర్పాట్లు చేసుకోవాలి.

ఈ విషయంలో మనం కృతకృత్యులైనంత మాత్రాన ద్రవ్యోల్బణాన్ని పూర్తిగా అరికట్టలేము.

ఈ ఒడుదుడుకు పరిస్థితిని తట్టుకోడానికి ముందుగా వస్తువుల ధరలపై కంట్రోళ్ళు విధించాలి. ఈ పనిని జయప్రదంగా నెరవేర్చినప్పటికీ, మన ఆశయం పూర్తిగా నెరవేరదు. వస్తువుల ధరలు పెరగకుండా కట్టుదిట్టం చేయడంవల్ల ప్రజలు ఎక్కువ వస్తువులను వాడుకోనడం ప్రారంభిస్తారు. కాబట్టి వస్తువుల రేషనింగుకూడ అమలు జరపాలి.

ధరల కంట్రోలు, రేషనింగు అమలు పరచడంతో పాటు వేతనాల కంట్రోలుకూడ. ప్రవేశపెట్టి ప్రజల కొనుగోలుశక్తిని ఒక క్రమపద్ధతిలోకి తీసుకురావాలి.

పైన పేర్కొన్నవిధంగా కంట్రోళ్ళను ప్రవేశపెడితే వాటివల్ల దుష్ఫలితాలు చాలా ఉన్నాయి. అధికారుల జోక్యంవల్ల వాణిజ్య పరిస్థితి తారుమారవుతుంది. ఉత్పత్తులకు అవరోధాలు ఏర్పడుతాయి. మన ఆర్థిక వ్యవస్థ దెబ్బతింటుంది. అనేక దేశాలలో పరిశ్రమల విషయంలో నిర్ణయాలుచేసే హక్కును పారిశ్రామిక వేత్తలనుంచి తొలగిస్తే, వారు ఆగ్రహించుకొని, అధికోత్పత్తికి తోడ్పడక, సహాయ నిరాకరణాన్ని ప్రారంభించిన సంఘటనలు ఎన్నో నేను ఎరుగుదును.

కంట్రోళ్లను విధించడానికి పైన పేర్కొన్నట్టి అవరోధాలు ఎన్నో ఉన్నప్పటికీ, ప్రస్తుత పరిస్థితులలో కంట్రోళ్లను తప్పనిసరిగా అమలు పరచాలి.

కంట్రోళ్లను ప్రత్యక్షంగా విధించడంకంటె, వీలై నంత వరకూ పరోక్షంగా విధించడం మంచిది. ఈ సంద ర్భంలో అప్పు లివ్వడంమీద కంట్రోళ్లుపెట్టడం మంచిది. ఫెడరల్ రిజర్వుబాంకువారు ఆ పద్ధతిని ప్రవేశ పెడు తున్నారు. వాయిదాల మీద అప్పులు ఇచ్చేపద్ధతిని కొంత వరకు కఠినం చేశారు. ఇండ్లను తణఖాకు తీసు కొని అప్పులు ఇచ్చేపద్ధతిలో చాలా నిర్బంధాలు పెట్టారు. కొన్ని భవనాలను తణఖాకు తీసుకో రాదనికూడా అన్నారు. బాంకులలో రిజర్వునిధులు పెంపు చేయడానికి వారు ఆ పద్ధతులను ప్రవేశపెట్టారు. వాటివల్ల అనేక ప్రయోజనా లున్నాయి. వ్యాపారస్థులుగాని, ఇతరులు గాని ఎక్కువ మొత్తాలను వెచ్చించడానికి అవకాశం ఉండదు. వాటివల్ల ప్రజలకు ఎక్కువబాధ ఉండదు. ఆ పద్ధతులను ప్రవేశపెట్టి నప్పుడు అవి సక్రమంగా అమలు జరుగుతున్నదీ, లేనిదీ చూడడానికి పోలీసు అజ మాయిషీ ఉండాలి.

వర్తకులు, వినిమయదారులు ఎక్కువ వస్తువులను వాంఛించకుండా చేయడానికి కంట్రోళ్లు అమలు పరచడం పద్ధతిగాక ఇతర మార్గాలుకూడా ఉన్నాయి. రాష్ట్ర ప్రభుత్వాలు, స్థానిక సంస్థలు క్రొత్త భవనాల నిర్మా ణాన్ని నిలుపుచేసి, ప్రభుత్వ వ్యయాన్నికూడ తగ్గించాలి. ప్రభుత్వమూ, ప్రజలూ పొదుపు విధానాన్ని అవలం

బించాలి. అమెరికా ప్రభుత్వపు ఖజానా శాఖవారు రెండవ ప్రపంచయుద్ధంనాటి 'సేవింగ్స్' పత్రాలను విక్రయిస్తున్నారు. ఈ కార్యకలాపాలను కొంచెం తీవ్రతరం చేయాలి. పరోక్షంగా విధించే కర్రోళ్లతోపాటు పన్నులుకూడా ఎక్కువచేసి ద్రవ్యోల్బణాన్ని అరికట్ట గలము. అమెరికన్ ప్రజలలో ప్రతి ఒక్కరూ ఎక్కువ పన్నులను చెల్లించడానికి అంగీకరిస్తే అమెరికా ఆర్థిక వ్యవస్థకుగాని, అమెరికా డాలరుకుగాని ప్రమాదం ఉండదు.

కొరత పదార్థాలు సక్రమంగా లభ్యమయ్యేటట్లు చేయడానికి అంతర్జాతీయ ప్రణాళికను తయారుచేయడం మన మూడవ బాధ్యత. అప్పుడే అత్యవసర పదార్థాల ధరలు పెరిగిపోకుండా అరికట్ట గలుగుతాము. ఈ ఏర్పాటులను అంతర్జాతీయంగా చేసుకొనడం కష్టంతో కూడినపని అని అంగీకరిస్తున్నాను. తగరం, ఉక్కు, రాగి, రబ్బరు, ఉన్ని మొదలైన అత్యవసర పదార్థాల విషయమై అంతర్జాతీయంగా ఒప్పందాలు కుదుర్చుకోని పక్షంలో ఇతర దేశాల పోటీతో ఏర్పడుతుంది.

స్వతంత్ర దేశాల నాయకత్వం నిర్వహించే అమెరికాకు మరొక బాధ్యత ఉన్నది. విదేశ వాణిజ్యం విషయంలో మన వైఖరిని మార్చుకోవాలి.

"శాంతి దాత" అని 19 వ శతాబ్దంలో పేరుపొందిన బ్రిటను అన్ని దేశాలకు ప్రయోజనం కలిగించే విధంగా వాణిజ్య విధానాన్ని రూపొందించి అంతర్జాతీయంగా వాణిజ్య స్తోమతను పెంపొందించింది. అమెరికాకూడా ఆ మార్గాన్నే అనుసరించాలి. ఒక శతాబ్దంపాటు మనం చిన్న పరిశ్రమలకు తగిన రక్షణ కల్పించి స్వయం పోషకత్వాన్ని చేకూర్చాము. మన దేశంలో తయారైన వస్తువులను ఇతర దేశాలకు విక్రయించే వారముగాని, వారిపద్దనుంచి కొనేవారము కాదు. మన దేశీయ ఉత్పత్తులకు అనుగుణంగా మనం ఇతర దేశాలనుంచి సరకులను తెప్పించుకోని కారణాన వాణిజ్య రంగంలో ఒడుదుడుకులు ఏర్పడ్డాయి. 1929 నుంచి 1949 ఆఖరువరకూ మనం ఇతర దేశాలనుంచి దిగుమతి చేసుకొన్న వస్తువుల పరిమితి నూటికి ఐదు వంతులు మాత్రం పెరిగింది. అదేకాలంలో మన ఉత్పత్తులు నూటికి 60 వంతులు పెరిగాయి. అట్టి పరిస్థితులలో ఇతర దేశాల సరకులు మనం ఖరీదుచేసి వాటికి ధనం లభింపచేయకపోతే అవి ఎన్ని రోజులని మన వస్తువులను కొనగలవు? మొదటి ప్రపంచయుద్ధం ముగిసినప్పటి నుంచి ఇతర దేశాలకు అప్పులు, గ్రాంటులు ఇవ్వడానికి ఒక డజను పథకాలను అమలుపరిచాము. గత 35 సంవత్సరాలలోను పశ్చిమ ఐరోపా రాజ్యాలకు యుద్ధం

ఖర్చుల నిమిత్తంకాక, 22,00,00,00,000 డాలర్లను ఋణంగా ఇచ్చాము. మనం విదేశాలకు ఇచ్చిన ధనాన్ని ఆ దేశాలవారు మన వస్తువులను కొనుక్కోడానికి తిరిగి మనకే ఇచ్చివేసేవారు.

ప్రపంచ వాణిజ్యం ఎట్టి ఒడుదుడుకులు లేకుండా సాఫీగా సాగాలంటే అది వ్యవహార సరళిలో సక్రమంగా జరగాలని నా అభిప్రాయం. మన దేశంలోని వస్తువులను ఇతర దేశాలకు విక్రయించి వారివద్దనుంచి మనం డాలర్లు తెచ్చుకొంటున్నప్పుడు ఆ దేశాలకుకూడ తమ సరకులను విక్రయించి వారి కవసరమైన డాలర్లను సంపాదించడానికి మనం అవకాశం కలుగజేయాలి. ఇతర దేశాలకు అప్పులివ్వడానికి ప్రపంచ దేశా లన్నిటిలోను ఎక్కువ స్తోమతగల అమెరికా తన దిగుమతులను ఎక్కువ చేసుకోవాలి. మన దేశంలోని ఎగుమతి దిగుమతి సుంకాలు, రేవు సుంకాల విషయాన్ని అతి జాగ్రత్తగా పరిశీలించి అవసరమైన మార్పులు చేయాలి.

1934 సంవత్సరంనుంచి ఆ విషయంలో కొంత ముందుకు వెళ్ళగలిగాము. మనం ఇతర దేశాలతో చేసుకొన్న వాణిజ్యపు ఒడంబడికల ఫలితంగా ఎగుమతి దిగుమతి పన్నులభారం చాలవరకు తగ్గిపోయింది. రేవు సుంకాలను పెంపుచేస్తూ ఆమోదించబడిన స్మూట్ -

హాలీ శాసనంవల్ల కలిగిన నష్టాన్ని ఆ ఒడంబడికలు చాలవరకూ సవరించాయి. ఆ శాసనంలో పేర్కొనబడిన ప్రకారం రేవు సుంకాలను నిర్ణయించడం అనేక అడ్డంకులను కలిగించింది. ఆ సుంకాలు విధించే పద్ధతులలో అనేక తరగతులు ఏర్పాటు చేశారు. అందులో చాలభాగం దురాశతో చేసినట్లున్నాయి. ఉదాహరణకు చెప్తున్నాను. మనం ఇతర దేశాలనుంచి నూలుతో చేసిన తివాసీలను దిగుమతి చేసుకున్నా మనుకోండి. వాటిమీాద నూటికి 10 వంతులు పన్ను విధించబడుతుంది. ఆ తివాసీలకే అంచులుంటే వాటిపైన నూటికి 40 వంతులు పన్ను విధించబడుతుంది. అమెరికాలోని ఒక దిగుమతి వ్యాపారస్తుడు ఇతర దేశాలనుంచి సరకు తెప్పిస్తే వాటిమీాద దిగుమతి సుంకం ఎంత చెల్లించవలసి ఉండేదీ, ఆ సరుకును పూర్తిగా విక్రయించిన తర్వాత గాని తెలియదు. ఎందువల్లనంటే విదేశాల నుంచి సరుకు అమెరికాచేరిన కొన్ని నెలలతర్వాత కూడ సుంకాల విధింపులో మార్పులు చేస్తూ ఉంటారు.

ఇప్పుడు అమెరికా కాంగ్రెసు ఎదుటనున్న రేవు సుంకాల తగ్గింపు శాసనాన్ని కాంగ్రెసు వెంటనే ఆమోదించాలి. ప్రత్యేక పరిస్థితులలో రేవు సుంకాల విధానాన్ని మార్చడానికి అమెరికా ప్రెసిడెంటుకి విచక్షణాధికారాలు ఇవ్వాలి. ఇప్పటికే ద్రవ్యోల్బణం అధికంగా

ఉన్న ఈ రోజులలో కొరతగావున్న వస్తువులపైన సుంకాలను తగ్గించడానికిగాని, తొలగించడానికిగాని, ప్రెసిడెంటుకు అధికార మివ్వాలి. అమెరికాలోని ఏ పరిశ్రమకు దెబ్బలేకుండా ఈ పనిని చేయవచ్చును.

అమెరికా ప్రభుత్వ శాసనాలనుంచి అమెరికా ప్రభుత్వ సంస్థలు విదేశ వస్తువులకు బదులు స్వదేశ వస్తువులనే కొనాలనే నిబంధనను తొలగించాలి. దీనివల్ల రక్షణ కార్యకలాపాలకు అవసరమైన వస్తువుల ధరలు బాగా పెరిగిపోతున్నాయి. మన ఆయుధ పునర్ధారణ కార్యక్రమంతోపాటు, ఇది అదనపు వ్యయమవుతూంది. స్వదేశీ అనే విచక్షణ చూపరాదని మనం ఇతర దేశాలకు నీతులు చెపుతూ, మనమే ఆపని చేయడంలో అర్థంలేదు.

దీనికితోడు మరొక టున్నది. అమెరికా విదేశాలకు పంపే వస్తువులలో నూటికి 50 పంతుల సరుకు అమెరికన్ నౌకలలోనే ఆ దేశాలకు పంపాలన్న షరతు వుండడంవల్ల అమెరికా ఆర్థిక సహకార కార్యక్రమాన్ని అమలు జరపడానికి వ్యయం బాగా పెరిగిపోయింది. ఏ దేశం ఆ సహాయాన్ని పొందుతున్నదో ఆ దేశపు నౌకలలోనే సరకును తరలించడానికి అవకాశ మున్నట్లయితే, వారు మిగుల్చుకొన్న దానినుంచి వారి డాలరు కేటాయింపులు ఎక్కువై ఉండేవి.

అమెరికా అత్యంత బలీయమైన నౌకాదళాన్ని కలిగి ఉండడం అత్యవసరమే. అయినప్పటికీ, నార్వే, బెల్జియం, నెదర్లెండ్స్, గ్రేట్ బ్రిటన్ దేశాలు అట్లాంటిక్ సమష్టి రక్షణకు పంపగల నౌకలసంఖ్యను గమనించి మనకు నౌకాదళం ఎంత ఉండాలనేది నిర్ణయించుకోవాలని నే నంటున్నాను. అట్టి నిర్ణయం జరిగిన తర్వాత అవసరమైనంత ధనాన్ని అందుకు కేటాయించవచ్చును. అదికూడ రహస్యంగా కాక బహిరంగంగానే జరగాలి.

మన విదేశ వాణిజ్యానికి మనదేశంలోని వ్యావసాయిక విధానం అడ్డుతగులుతున్నది. అది ఇతర దేశాలకు ఎంత ఒత్తిడి కలిగిస్తున్నదో, ముందుముందు మన దేశానికి ఎంత నష్టం కలిగిస్తుందో దూరదృష్టిలేకుండా మనం 30 సంవత్సరాలనుంచి అదే విధానాన్ని అవలంబిస్తున్నాము. ప్రపంచంలో ఏ దేశం ఆర్థికవ్యవస్థకైనా వ్యవసాయమే మూలకందం.

వ్యవసాయదారులు పండించిన వాటికి కనిష్ఠ ధరను నిర్ణయించి ఆ ధర అంతకంటె తగ్గబోదని ప్రభుత్వం హామీ ఇవ్వడం మన విధానంలోని పెద్దలోపం. ఏదైనా ఒకటి రెండు ముఖ్యమైన పంటలు పండే వ్యవసాయదారులకు రక్షణ కల్పించే నిమిత్తం ఆ పద్ధతి ప్రవేశపెట్టబడింది. కాని ఈ రోజున ఆ రక్షణ 51 రకాల వస్తువులకు

పెంచబడింది. ప్రపంచంలో ఇటువంటిది ఎక్కడా కన్పించదు.

ఇప్పుడు అమెరికాలోని వ్యవసాయ దారులు ఉత్పత్తి చేస్తున్న వస్తువులలో నూటికి 90 వస్తువులకు సంపూర్ణ రక్షణ కల్పించబడింది. పంటలు పండక నష్టం వచ్చినప్పుడే గాక, మామూలు సమయాలలోకూడ వారికి అధిక సౌకర్యా లున్నాయి.

వ్యవసాయ ఉత్పత్తుల ధరలను ఈ విధంగా ఎక్కువ చేయడంవల్ల మన వాణిజ్య రంగంలోను, విదేశాలతో జరిపే వాణిజ్యంలోను అనేక కొత్త ఇబ్బందులు ఏర్పడి నాయి. వినియోగదారులు ఉత్పత్తి అయిన సరుకు నంతనూ కొనుక్కో డానికి వీలులేక పోతున్నది. మిగిలి పోయిన సరుకు గాదులలోను, గుహలలోను నిల్వవుంచ వలసి వస్తున్నది. అమెరికా వస్తువుల ధరలు విపరీతంగా ఉండడంవల్ల విదేశాలలోని రైతులు ఆర్థికంగా తమకు లాభంలేక పోయినా గోధుమ, ప్రత్తి తమ దేశాలలో పండించుకొంటున్నారు. ఆ వస్తువుల ఎగుమతి మన దేశంలో తగ్గిపోయింది. అమెరికా వ్యవసాయ ఉత్పత్తుల ధరలు ప్రపంచంలో ఎవరూ భరించ లేనంతగా పెంచడం అందరికీ ఆందోళన కలిగించవలసిన విషయం. అమెరికా ఇతర దేశాలకు గత 20 సంవత్సరాలలో చేసిన మొత్తం

ఎగుమతులలో వ్యవసాయ ఉత్పత్తులు నూటికి 25 వంతులు ఉంటాయి. అంటే 20 సంవత్సరాలలోను అమెరికా 3,200 కోట్ల డాలర్ల విలువగల వ్యవసాయ ఉత్పత్తులను విదేశాలకు ఎగుమతి చేసిందన్నమాట. అమెరికా వాయవ్య ప్రాంతంలో ప్రత్తి విశేషంగా పండుతుంది. ఆ ప్రాంతం విదేశాలలోని విక్రేతలమీద ఆధారపడి ఉంటుంది. టెక్సాస్, ఓక్లహోమాలలో పండే ప్రత్తి, కాన్సాస్, వాషింగ్టన్లలో పండే గోధుమ విదేశాల మార్కెట్టులమీద ఆధార పడవలసినదే.

వాణిజ్యం స్వేచ్ఛగా జరగడానికి తక్కువ ధరలకు లభ్యమయ్యే వస్తువులను అధికంగా ఉత్పత్తిచేయాలి. అమెరికాలో ఇప్పటి పరిస్థితి తారుమారుగా ఉండడం వల్ల అది మన ఆర్థిక వ్యవస్థకు కలిగిస్తున్న నష్టానికి నేను ఆందోళన పడకుండా ఉండలేను. ఇప్పుడు వస్తువుల కనిష్ఠ ధరలను నిర్ణయించి అది పడిపోకుండా నిలబెట్ట డానికి ప్రయత్నించడంలో, ప్రభుత్వం క్రొత్త కట్టు దిట్టాలు చేయవలసి రావడమే కాక, అప్పుడప్పుడు జోక్యం కలిగించుకోవలసి వస్తున్నది. అమెరికా కాంగ్రెసు ఆదేశాల ప్రకారం ప్రభుత్వ వ్యవసాయశాఖ ఒక్కొక్క పంటను ఇన్ని ఎకరాలకు మించి పండించ రాదని నిర్ణయించడమో, విక్రయించ వలసిన వస్తువుల మొత్తాలను నిర్ణయించడమో చేయవలసి వస్తున్నది. ఆ

కారణంగా ఉత్పత్తులు దెబ్బతింటున్నాయి. అమెరికా ప్రభుత్వ వ్యవసాయ శాఖయొక్క వస్తు తనఖా సంస్థ వారు 1950 సంవత్సరం మొదటి అర్థభాగంలో 1½ వేల కోట్ల డాలర్ల విలువగల కోడిగుడ్లను, వెన్నను, తదితర వ్యవసాయోత్పత్తులను తనఖా పెట్టుకొని 4½ వేల కోట్ల డాలర్లను అప్పుగా ఇచ్చింది. ఈ నిల్వవున్న సరుకును విడుదల చేయడానికి విదేశాలకు వాటిని విపరీతంగా పంపివేయవలసి రావడంతో, విదేశాలలోని వ్యవసాయదారులు పోటీకి నిలవలేక ఆగ్రహించు కుంటున్నారు. విదేశ ప్రభుత్వాలు మనమీద ప్రతీకార చర్యలు జరుపుతున్నాయి. మన దేశంలోని వ్యవసాయ దారులకు ప్రభుత్వం అనేక సౌకర్యాలు, రక్షణలు కల్పించి బంగాళాదుంపల అధికోత్పత్తికి వారిని ప్రోత్సహిస్తూంది.'

పండిన బంగళాదుంపలలోని కొంతభాగాన్ని ప్రభుత్వంకొని, నిల్వలు అధికం కావడంవల్ల వాటిని నాశనం చేస్తున్నది. రైతులకు రక్షణ కల్పించాలన్న సిద్ధాంతంతో ప్రభుత్వం వాటిని కొనడం జరుగుతూంది. కొన్న తర్వాత, వాటిని ఉపయోగించేవారు లేక వాటిని పశువులకు పెట్టి, లేకపోతే నిల్వ కొట్లలో కుళ్ళిపోయిన తర్వాత అవతల పారబోయడం జరుగుతున్నది. మన వ్యవసాయరంగంలో ఇట్టి అవక తవకలు ఎన్నో జరుగు

తున్నాయి. మన ప్రభుత్వ వ్యవసాయ విధానం మన జాతీయ దురభిమానాన్ని వ్యక్తపరుస్తున్నది. ఇతర దేశాలలో వ్యవసాయ విధానాలుకూడ ఇదేవిధంగా ఉంటున్నాయి. మిగతా అనేక దేశాలలో కూడ ఆర్థిక ప్రయోజనాలు కలిగించని పంటలను రైతులు పండించడం, ప్రభుత్వం వారికి ధనసహాయాన్ని చేసి ప్రోత్సహించడం జరుగుతూనే ఉన్నది. మొదట్లో ఆ పంటలు ఆకర్షణీయంగా కన్పించినా, చివరకు అవి ఆర్థిక వ్యవస్థకు తీవ్రమైన ప్రమాదాన్ని కలిగిస్తున్నాయి.

మన దేశీయ వ్యవసాయ విధానానికీ, మనం విదేశాల పట్ల అవలంబించే ఆర్థిక విధానానికీ జరుగుతున్న సంఘర్షణలను గురించి నా అభిప్రాయాలను స్పష్టంచేయ దలచుకొన్నాను. మన దేశంలోని వ్యవసాయ దారులకు ఆర్థికంగా ఇబ్బందులు లేకుండా రక్షణ కల్పించవలసిన దే. నిరుద్యోగ కార్మికులకు రక్షణ కల్పించినట్లుగా, వ్యవసాయదారులకు సౌకర్యాలు కలుగచేయాలి. దేశీయ, అంతర్జాతీయ వాణిజ్యం దినదినాభివృద్ధి పొందుతున్నందున, దానికి అనుగుణంగా వ్యవసాయ దారులకు తగిన సౌకర్యాలు కలిగించాలి. వ్యవసాయ రంగంలోని ఆర్థిక వ్యవహారాలలో నేను ప్రవీణుడను కాకపోయినా, వ్యాపారరంగంలోని లౌకిక అనుభవాన్ని పురస్కరించుకొని నేను చెపుతున్నాను.

వస్తువుల వినిమయాన్ని బట్టి, అవసరాన్ని బట్టి, వాటిని ఉత్పత్తిచేయాలిగాని కేవలం నిల్వచేయడానికి అధికంగా ఉత్పత్తి చేయకూడదు. ఈ పద్ధతిని ఎంత త్వరగా అమలు జరిపితే మన ఆర్థికవ్యవస్థ అంత త్వరగా చక్కపడుతుంది. అంతర్జాతీయ వాణిజ్య విషయాలలో కూడ ఇదేపద్ధతిని అవలంబించాలి. ప్రపంచ వాణిజ్య అవసరాల కనుగుణంగా తమ దేశాలలోని వ్యావసాయ కార్యక్రమాలను సమన్వయ పరచుకోడానికి స్వతంత్ర రాజ్యాలలోని వ్యవసాయదారుల ప్రతినిధు లందరూ ఒకచోట సమావేశమై ఏకగ్రీవ నిర్ణయాలు చేసుకోవాలి.

ప్రపంచ వాణిజ్య విషయాలలో ఇతర దేశాలతో ఒడంబడికలు చేసుకొనడంకంటే (ఉదాహరణకు అంత ర్జాతీయ గోధుమ ఒడంబడిక) పైన పేర్కొన్న పద్ధతిని అవలంబిస్తే సత్వర ఫలితాలు సిద్ధించగలవు. విదేశ వాణిజ్య సూత్రాలను రచించి, వాటికిమాత్రం కట్టుబడి ఉండడంకంటె, స్వతంత్ర రాజ్యాలలోని వ్యవసాయ కార్యక్రమాలు జాతీయ దురభిమానంతోకూడి ఉండ కుండా చూడాలి.

వస్తువుల ధరలు, ఎగుమతి దిగుమతి పన్నులు, రేవు సుంకాలు మొదలైనవాటికి అవసరాన్ని మించిన

రక్షణలు కల్పించడంవల్ల, మనకు అంతర్జాతీయంగా అనేక అవరోధాలు ఏర్పడుతూ, నియంతృత్వానికీ, దురాక్రమణకూ, నిరంకుశత్వానికీ దారితీస్తున్నాయి. అంతటితో ఆగక యుద్ధాలు సంభవిస్తున్నాయి. యుద్ధం కోసం మనం వ్యయపరచే సొమ్ము రైతుల తాత్కాలిక ఆర్థిక ప్రయోజనాలకోసం చేస్తున్న వ్యయానికి వెయ్యి రెట్లు కాగలదు.

అమెరికాలోని వ్యవసాయ కేంద్రాల నిర్వాహకుల కంటె మనకు ఈ విషయాలలో సలహా లివ్వగలవారు లేరు. అమెరికన్ ఫారమ్ బ్యూరో ఫెడరేషన్, ది నేషనల్ గ్రేంజ్ ఫార్మర్స్ యూనియన్, నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఫార్మర్ కోఆపరేటివ్స్ సంస్థల నాయకులతో నేను అనేకసార్లు సంభాషణలు జరిపి, వారి సలహాలు తీసుకొనే భాగ్యం కలిగింది. వ్యవసాయ ఉత్పత్తులద్వారా, తదితర ఉత్పత్తులద్వారా వాణిజ్యాన్ని వృద్ధిచేసి, స్వతంత్ర రాజ్యాల ఆర్థిక వ్యవస్థలను చక్కబరచడానికి తీసుకోవలసిన చర్యల విషయంలో వారిచ్చిన సలహాలు నాకు చాల ఆనందాన్ని కలిగించాయి. వారు ఆమోదించిన విధానాలు చూడడానికి మన వ్యవసాయదారుల ప్రయోజనాలకు భిన్నంగా ఉన్నట్లు కన్పిస్తాయి గాని, వాటిని అమలు పరిస్తే, దీర్ఘకాలిక ప్రయోజనాలను కలిగించగలవు.

అందువల్లనే వ్యవసాయదారుల వర్గాలన్నీ కలిసి మన వ్యవసాయ రంగంలోని వస్తువుల ధరల నిర్ణయ విధానాన్ని పూర్తిగా మార్పుచేసి, సక్రమ విధానాన్ని రూపొందించగలరని నేను విశ్వసిస్తున్నాను. వ్యవసాయదారుల ప్రాథమిక ప్రయోజనాలకు రక్షణ కల్పిస్తూ, స్వేచ్ఛా వాణిజ్యం కొనసాగడానికి అవకాశం ఉండేటట్లు వారు క్రొత్త మార్పులను చేయాలి.

స్వతంత్ర రాజ్యాలలో నాయకమణిగా ఉన్న అమెరికా నిర్వహించవలసిన బాధ్యతలు అనేకం ఉన్నాయి.

నేను అమెరికా ఆర్థిక సహకార నిర్వహణ శాఖాధిపతిగా ఉన్నప్పుడు, మొదటి ప్రపంచ యుద్ధానికి రెండవ ప్రపంచ యుద్ధానికి మధ్యకాలంలో అమెరికా అవలంబించిన ఏకాకి విధానాన్ని ఇప్పుడు తిరిగి ఒక నిర్మాణాత్మక విధంగా అవలంబిస్తే ఎంతో బాగుందని అనుకొనేవాణ్ణి. కాని మనం వెనక్కు తిరిగి వెళ్లలేము. వివిధ రంగాలలో పురోగమిస్తున్న మనం వెనుకంజ వేయలేము. ఈ క్రొత్త బాధ్యతలను మనం విధిగా నిర్వహించాలి. లేకపోతే స్వతంత్ర రాజ్యాలు అడుగికి పోతాయి. అంటే శాంతియుద్ధాన్ని జరిపి శాంతిని సాధించలేక పోతే, ఆ తప్పు అమెరికాదే కాగలదు.

# శాంతి సాధనకై సైనికరంగంలో జాగ్రత్తపడాలి

## 5 వ అధ్యాయము

సోవియట్ రష్యా యుద్ధబలాన్ని చూచాయగా తెలుసుకోనగోరే అమెరికన్‌కు సులభమైన మార్గం బహుశా ఒక్కటే ఉన్నది. బెర్లిన్‌లోని బ్రిటిషు ప్రాంతంలోనున్న రష్యన్ యుద్ధవీరుల స్మారక మందిరాన్ని ఒకసారి దర్శిస్తే అదంతా బోధపడుతుంది. ఇది బ్రిటిష్ ప్రాంతంలో ఉండడం విచిత్రం.

శిథిలమైపోయిన రైష్‌స్టాగ్‌కు సమీపంలోని బ్రాండెన్‌బర్గు గేటుకు పశ్చిమంగా ఆ స్మారక మందిరం ఉన్నది. ఆ గేటువద్ద రష్యన్ సైనికులు అహర్నిశలు కాపలాకాస్తూ ఉంటారు. ఆ గేటు ఎదుట ఒక పెద్ద టాంకు, శతఘ్నులు ఉంటాయి. యుద్ధవీరుల స్మారక మందిరంవద్ద ఆమాత్రం కాపలాపెట్టడం ఉచితమే అయినా, అందులో నాకు వేరొక ఉద్దేశం కనిపిస్తున్నది.

నేను క్రిందటిసారి అక్కడికి వెళ్ళి యుద్ధచిహ్నాలైన ఆ టాంకును, శతఘ్నులను చూచినప్పుడు, కొరియాలో భీషణయుద్ధం జరుగుతున్నది. రష్యాయొక్క అసంఖ్యాకమైన యుద్ధపరికరాలను, టాంకులను, మరఫిరంగులను –

శాంతికోసం - మనం అంతకంటె ఎక్కువ శక్తితో నిరుపయోగం చేస్తేతప్ప ఎంత ప్రయత్నించినా సుస్థిర శాంతిని నెలకొల్పజాలమని నాకు గట్టిగా తెలుసు.

శాంతికోసం కృషి చేసేవారిలో నేను ఒకణ్ణి అని భావిస్తున్నాను. ఆర్థిక, రాజకీయ విధానాలద్వారాను, ఇతర హింసారహిత మార్గాలద్వారాను మాత్రమే సుస్థిరశాంతిని నెలకొల్పగలమని నేను హృదయపూర్వకంగా ఆశిస్తున్నాను. దొడ్డిగుమ్మం తెరచి ఉన్నప్పుడు వాకిలిగుమ్మం మూసివేయడంవల్ల కలిగే ప్రయోజనం లేదని మనమందరం ఇప్పుడు గుర్తించే ఉన్నాము. స్వతంత్ర రాజ్యాలు దురాక్రమణపరులనుంచి ఆత్మరక్షణ చేసుకోగలిగినప్పుడే అవి స్వతంత్రంగా మనగలవు.

ఈ విషయంలోకూడ నాయకత్వం వహించవలసిన బాధ్యత అమెరికామీద ఉన్నది. రష్యా మనమీద దాడిచేయడానికి సాహసించ వీలులేకుండా, మన రక్షణలను కట్టుదిట్టం చేసుకోడమేగాక, పశ్చిమయూరప్, ఆసియాలమీదకు సేనలను పంపితే ఆత్మహత్య చేసుకోవడమే కాగలదని రష్యా గ్రహించేటట్లు ఆ స్వతంత్ర రాజ్యాల సైనికబలాన్ని వృద్ధిచేయడానికి మనం తోడ్పడాలి. నేను స్వతహాగా సైనిక ప్రవీణుడను కాక పోయి

నప్పటికీ, అనేకమంది సైనిక ప్రవీణులతో ప్రత్యక్ష సంబంధ మున్నందున ఆ విధంగా చెప్పగలుగుతున్నాను. మన ఆర్థిక వ్యవస్థకు ఉపద్రవం కలుగకుండా మన రక్షణ కార్యకలాపాలకు ధనాన్ని సమకూర్చుకోడం అత్యంత కష్టమైన విషయమని నాకు తెలుసు.

అమెరికాను, దాని అధీనంలోగల ప్రాంతాలను రక్షించడమే అమెరికా సైనిక, వైమానిక, నౌకా శాఖల ప్రాథమిక బాధ్యత. ఈనాడు ప్రపంచంలో కాన వస్తున్న భిన్న వైఖరుల ఫలితంగా మన దేశాన్ని మాత్రం మనం రక్షించుకొని కూర్చోడానికి వీలులేదు. మన దేశాన్ని మాత్రం రక్షించుకోడానికి సైన్యాలను ఉపయోగిస్తే మనకు సంపూర్ణ రక్షణ చేకూరినట్లు కాజాలదు. రాపిడ్ నగరంచుట్టూ రాడార్ యంత్రాలను ఏర్పాటుచేయడంవల్ల, కీకుక్ చుట్టూ విమాన విధ్వంసక శతఘ్నులను ఏర్పాటుచేయడంవల్ల మనకు వృధా ధనవ్యయం తప్ప, సంపూర్ణమైన, బలీయమైన రక్షణ కాజాలదు. అనేక మైళ్ళ దూరంనుంచి విమాన దాడులు జరపడానికి వీలున్న ఈ రోజులలో, యాటం బాంబులు, ఇతర నవీన ఆయుధాలు ఉపయోగించే ఈ యుగంలో అమెరికా రక్షణకు బెర్లిన్, టోకియో, స్పిట్స్‌బెర్గెన్ నగరాలనుంచి అమెరికావరకూ కట్టుదిట్టాలు చేయాలి.

మన మిత్రదేశాలలో ఏ దేశంమీద దాడి జరిగినా అది మనమీద జరిగినట్లే. అందువల్లనే మనం మనలను రక్షించుకొంటూ, స్వతంత్ర రాజ్యాలను రక్షిస్తూ ఏక సమయంలో రెండు బాధ్యతలను నిర్వహిస్తున్నాము.

మన భద్రత ఇతర స్వతంత్ర దేశాల భద్రతమీద ఆధారపడి ఉన్నది. జేమ్సు మన్రో అమెరికా ప్రెసిడెంటుగా ఉన్నప్పుడే ఈ సూత్రం అమెరికా జాతీయ విధానంలో ఒకభాగంగా పరిగణించబడింది. ఉత్తర దక్షిణ అమెరికాల వ్యవహారాలలో జోక్యం కలిగించుకుంటే సహించ జాలమని మిగతా ప్రపంచాన్ని హెచ్చరిస్తూ జేమ్సు మన్రో ఆనాడే ఒక సిద్ధాంతాన్ని రూపొందించాడు. మన పొరుగున ఉన్న లాటిన్ అమెరికా దేశాలతో సంప్రతింపులు జరగడానికి ఏ వ్యవస్థలు లేనందున మన్రో స్వయంగానే ఆ సిద్ధాంతాన్ని రూపొందించాడు. ఈ నాడు సంప్రతింపులు జరుపుకొని, ఒడంబడికలు కుదుర్చుకోడానికి విశాల అమెరికన్ యూనియన్ వంటి సంస్థ లున్నాయి. అమెరికాలోని వివిధ రాష్ట్రాలమధ్య ఒడంబడికలు కుదుర్చుకోడానికి ఈ నాడు అఖిల అమెరికన్ యూనియన్ ఉన్నది. 1947 లో రియోలో జరిగిన అమెరికా దేశాల సమావేశంలో పరస్పర సహకార ఒడంబడికను చేసుకొన్నారు. తమలో ఏ ఒక్కరిమీద దాడిజరిగినా అందరూ సమ

ష్టిగా ఎదుర్కోడానికి అమెరికన్ రిపబ్లికులన్నీ ఆ సమావేశంలో ఏకగ్రీవంగా అంగీకరించాయి.

పరస్పర రక్షణసహాయకార్యక్రమంక్రింద, దూర ప్రాచ్యంలోని కొరియా, ఫిలిప్పీన్స్, చైనాలతోను, మధ్య ప్రాచ్యంలోని ఇరాక్, టర్కీ గ్రీస్ దేశాల తోను రక్షణ ఏర్పాటులకు దిగినాము. ఉత్తర అట్లాంటిక్ రక్షణసంధి ఫలితంగా పశ్చిమ యూరప్‌లోని బ్రిటను, నార్వే, డెన్మార్క్, బెల్జియం, నెదర్లెండ్స్, లగ్జెంబర్గు, ఫ్రాన్సు, పోర్చుగల్, ఇటలీ, ఐస్‌లెండు దేశాలతో అమెరికా, కెనడాలు చేతులుకలిపి సమష్టిగా దురాక్రమణను ప్రతిఘటించడానికి ఒప్పందం చేసుకొన్నాయి. అన్నిటికంటె ఐక్యరాజ్య సమితి సభ్యత్వ దేశంగా అంతర్జాతీయ శాంతి భద్రతలను కాపాడడానికి అవసరమైన పక్షంలో నౌకా, వైమానిక, సైనిక చర్యలను తీసుకోవలసిన ధర్మం అమెరికాకున్నది.

ప్రపంచంలో ఎక్కడైనా పోరాటంగాని సంఘర్షణగాని సంభవించి, శాంతికి భంగం కలిగిస్తూంటే భద్రతాసంఘం (ఒక దేశంయొక్క "వీటో" కు గురియై) నిరోధించ లేనప్పుడు ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీని అత్యవసరంగా సమావేశ పరచవచ్చును. భద్రతా సంఘంలోని ఏడుగురు సభ్యులు కోరినా,

జనరల్ అసెంబ్లీలోని మెజారిటీ సభ్యులు కోరినా, 24 గంటలలోగా అట్టి అత్యవసర సమావేశాన్ని ఏర్పాటు చేయవచ్చును. సోవియెట్ రష్యా వీటో అధికారాన్ని ప్రయోగించకుండా చేయడానికి వీలుగా జనరల్ అసెంబ్లీలోని మెజారిటీ సభ్యులు కోరితే సమావేశాన్ని ఏర్పాటు చేయాలని క్రొత్తగా చేర్చబడింది. ఐక్యరాజ్యసమితి, సభ్యత్వదేశాల సాయుధ సేనలలోని కొంతభాగాన్ని ప్రత్యేకించి, దురాక్రమణ ప్రతిఘటనకు ఆ దళాలను తక్షణం ఉపయోగించవలెనని అమెరికా చేసిన ప్రతిపాదనపై ఇప్పుడు చర్చ జరుగుతున్నది. ఆ ప్రతిపాదన ఆమోదించబడితే దురాక్రమణ ప్రారంభమైన మరుక్షణంలోనే దానిని అరికట్టవచ్చును.

ప్రపంచంలోని దుర్బల ప్రాంతాలను పరిరక్షించడానికి మనకు తగినంత సైనికబలం లేదు. త్వరలో మనం సమకూర్చుకునే అవకాశమూ కన్పించడంలేదు. ఇండో - చైనా, బర్మా, ఆఫ్ఘనిస్థాన్, ఇరాన్ తదితర దేశాలు సోవియెట్ రష్యా ప్రభావానికి గురికావడానికి వీలుగా ఉన్నాయి. దురాక్రమణ జరిగిన ప్రతిదేశాన్ని రక్షించడానికిగాను, అమెరికా స్వప్రయోజనంకోసం పెద్దయుద్ధాన్ని సాగించాలని మనం ఆశించడంలేదు.

మన సాయుధబలం, అట్లాంటిక్ సంధి దేశాల బలం, ఐక్యరాజ్యాల సైనిక దళాలు, బలవంతులైన ఇతర

మిత్రదేశాల సైనికదళాలను చూచి రష్యా యుద్ధంలోకి దిగడానికి భయపడుతుంది. ఒకవేళ దిగినా బ్రతికి బయట పడలేమని రష్యాకు తెలుసు.

స్వతంత్ర రాజ్యాల రక్షణకు అట్లాంటిక్ రక్షణసంధి అమోఘంగా ఉపకరించగలదు. యూరప్‌లో జాతీయతా భావం ఒకనాడు అత్యున్నత స్థితిలోకి వెళ్లి ఈనాడు దిగజారుతున్నది. దానిని పునరుద్ధరించడానికి అట్లాంటిక్ సంధి విశేషంగా తోడ్పడగలదు. యూరప్‌లోని అనేక రాజ్యాలవారు తాము విడివిడిగా పోరాటం సాగించేకంటె సమష్టిగా యుద్ధంచేయడానికి సుముఖంగా ఉన్నారు. తాము విడివిడిగా పోరాడితే నాశనం కాక తప్పదనీ, పశ్చిమ యూరప్ రాజ్యాలన్నీ ఏక సైనిక నాయకత్వం క్రింద పోరాటాన్ని సాగిస్తే అత్యంత ప్రయోజనం కలిగించగలదనీ వారికి గట్టిగా తెలుసు. పశ్చిమ జర్మనీ అంగబలాన్నీ, ఉత్పత్తులనూ సక్రమంగా వినియోగించడానికి కూడ ఆ సంధి తోడ్పడగలదు.

అట్లాంటిక్ సంధి కుదుర్చుకొన్న మొదటి సంవత్సరంలో కార్యసాధన ఏవిధంగా చేయాలన్న సమస్య ఉత్పన్నమైంది. అందుకు అనేక కమిటీలను ఏర్పరిచారు. వారు జరిపిన పరిశీలనలు, చర్చలు అసమగ్రంగాను, అతి క్లిష్టంగాను ఉంటూ వచ్చాయి. అందరికీ అంగీకార

యోగ్యమైన ఉన్నతాధికారవర్గంగాని, ఉన్నత నాయకత్వంగాని సమకూరలేదు. కాని మన అదృష్టవశాత్తూ ఇప్పటికి ఆ రెంటినీ చేకూర్చుకో గలిగాము. ప్రఖ్యాత సైనికనాయకుడు జనరల్ ఐసెన్‌హోవర్ సైనిక ఆధిపత్యాన్ని స్వీకరించడానికి అంగీకరించడం గొప్ప విశేషం. ఇతరులలో ఉత్సాహం కలిగించే నేర్పు, నచ్చచెప్పి ఆమోదించేటట్లు చేయడానికి అవసరమైన రాజనీతిజ్ఞత, ఐరోపా సైన్యాన్ని సమకూర్చడానికి కావలసిన పట్టుదల ఆయనలో ఉన్నాయి. ఇక్కడ మనం ఒక నిముషంసేపు ఆగి, సోవియట్ రష్యా సైనికబలాన్ని, మన సైనికబలాన్ని పోల్చి చూచుకొందాము.

జనాభా విషయంలో మనదే తక్కువ. కాని మిగతా అనేక విషయాలలో సోవియెట్ రష్యా, దాని ఉపగ్రహ రాజ్యాలకంటె మనదే పైచెయ్యిగా ఉన్నది. సాలీనా 9,50,00,000 టన్నుల ముడి ఉక్కును ఉత్పత్తిచేయగల స్తోమత అమెరికాకు 1951 లో లభించగలదు. పశ్చిమ ఐరోపా 5,50,00,000 టన్నుల ముడిఉక్కును ఉత్పత్తి చేయగలదు.

సోవియెట్ రష్యా, దాని ఉపగ్రహ రాజ్యాలు కలిసి మొత్తం 3,30,00,000 టన్నుల ఉక్కును మాత్రం ఉత్పత్తిచేయగలవు. అమెరికా 60 కోట్లనుంచి 70 కోట్ల

టన్నులు, పశ్చిమ యూరప్ 500 కోట్ల టన్నుల బొగ్గును ఉత్పత్తి చేయగలవు. రష్యా, దాని ఉపగ్రహ రాజ్యాలకు లభ్యమయ్యే బొగ్గు 40 కోట్ల టన్నులు మాత్రమే. అమెరికా 4½ కోట్ల టన్నుల సిమెంటును తయారుచేయగలదు. పశ్చిమ యూరప్ 5 కోట్ల టన్నులు తయారు చేయగలదు. రష్యా కూటమి దేశాలు 1 కోటి 30 లక్షల టన్నుల సిమెంటునుమాత్రం తయారు చేయగలవు.

అమెరికా 2,30,00,00,000 ల పీపాల పెట్రోలును, పశ్చిమ యూరప్ 2,50,00,000 పీపాల పెట్రోలును ఉత్పత్తి చేయగలవు. ఇతర స్వతంత్ర రాజ్యాలు, దక్షిణ అమెరికా, సమీపప్రాచ్య, దూరప్రాచ్య దేశాలు 200,00,00,000 పీపాల పెట్రోలును అదనంగా ఉత్పత్తి చేయగలవు. సోవియెట్ రష్యా, దాని ఉపగ్రహ రాజ్యాలు 1951-వ సంవత్సరంలో 35,00,00,000, పీపాల పెట్రోలును ఉత్పత్తి చేయగలవు. 1951 లో అమెరికా 4,00,00,00,00,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని, పశ్చిమ యూరప్ 2,50,00,00,00,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తినీ, రష్యాకూటమి దేశాలు 1,40,00,00,00,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తినీ ఉత్పత్తి చేయగలవు. ట్రాక్టర్లు, మోటారు కార్లు, తదితర పరికరాల విషయంలో కూడ రష్యా కూటమి దేశాలకంటె ఎక్కువ

మొత్తాన్నే స్వతంత్రరాజ్యాలు తయారుచేయగలవు. పైన పేర్కొనబడిన స్వతంత్ర రాజ్యాల ఉత్పత్తులకు అవసరమైన వస్తుసంపదలో అధికభాగం పశ్చిమ యూరప్‌లో లభిస్తున్నాయన్న యదార్థాన్ని పాఠకులు మరచిపోరాదు. పశ్చిమ ఐరోపా రక్షణవిషయం పట్టించుకోరాదనే మహానుభావులు ఒక్క విషయాన్ని గుర్తుంచుకోవాలి. పశ్చిమ యూరప్‌ను రష్యా జయించి, ఆ వస్తుసంపదనంతనూ స్వాధీనపరుచుకొంటే అప్పుడు రష్యా వస్తుసంపద అమెరికాతో సమానంకాగలదు. శాంతిసాధనా కృషిని మనం ఒక్కరమే సాగించలేమన్న విషయం ఈ ఒక్క అంశం రుజువు చేయగలదు.

మన పారిశ్రామికశక్తి, సైనికశక్తి సరి సమానంగానే ఉన్నాయని చెప్పాలి. శాస్త్రీయ పురోభివృద్ధిలో అమెరికాదే పైచేయి. యాటంబాంబులు మొదలైన మహాస్త్రాలు, శతఘ్నులు తయారుచేయడానికి అణుశక్తి విషయంలో మనం సాగిస్తున్న ఇతర పరిశోధనలలోను మనదే పైచేయి. మనం అనుకునే దానికంటె మనం ఎక్కువ బలవంతులము. అంగబలం విషయంలో ఈ నాడు రష్యాలోనే ఎక్కువమంది సైనికులున్నారు. సుశిక్షితులై, సంపూర్ణ సైనిక పరికరాలుగల 64,00,000 మంది సైనికులను రష్యా ఈ నాడు యుద్ధరంగంలోకి దింపగలదు. కమ్యూనిజంలేని రాజ్యా

లకు అంసపూర్ణ శిక్షణ పొందినవారుమాత్రం ఉన్నారు. వారయినా 31,75,000 మందికి మించి లేరు. నౌకాబలం విషయంలో రష్యాకంటె ఆ రాజ్యాలే ఎక్కువబలాన్ని కలిగి ఉన్నాయి. కమ్యూనిజం లేని రాజ్యాలకు 60 లక్షల టన్నుల బరువు మోయగల నౌక లున్నాయి. కమ్యూనిస్టు రాజ్యాలకు 15 లక్షల టన్నుల బరువును మోయగల నౌక లున్నాయి. వైమానిక బలంలో, కమ్యూనిజంలేని రాజ్యాలకు 38 వేల విమానాలు ఉన్నాయి. అంటే రష్యాకున్న విమానాలకంటె తొమ్మిదివేలు అధికంగా ఉన్నాయన్నమాట.

పశ్చిమ యూరప్‌లోని స్వతంత్ర రాజ్యాల బలహీనత స్పష్టంగా వ్యక్తమౌతున్నది. బ్రిటను, ఫ్రాన్సు, ఇటలీ, బెల్జియం, హాలెండు, లగ్జెంబర్గ్ ఇతర రాజ్యాలు ఆయుధ పునర్ధారణ కార్యక్రమాన్ని ఇప్పుడిప్పుడే ప్రారంభించాయి. సోవియట్ రష్యా ఈనాడు పశ్చిమ యూరప్ రాజ్యాలకుగల ఒకలక్ష సైన్యంమీద తన 10 లక్షల సైన్యాన్ని ప్రయోగించవచ్చును. వారి అయిదు వేల టాంకులమీద 45 వేల టాంకులను ప్రయోగించవచ్చును. రష్యాతో యుద్ధం సంభవిస్తే ఫ్రాన్సు, ఇటలీలలోని స్థానిక కమ్యూనిస్టుల పలుకుబడి ఫలితంగా విధ్వంసక చర్యలు జరిపి రైళ్ల రాకపోకలను, తంతి తపాలా సౌకర్యాలను స్తంభింప చేయవచ్చును.

అటువంటప్పుడు రష్యా అట్లాంటిక్ దేశాలపై దాడి ఎందుకు ప్రారంభించలేదు? మనం అనేక సంవత్సరాల వరకూ యుద్ధబలాన్ని పెంపొందించుకోలేని స్థితిలో ఉన్నందున, త్వరలో రష్యా దాడి ప్రారంభించ నున్నదా? నేను యూరప్‌లోని అనేక ప్రముఖులను వాటికి సమాధానాలు చెప్పమని కోరాను. చర్చిల్, బెవిన్, నెదర్లెండ్స్‌లోని డర్క్ స్టిక్కర్, ఇటలీకి చెందిన గ్యూసెప్పి పెల్లా, బెల్జియంలోని పాల్ వాన్ జీలెండ్‌లను సమాధానాలు చెప్పవలసినదిగా అడిగాను. రష్యా ఎర్ర సైన్యం ఇప్పుడప్పుడే దాడి ప్రారంభించదని వారు నమ్ముతున్నట్లు చెప్పారు. దానికి అనేక కారణాలున్నాయన్నారు.

ప్రతివారి మనస్సులోను, ముఖ్యంగా చర్చిల్ మనస్సులో గాఢంగావున్న అభిప్రాయం : మనకు అందరికంటె శక్తిమంతమైన, అసంఖ్యాకమైన యాటంబాంబులు ఉన్నందునా, హైడ్రోజన్ బాంబు నిర్మాణానికి మనం కృషి సాగిస్తున్నందునా, ఎర్రసైన్యం దండయాత్ర సాగించడానికి సాహసించలేక పోతున్నది. కొరియాలో దురాక్రమణ నరికట్టడానికి ఐక్యరాజ్య సమితి తీసుకొన్న చర్యలను వారందరూ బలపరిచారు. రష్యా పశ్చిమ యూరప్‌మీద దాడిచేస్తే ప్రపంచయుద్ధంగా పరిణమిస్తుందని రష్యాకు గట్టిగా తెలుసు.

ఇంకా ఇతర కారణాలుకూడా ఉన్నాయి. యూరప్ రాజ్యాలవారికి రష్యానుగురించి మనకంటె ఎక్కువగా తెలుసు. ప్రపంచ ప్రజల అభిప్రాయమంటే రష్యా చిర్రుబుర్రు లాడుతుంది. రష్యా పశ్చిమ ఐరోపాలో దురాక్రమణ జరిపే పక్షంలో, తప్పనిసరిగా యూరప్‌లోని స్వతంత్ర రాజ్యాలన్నీ సమష్టిగా రష్యాకు వ్యతిరేకంగా తిరుగక తప్పదని సోవియెట్ యూనియన్‌కు తెలిసిన విషయమే. అట్టి దురాక్రమణను బహిరంగంగా జరిపితే, జాతీయవాదులమనీ, మోక్షసాధకులమనీ కమ్యూనిస్టులు చెప్పుకునే గంభీర వచనాలు ఉత్త మాటలై తమ వాదానికి భంగం కలుగుతుందనికూడా రష్యాకు తెలుసు. సోవియెట్ సామ్రాజ్యవాద ధోరణి పట్ల ఇండియా, పాకిస్థాన్, బర్మా దేశాలు ప్రదర్శిస్తున్న సహనం ఒక్కసారిగా ఎదురు తిరగగలదు.

ప్రస్తుత పరిస్థితుల్లో పెద్దయుద్ధం అనవసరమని రష్యన్ నాయకులు భావిస్తున్నట్లు యూరప్ దేశాలవారు వాదిస్తున్నారు. పెట్టుబడిదారీ విధానంగల రాజ్యాలలో మూలసిద్ధాంతాలలో పరస్పర విరుద్ధమైన సంఘర్షణలు ఉత్పన్నమై, ఆ రాజ్యాలు నేలమట్టం కాగలవన్న మార్క్స్ సిద్ధాంతాన్ని రష్యా పాలకవర్గం విశ్వసిస్తున్నదట. అనేకమంది రష్యన్ జ్యోతిష్కులు మనం 1946, 48, 49, సంవత్సరాలలో ఆర్థికంగా ఒడుదుడుకులకు

తట్టుకోగలమని చెప్పిన జోస్యం ఫలించకపోయినా, పెట్టు బడిదారీ విధానం కూలిపోయేవరకు కనిపెట్టుకొని కూర్చొని ఎముకలను ఏరుకోవచ్చునని మాస్కో కని పెట్టుకు ఉన్నట్లున్నది. కాలం తమకే అనుకూలంగా ఉన్నదని రష్యా విశ్వసిస్తున్నదట. సోవియెట్ సైన్యాలు పశ్చిమ ఐరోపాలో ప్రవేశించి, సర్వాధిపత్యాన్ని పొందడానికి ప్రయత్నించే పక్షంలో, అప్పుడు ప్రారంభ మయ్యే ప్రతిఘటనోద్యమాలను అణగ ద్రొక్కడానికి తగినబలం తమలో ఉన్నదా లేదా అనేది రష్యాకు ఇప్ప టికీ సదేహంగానే ఉన్నది. అదీగాక పశ్చిమ ఐరోపా సైనికుల సౌఖ్యవంతమైన జీవితం రష్యను సైనికులు చూడకూడదనికూడ రష్యా సంకల్పించు కున్నట్లు వారు చెపుతున్నారు.

రెండవ ప్రపంచయుద్ధం చివరినెలల్లో రష్యాకు పశ్చి మంగా ఉన్న దేశాలలోని ప్రజల ఉన్నత జీవన ప్రమా ణాలను రష్యన్ సైనికులు చూచి ఆశ్చర్యపోయారు. అమెరికన్ సైనికులు తినే ఉత్తమ ఆహారాన్ని, వారు ధరించిన దుస్తులు, పాదరక్షలు, వారి గడియారాలు, సిగరెట్లు మొదలైనవి చూచి రష్యన్ సైనికులకు చాల ఈర్ష్య కలిగింది.

పైన పేర్కొన్న విషయాలమాట అటుంచి, స్వతంత్ర రాజ్యాలమీద దండయాత్రలు జరిపి, గత

యుద్ధంలో హిట్లర్, ముస్సోలినీలు పతనమైనారని స్టాలిన్‌కు గట్టిగా తెలుసు. పై సంఘటనలద్వారా గడిం చిన అనుభవాన్ని పురస్కరించుకొని, కేవలం అదృష్టం మీద ఆధారపడి అంతటి సాహసచర్యకు పూనుకొనడం స్టాలిన్ పద్ధతికాదు. హిట్లర్, ముస్సోలినీలు యుద్ధాన్ని ప్రారంభించి, దానిని గెలువలేక పతనమై పోయారని ఆయన ఎరిగివున్న విషయం. రెండవ ప్రపంచ యుద్ధా నంతరం రష్యాలో అమెరికా రాయబారిగా పనిచేసిన హారిమన్‌తో ఒక సమావేశంలో స్టాలిన్ "దీర్ఘకాలం యుద్ధంలో ఇరుకుకొనడమే హిట్లర్ చేసిన మహాప రాధం" అని అన్నాడట.

ఇంతకు ముందు తెల్పిన అంచనాలు రష్యా మూడవ ప్రపంచ యుద్ధాన్ని ప్రారంభించబోదని గ్యారంటీ ఇవ్వ వనుకోండి. కాని, ప్రస్తుత పరిస్థితులకు సంతృప్తిపడి కూర్చోడానికి అవి తోడ్పడజాలవు. రష్యన్ సైన్యాలు దండయాత్ర ప్రారంభించడానికి సాహసించకుండా ఉండే లాగు మన రక్షణ ఏర్పాటులను అతి చురుకుగా సాగించుకోడానికి పైన పేర్కొన్న పరిస్థితులు కొంత ఆశాభావాన్ని కలిగిస్తున్నాయి.

మన ఉన్నత సైనిక ప్రవీణులలో గల అభిప్రాయాల ప్రకారం 1953 వ సంవత్సరంనాటికి 40 లక్షల

సైనికులుగల దళాలను అమెరికా సమకూర్చుకోవాలి. ఈ దళాలు రంగంలోకి దూకడానికి సిద్ధంగా ఉండాలి. వీటికి రక్షణగా నిలవలో ఉండే సేనలను ఎక్కువగా సమకూర్చాలి. ఒక వెయ్యి నౌకలుగల నౌకాదళాన్ని, ఒక్కొక్కదానిలో 100 విమానాలు చొప్పున ఉండే వైమానిక దళాల్ని వాటికి తోడుగా ఏర్పాటుచేయాలి. ఒక వేళ ప్రపంచయుద్ధం సంభవిస్తే అమెరికానుంచి భారీ సహాయం వచ్చేవరకు సోవియట్ రష్యాను రైన్ నది తూర్పుభాగంలో నిలిపివేయడానికి, కనీసం 50 డివిజన్‌ల సైన్యాల్ని పశ్చిమ యూరప్ రాజ్యాలు సమకూర్చుకోడానికి మనం వారికి సహాయపడాలి. ఐక్యరాజ్య సమితి తన రక్షణ దళాలను 5 డివిజన్‌లవరకూ పెంపు చేసుకోడానికి, ప్రమాద ప్రాంతాలకు వాటిని తరలించడానికి, వడిగా నడిచే మోటారు శకటాలను సమకూర్చుకోడానికి మనం సహాయపడాలి.

దీనికంతకూ బోలెడంత ధనం కావలసి ఉన్నది. రానున్న మూడు సంవత్సరాలలోను, మనం సాలీనా అయిదువేల కోట్ల డాలర్లు వ్యయపరచవలసి ఉన్నది. సమష్టి రక్షణసహాయ కార్యక్రమంక్రింద యూరప్‌కు కేటాయించబడిన 600 కోట్ల డాలర్లు, ఆసియాకు కేటాయించబడిన 100 కోట్ల డాలర్లు ఆ మొత్తంలో చేరి ఉన్నాయి. జార్జి వాషింగ్‌టన్ అన్నట్లు రక్షణ కార్య

క్రమం దిగ్విజయంగా జరగాలంటే అంత సొమ్ము వెచ్చించడం అత్యావసరం. అంటే శత్రువు అసలు దాడి ప్రారంభించకుండా నిరోధించడం, లేక దాడి ప్రారంభిస్తే దానినుంచి రక్షించుకొనడం, ఈ రెండూ నెరవేర్చడమన్నమాట. ఈ అయిదువేల కోట్ల డాలర్లలోను 1500 కోట్ల డాలర్లు పెంపొందించబడిన మన సాయుధ సేనల కవసరమైన పరికరాలక్రింద ఖర్చు కాగలదు. అంటే మూడవ సంవత్సరంలో మన సాయుధ సేనలు రక్షణ భారాన్ని నిర్వహించడానికి సర్వసిద్ధమైన తరువాత, ఆ ఖర్చులో కొంత భాగాన్ని తగ్గించుకో వచ్చును. రక్షణ కార్యక్రమాలకు మనం ఖర్చు చేస్తున్న సొమ్ము, సాలీనా మన జాతీయ ఆదాయం, ఈ రెంటినీ పోల్చి ఆ వ్యత్యాసాన్ని గమనించవలసి ఉన్నది. (1950 లో మన ఆదాయం 2,79,00,00,00,000 డాలర్లు) మన సైనిక వ్యయం బాగా పెరిగిపోయి, దీర్ఘకాలం దానిని భరించవలసివస్తే మన ఆర్థిక వ్యవస్థ దెబ్బ తింటుంది. ద్రవ్యోల్బణం పెరిగిపోతుంది. అన్నింటిమీద విధిగా కంట్రోళ్లు పెట్టవలసి వస్తుంది. ఎట్టి నిర్బంధాలు, ఒడుదుడుకులు లేని విధంగా, మన ఆర్థిక వ్యవస్థ తిన్నగా ఉండాలంటే మన సైనిక వ్యయం పరిమితంగా జరుగుతూ, అమెరికా తన ఉత్పత్తులను ఎక్కువ చేయడానికి వీలుగా ఉండాలి.

నేను సూచించిన విధంగా మన రక్షణవ్యయాన్ని చక్కదిద్ది మూడవ సంవత్సరం పూర్తయిన తర్వాత వ్యయాన్ని తగ్గిస్తే, మన ఆర్థిక వ్యవస్థకు అంత ప్రమాదం సంభవించదు. ఆవిధంగా చేయడానికి సైనిక రంగంలో మనం కొన్ని మార్పులు తీసుకురావాలి. అమెరికా సైనిక శాఖలోని "ప్రైవేటు"కు (నాన్ కమిషన్డు ఆఫీసరు క్రిందివాడు) ఇప్పుడు వైద్యసహాయం, ఇతర అలవెన్సులు గాక రోజుకు మూడు డాలర్లు ఇస్తున్నారు. ఆ మూడు డాలర్లు అతనికి అవసరమే. అందులో ఎట్టి సందేహం లేదు. మన సైనిక శాఖలో చేరినవారిలో అనేకమందిని ఇతర దేశాలకు పంపినపుడు, అతని మీద ఆధారపడి ఉన్న అతని కుటుంబానికి దూరమవుతున్నాడు. రష్యా దురాక్రమణను నిరోధించడానికి తగిన సైనిక బలాన్ని సమకూర్చుకోవాలంటే 30 లక్షలమంది సైనికులు, నావికులు, వైమానికులు కావాలి. వారందరికీ రోజుకు మూడేసి డాలర్లు చొప్పున ఇస్తే, మనం లోగడ నిర్ణయించిన 2500 కోట్ల డాలర్లు సరిపోవు. దాన్ని సరిదిద్దుకొనడానికి ఒక్కటే మార్గమున్నది. సార్వజనీన సైనిక శిక్షణ అమలు జరపడం. దాన్ని ఏ విధంగా అమలు జరపాలో ఈ క్రింద వివరిస్తున్నాను.

అమెరికాలో యువకులందరూ 18-వ సంవత్సరం రాగానే కుటుంబ బాధ్యతలను స్వీకరించడానికి ముందు

సైనికశిక్షణ కేంద్రంలో చేరి రెండు సంవత్సరాలపాటు పరిశీదు పొందాలి. అక్కడ వారికి తిండి, బట్ట, సాదరు ఖర్చు ఇస్తారు. అంతా కలిపి మనిషికి రోజుకు ఒకడాలరు అవుతుంది. (టర్కీ సైనికుడికి నెలకు ఒక డాలరు నగదు రూపంలో ఇస్తారు. ఫ్రెంచి సైనికశాఖలోని కర్నల్ హెూదాలో ఉన్న ఉద్యోగి బ్రహ్మచారి అయితే నెలకు 200 డాలర్లు ఇస్తారు.)

ఆ రెండు సంవత్సరాలు శిక్షణ పూర్తి అయిన తర్వాత, అంటే 20 వ ఏట అతడు ఏదైన ఉద్యోగంలో ప్రవేశించ వచ్చును. లేకపోతే కాలేజివిద్య పూర్తి చేసుకోవచ్చును. అతడు సంపూర్ణశిక్షణ పొందిన సైనికుడుగా రిజర్వులో ఉంటాడు. అల్లా తయారుచేస్తే మన శాశ్వత సైన్యాలను చాలభాగం తగ్గించుకో వచ్చును.

శాంతికాలంలో సైనికశిక్షణ ఇవ్వడం, సైనిక శాస్త్రం తెలియనివారికి రుచించదు. మనకు రానున్న ఉపద్రవాలను గుర్తించి, మనం పొరపాటుచేస్తే ప్రమాదం తప్పదని గ్రహించి, స్వాతంత్ర్యాన్ని రక్షించుకోడానికి సౌకర్యాలను త్యాగంచేయకపోతే మన ఆశయాలుగాని, మన జాతిగాని మనగలదా అని ప్రశ్నిస్తున్నాను.

రక్షణ ఏర్పాట్లకు జాతీయధనాన్ని అధికంగా వ్యయం చేసేది మనం ఒక్కళ్లమే కాదు. శాంతి సాధనకు సమష్టి కృషి ప్రారంభించడమంటే పశ్చిమ యూరప్ రాజ్యాలు ఎక్కువ మొత్తాలను వ్యయపరచవలసి ఉంటుంది. 1951-52 సంవత్సరంలోనే సైనికరక్షణ ఏర్పాట్లకోసం 1200 కోట్ల డాలర్లను అవి ఖర్చుపెట్ట వలసి ఉంటుంది.

అదృష్టవశాత్తూ, యూరప్ పునరుద్ధరణ అతి చురుకుగా సాగినందున వారి యంత్రాగారాలన్నీ పూర్వపు స్థాయిలోకి వచ్చేశాయి. ఫ్యాక్టరీలు చురుకుగా పని చేస్తున్నందున త్వరలోనే యుద్ధసాధనోత్పత్తులు ఎక్కువగా జరుగుతాయి. మార్షల్ పథకంక్రింద మనం సహాయం చేయకపోతే పశ్చిమ యూరప్‌లోని మన మిత్రరాజ్యాలవారు ఇంత త్వరగా ఆయుధ పునర్ధారణ కార్యక్రమాన్ని జయప్రదంగా అమలు జరుపగలిగేవారు కారు. యూరప్ ఆర్థిక పునర్నిర్మాణానికి, ముఖ్యంగా ఆ విషయంలో వారు ప్రారంభించిన కార్యక్రమాలకు అవసరమైన సహాయాన్ని మనం చేయాలి. లేకపోతే పశ్చిమ యూరప్‌లో ఉక్కు ఫ్యాక్టరీలు, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు పూర్తికాకుండా సగంలోనే నిల్చిపోతాయి. ఆర్థిక స్తోమతకూ, సైనిక బలానికీ గల పరస్పర సంబంధాన్ని గ్రహించలేని వారిని చూస్తే నాకు ఆశ్చర్యం

కలుగుతుంది. టాంకులు, విమానాలు, యుద్ధనౌకలు విష్ణుమూర్తి బొడ్డునుంచి బ్రహ్మదేవుడు జన్మించినట్లుగా పుట్టుకొస్తాయని మేధావుల మనుకునే కొందరి విశ్వాసం. యుద్ధరంగంలో సైనికులు విజయాన్ని సాధించాలంటే, వారి కవసరమైన పరికరాలను, స్వదేశంలో ఉత్పత్తి చేస్తేగాని లాభంలేదని వారు ఎందుకు గ్రహించలేరో నాకు తెలియకుండా ఉంది. ఈ విషయం స్టాలినుకు బాగా తెలుసు. ఉత్పత్తులే యుద్ధవిజయాన్ని సాధిస్తాయని ఆయన తరుచుగా చెపుతూ ఉంటాడు.

మార్షల్ పథకం పశ్చిమ యూరప్ యుద్ధసాధనోత్పత్తులను పెంపొందించడానికి ఉద్దేశించ బడలేదు. సుస్థిరమైన ప్రపంచ ఆర్థిక వ్యవస్థ నిర్మాణానికి ప్రాతిపదికలో భాగంగా యూరప్ ఆర్థిక వ్యవస్థను చక్కబరచడానికి మార్షల్ పథకం రూపొందించబడింది. సోవియెట్ రష్యా మొదట్లోనే దానిని తిరస్కరించినందున పశ్చిమ యూరప్‌కు, సోవియెట్ ప్రాబల్యంలేని ఇతర దేశాలకు అది పరిమితం చేయబడింది. రష్యాయొక్క సామ్రాజ్య విస్తరణ వాంఛ, యుద్ధసన్నాహాలు ఇటీవల స్పష్టంగా బయటపడినందున, స్వీయ రక్షణకోసం పశ్చిమ యూరప్ రాజ్యాలు, ఇతర స్వతంత్రరాజ్యాలు దీర్ఘకాలిక రక్షణ కార్యక్రమాలను తప్పనిసరిగా ప్రారంభించవలసివచ్చింది. పశ్చిమ యూరప్ ఆర్థిక వ్యవస్థను బలీయం చేయడానికి

మార్షల్ పథకం విశేషంగా తోడ్పడినందున, సైనిక పరికరాలను తయారు చేయడానికి అవకాశాలు కలిగాయి. ఫ్రాన్సు ఇటీవల తయారుచేసిన కొత్తరకం మర ఫిరంగులు ఇందుకు తార్కాణం. దానితోపాటు ఉక్కు, సీసం, పెట్రోలు ఉత్పత్తులేమి, బొగ్గుగనులలోను, ఇతర ఫ్యాక్టరీలలోను అధిక సదుపాయాలు కలిగించి నవీన పద్ధతులను ప్రవేశపెట్టడమేమి, కొత్త రైలురోడ్ల నిర్మాణమేమి, రైలుపెట్టెల నిర్మాణమేమి, ఇంకా అనేక ఉత్పత్తులు, పారిశ్రామిక సౌకర్యాలు కలుగడమేమి, అన్నీ అధికం కాజొచ్చాయి.

ఉక్కు విషయం ఆలోచిద్దాం. 1945 సంవత్సరంలో ఫ్రాన్సులో ఉక్కు ఉత్పత్తులు 15,00,000 టన్నులకు తగ్గిపోయాయి. మార్షల్ పథకంక్రింద సహాయం చేయడం వల్ల ఈనాడు 1,00,00,000 టన్నులు, లేదా కనీసం 85,00,000 టన్నులు ఎక్కువగా ఉత్పత్తి అవుతున్నవి. ఫ్రాన్సులో సాగుతున్న ఉక్కు ఉత్పత్తులతో ముఖ్యంగా తుపాకీ గొట్టాలు తయారు చేయబడుతున్నాయి. ఇదే విధంగా ఫ్రాన్సు 1950 వ సంవత్సరంలో 3,50,000 మోటారులను (యుద్ధానికి పూర్వం ఉత్పత్తి అయేవాటి కంటె రెండింతలు) ఉత్పత్తి చేయగలిగింది. హాటీ-శావోయ్‌లో నెలకొల్పబడిన ఒకక్రొత్త ఫ్యాక్టరీలో మార్షల్ పథక సహాయంద్వారా బాల్ బేరింగులను,

ఇతర విడిభాగాలను తయారు చేస్తున్నారు. పెద్దపెద్ద టైరులను తయారుచేయడానికి అవసరమైన యంత్ర పరికరాలను మార్షల్ పథకంక్రింద ఫ్రాన్సుకు సహాయం చేసిన తర్వాత టైరుల ఉత్పత్తి పూర్వంకంటె రెండింత లయింది. రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వంకంటె, ఇప్పుడు ఫ్రాన్సు రెండింతలు పెట్రోలును ఉత్పత్తి చేస్తున్నందున అనేక ప్రయోజనాలను సాధించ గలుగుతున్నది.

సాలుకు 85,000 టన్నుల సీసాన్ని, 120,000 టన్నుల తుత్తునాగాన్ని ఉత్పత్తి చేయడానికి ఆ పథకం సహాయంవల్ల అవకాశం కలిగినందున, తుపాకితోటాలు, తుపాకిలోని విడిభాగాలను ఫ్రాన్సు విశేషంగా తయారు చేస్తూంది. ఫ్రాన్సులోని వస్త్ర పరిశ్రమకూడ విశేషంగా అభివృద్ధి పొందింది.

ఫ్రాన్సుయొక్క సైనికస్తోమత ఇతర పశ్చిమయూరప్ రాజ్యాల మాదిరిగానే ఈనాడు అతి భద్రంగా ఉన్నది. మార్షల్ పథక సహాయంవల్లనే అది అంత శక్తిని సంపాదించ గలిగినదనడంలో సందేహం లేదు.

యుద్ధం చేయడంపట్ల యూరోపియనుల అభిప్రాయమేమిటి ? అది తెలుసుకోడానికి అమెరికనులు ఎక్కువ ఆసక్తితో ఉన్నారు. నేనుకూడ ఎక్కువ ఆసక్తితో ఉన్నాను. ఒక తరంలోనే రెండు ప్రపంచ యుద్ధాలు

రావడం, 1919 నుంచి ప్రజలలో భయాందోళనలు జనించడం, నాజీజం, ఫాసిజంల విజృంభణవల్ల కల్లోలం సంభవించడం, బాంబుల ప్రయోగాలవల్ల విపరీతమైన భయం కలగడం, అన్నింటికంటె ముఖ్యంగా భవిష్యత్తు అగమ్యగోచరంగా ఉండడం వీటినిబట్టి మళ్ళీ యుద్ధం వస్తుందంటే వారు విపరీతమైన భయాన్ని పొందుతున్నారు. ఇవన్నీ వారిని పిరికివారుగా చెయ్యలేవా?

పశ్చిమ యూరప్‌లోని ప్రజలు పెద్ద రాజ్యాలైన అమెరికా రష్యాల మధ్య ఇరుకుకొన్నట్లు అభిప్రాయపడుతున్నారు. తమ దేశాలు యుద్ధరంగాలు కాగలవని వారు భయపడుతున్నారు. ఆ కారణంగా ఫ్రాన్సు, తదితర దేశాలు తటస్థంగా ఉండాలని వారు కోరుతున్నారు.

ఈ క్లిష్టప్రశ్నలకు జవాబుల కోసం నార్వేనుంచి టర్కీవరకు గల అన్ని దేశాలలోను అన్వేషణ చేశాను. ఎవరూకూడ ఇదమిత్థమని తేల్చి చెప్పలేదుగాని ఒక్క విషయం మాత్రం ఖాయమని చెపుతున్నాను. యూరపియను లందరికీ, జర్మనులతోసహా, కొత్త దురాక్రమణను ప్రారంభించాలనే వాంఛగాని, ధైర్యంగాని లేదు. అసలు ఆ మాట తల్చుకుంటేనే వారికి ఏవగింపు కలుగుతున్నది.

1945 వ సంవత్సరంలో యూరప్ సర్వనాశనమైన విషయాన్ని యుద్ధం ముగిసిన 6 సంవత్సరాల తర్వాత వారు అర్థం చేసుకొంటున్నారు.

పోతే, దురాక్రమణను ప్రతిఘటించడం వేరు విషయం. సోవియెట్ లకు చేరువలో ఉన్నవారు తమ దేశాలకోసం ప్రాణా లర్పించడానికి సిద్ధంగా ఉన్నారు. సోవియెట్ రష్యా చేతిలో చిక్కితే అధఃపతనం, బానిసత్వం తప్ప వని ఆ దేశాలవారికి గట్టిగా తెలుసు. గ్రీస్, టర్కీ, పశ్చిమ జర్మనీ, నార్వే దేశాలవారికి ఇట్టి అభిప్రాయా లుండడం నాకు స్వయంగా తెలుసు. ఫిన్లెండు నుంచి కూడ నాకు విశ్వసనీయమైన వార్తలు వచ్చాయి. ఫిన్లెండు ప్రజలు రష్యాకు ప్రక్కలోబల్లెంవంటివారు. "సోవియెట్ రష్యా నీడక్రింద ఉన్నటువంటి ఫిన్లెండు ప్రజలు, కమ్యూనిజంపట్ల వ్యతిరేక భావాన్ని కూడ ప్రకటించరుగదా. వారు తమ కమ్యూనిష్టు మంత్రు లను ఎల్లా బర్తరఫ్ చేశారు" అని ఒక నార్వీజియన్ మంత్రిని ప్రశ్నించాను. ఆయన ఇల్లా సమాధానం చెప్పాడు :– "ఫిన్లెండ్ ప్రజలు దురదగొండి చెట్లు లాంటి వాళ్ళు. అది శరీరానికి తగిలినంత మేర దురద పుట్టుకొస్తుంది. రష్యనులకు వారిని మ్రింగి వేయాలని ఉన్నదిగాని వారు మ్రింగుడుపడకుండా గొంతుకకు అడ్డం పడతారు. ఆ సంగతి రష్యనులకు తెలిసే, వారి జోలికి వెళ్ళకుండా వదిలేశారు."

పైన చెప్పిన విషయంలో ఫిన్లెండు ప్రజలకు ఇతర యూరోపియను లెవరూ సాటిరారు. యూరప్‌లోని

దాదాపు అందరు ప్రజలూ స్వతంత్రంగా ఉండి మర ణించడానికైనా అంగీకరిస్తారుగాని ఇతరుల దాస్యం క్రింద ఉండడానికి ఒప్పుకోరు. యుద్ధ నివారణ కోసం యుద్ధాన్ని ప్రారంభించడమనే పొరపాటు మనం చేయ కూడదు. పశ్చిమ యూరప్ రాజ్యాలన్నీ ఐక్య మత్యంతో ఉంటే దురాక్రమణ యుద్ధాన్ని ప్రారంభించ డానికి రష్యా భయపడుతుంది.

ఆ విషయంలో మనం కృతకృత్యులం కాగలిగా మనే ఆశ ఉన్నది. మన రక్షణ ఏర్పాటులను కట్టు దిట్టం చేసుకొని, యుద్ధ నివారణకు వాటిని ఉపయో గిస్తామని యూరప్ ప్రజలకు నమ్మకం కలిగించడానికి జార్జి మార్షల్‌ను రక్షణమంత్రిగా నియమించడంకంటె మరొక ఉత్తమ మార్గం లేదు. రెండవ ప్రపంచయుద్ధ సమయంలోని ఆయన నాయకత్వాన్ని ఎవరూ మరువ జాలరు. సైనిక వ్యవహారాలలో ఆయన గొప్ప ప్రవీణు డనీ, సమష్టి రక్షణ ఏర్పాట్లు వంటివి అతి చురుకుగాను, సమర్థంగాను చేయగలడనీ అందరికీ ఆయనలో గొప్ప విశ్వాసమున్నది. శాంతి రక్షణకు ప్రధానమైన మార్షల్ పథకం రచయితగా ఆయనయందు అందరికీ విశేష గౌరవమున్నది. దేశంలోపలి కమ్యూనిస్టు ఉపద్రవాన్ని ఎదుర్కోడానికి ఆర్థిక సహాయం సమకూర్చినట్లు బయట నుంచి వచ్చే కమ్యూనిస్టు ప్రమాదాన్ని ఎదుర్కో-

దానికి సైనిక శక్తిని ఆయన సమకూర్చగలడని అందరికీ గట్టి నమ్మకమున్నది.

నేను పూర్వాపరాలన్నీ ఆలోచించి చేసిన నిర్ణయం ఇది:– "మన రక్షణలను బలీయంచేసి, పశ్చిమ యూరప్‌కు ఆర్థిక సహాయాన్ని చేస్తూ, ప్రెసిడెంట్ ట్రూమన్ అనేకసార్లు చెపుతున్నట్లు మన లక్ష్యం శాంతిసాధన అని ప్రకటిస్తూంటే, యూరపియనులు మనప్రక్కనే నిలబడి అవసరమైతే యుద్ధాన్ని సాగించి విజయసాధనకు తోడ్పడగలరు."

# శాంతిసాధనకై ఆర్థికరంగంలో జాగ్రత్తపడాలి

## 6-వ అధ్యాయం

స్వాతంత్ర్యానికీ, నిరంకుశత్వానికీ నేడు జరుగుతున్న సంఘర్షణ నిజం చెప్పాలంటే అమెరికా విధానాలకు, కమ్యూనిస్టుపార్టీ విధానాలకు జరుగుతున్న సంఘర్షణ అన్నమాట. ఆ పోటీలో శాంతిసాధనా కృషికి అమెరికా సాగిస్తున్న ఆర్థిక సహాయ నిర్వహణ కార్యక్రమం అతి సాహసమైన చర్య అని చెప్పాలి. అందునిమిత్తం అమలుజరుపవలసిన చర్యలను అమెరికను ప్రజలు బల పరుస్తూ తమ కాంగ్రెసు మహాసభచేత శాసనాలు చేయించి యూరప్ పునరుద్ధరణకు 12,00,00,00,000 డాలర్లు, కొరియా సహాయార్థం 23,00,00,000 డాలర్లు, మిగతా ఆసియా రాజ్యాలకు 27,50,00,000 డాలర్లు కేటాయింప చేశారు.

ఆర్థిక సహాయ నిర్వహణాధికారిగా నేను 2½ సంవత్సరాలు పనిచేశాను. ఆ కాలం నా జీవితంలో అతి ముఖ్యమైనదని నేను అనుభవపూర్వకంగా చెప్పు తున్నాను. వాషింగ్టన్‌లోని స్టాట్లర్ హోటలులోని W-900 నెంబరు గదిలో 1938 ఏప్రిల్‌లో ఒకరోజున మేము సమావేశమై ఆ పథకాన్ని గురించి సమా లోచనలు జరిపాము. ఆ సమావేశంలో మాలో

రేకెత్తిన ఉత్సాహం, కార్యదీక్షలను పురస్కరించుకొని, సమర్థులైన ఉత్తమ వ్యక్తులకోసం మొదటి రెండు వారాలు దేశమంతా గాలించాము. అతిక్లిష్టమైన సమస్యలు ఒకటి తర్వాత మరొకటి వచ్చిపడుతున్న సమయంలో ఆ పథకం రూపొందినది. 1950 లో నేను ఆఖరుసారి యూరప్‌లో పర్యటించి తిరిగి వచ్చిన తరువాత, మేయాటిక్ భవనంలోని నా కార్యాలయం లోకి వెళ్ళి కాగితాలను తిరగవేశాను.

ఆర్థికసహాయ కార్యక్రమం సాధించిన ఘన విజయాలను, దానివల్ల కలిగిన మహోపకారాలను నేను వ్రాస గ్రుచ్చినట్లు చెప్పగలను.

అది అద్భుతమైన ఫలితాలను సాధించిన మహా పథకం. సమష్టి ప్రయోజనాలకోసం అమెరికా తన శక్తినంతనూ వినియోగిస్తున్న దనడానికి అది ఒక తార్కాణం. అమెరికా ప్రభుత్వం ఆ పథకంక్రింద చేసిన సహాయంవల్ల యూరప్‌కు ఆశ, అవకాశాలు కలుగచేయుడమే గాక, పోతున్న ప్రాణాలను నిలిపింది.

విదేశాల సహాయంద్వారా భవిష్యత్తులో శాంతి సాధనకోసం మనం అవలంబించవలసిన సూత్రాలకు సంబంధించినంతవరకు క్లుప్తంగా ఈ గ్రంథంలో వివరిస్తున్నాను.

ఆర్థిక సహాయ పథకాన్ని గురించి చెప్పడానికిముందు 1948 లో జరిగిన ప్రమాదకర సంఘటనలను ఒక్కసారి పాఠకులకు జ్ఞాపకం చేస్తున్నాను.

పశ్చిమ యూరప్‌కు 1948 వ సంవత్సరం అతిగడ్డుగా పరిణమించింది. రష్యా యూరప్‌లో అనేక కుట్రలను జరిపింది. బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్ అంతటి మహావ్యక్తి పశ్చిమ యూరప్‌కు పతనావస్థ పట్టినదని ప్రకటించాడు. పశ్చిమ యూరప్‌లో కొన్ని మాసాలలో - కొన్ని వారాలలోనే - రష్యా ప్రాబల్యం ఏర్పడగలదని అనుభవజ్ఞులైన పత్రికా విలేఖరులు ఎప్పటి కప్పుడు వెల్లడిస్తూనే ఉన్నారు. ఆ ఆలోచనలు నిరాధారమైనవి కావు. రష్యా తన సరిహద్దులనుంచి పశ్చిమాభిముఖంగా విజృంభించసాగింది. ఒకప్పుడు స్వతంత్ర దేశాలైన చెకోస్లావాకియా, పోలెండు, హంగరీ, బల్గేరియా, రుమేనియా దేశాలను రష్యా కబళించింది. ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీ దేశాలలో రష్యన్ గూఢచారులు విపరీతంగా పనిచేయడం ప్రారంభించారు. ఈ దేశా లన్నిటిలోను కమ్యూనిస్టులు తీవ్రంగా బలపడ జొచ్చారు. లక్షలాది ప్రజలకు తిండి, బట్ట లేకపోవడం, ఉద్యోగాలు లేకపోవడం కమ్యూనిస్టులకు గొప్ప అవకాశం. మూలపడిపోయిన ఫ్యాక్టరీలు తిరిగి పనిచేయడం ప్రారంభించినా ముడిపదార్థాల కొరతవల్ల, బాగుకావ

డానికి యంత్రపరికరాల కొరతవల్ల చురుకుగా పనిచేయ డానికి ఆవరోధాలు ఏర్పడ్డాయి. రైతులు తమకు చాలి నంత ఆహారధాన్యాలకంటే ఒక్కగింజ ఎక్కువ పండించ లేక పోయారు. పండించిన ఆ పదార్థాలనుకూడ అవ సర ప్రాంతాలకు చేర్చడానికి రవాణా సౌకర్యాలు సరిగా లేకపోయినాయి. ద్రవ్యోల్బణం ఫలితంగా అక్కడి వ్యవసాయ దారులకు కరెన్సీ కాగితాలలో నమ్మకం తగ్గిపోయి, తమ ఉత్పత్తులను అమ్మడానికి నిరాకరించారు. అగ్నికి వాయువు తోడైనట్లు తూర్పు యూరప్‌లో రష్యన్ హింసావిధానాలకు తట్టుకోలేక అనేకమంది శరణార్థులు పశ్చిమ యూరప్‌కు వచ్చి పడ్డారు.

1948 వ సంవత్సరంలో పశ్చిమ యూరప్ దేశాల పరిస్థితి ఆ విధంగా ఉన్నది.

ఈనాడు పశ్చిమ యూరప్ పారిశ్రామిక వ్యవస్థ యుద్ధసమయంకంటె నూటికి 40 వంతులు పెంపొందించ బడింది. ముడిఉక్కు ఉత్పత్తి నూటికి 25 వంతులు, మోటార్ల ఉత్పత్తి నూటికి 87 వంతులు, నూలు ఉత్పత్తి మూడింతలు పెంపొందించబడింది. 1950లో వ్యవసాయదారులు విపరీతమైన పంటలను పండించారు. పశుసంపద, పాలు, వెన్న ఉత్పత్తి యుద్ధానికి పూర్వం

ఉన్న స్థాయి నందుకొన్నది. 1950-51 సంవత్సరానికి వ్యవసాయ ఉత్పత్తులు మార్షల్ పథకం అమలులోకి రావడానికి పూర్వం ఉన్న స్థాయిని అందుకోగలవని భావించబడుతున్నది. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి నూటికి 95 వంతులు పెరిగింది. యూరప్‌లో రైళ్ల రాకపోకలు యథాప్రకారంగా సాగుతున్నాయి. కరెన్సీవిధానం కట్టుదిట్టం చేయబడింది. ప్రజలు కడుపునిండా తింటూ, బాగా కష్టపడి పనిచేస్తున్నారు. యూరప్ పునరుద్ధరణ ఘట్టం చరిత్రలో అతి సాహసమైన సంఘటన అని ప్రశంసించబడినది. నేనుకూడ అదేవిధంగా అభిప్రాయపడుతున్నాను.

రెండవ ప్రపంచయుద్ధంవల్ల పూర్తిగా చితికిపోయిన పశ్చిమ యూరప్ అతివేగంగా పునరుద్ధరించబడడంలోని నాలుగు ప్రధాన సూత్రాలను భవిష్యత్తులో జాగ్రత్తల కోసం మనం గుర్తుంచుకోవాలి.

తమకుతాము సహాయం చేసుకోగలవారికే మనం సహాయంచేయగలం.

ఆర్థిక సహకార సహాయక పథకాన్ని రూపొందించే తొలిరోజులలోను, త్వరత్వరగా దాన్ని అమలుజరిపే కడపటి రోజులలోను ఆ పథకంయొక్క ప్రధాన లక్ష్యాల విషయంలో ఎన్నడూకూడ మాకు భేదాభిప్రాయాలు

రాలేదు. హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో జనరల్ మార్షల్ మాట్లాడుతూ ఇలా అన్నాడు:-"యూరప్ ఆర్థిక సముద్ధరణకు మనం ఒక పథకాన్ని గాని, కార్యక్రమాన్ని గాని రూపొందించడం సబబైన విషయం కాదు. యూరప్ దేశాలవారు ఆ పనిని చేసుకోవలసి ఉన్నది. యూరప్‌కు పథకాన్ని రూపొందించడంలో మనం స్నేహభావంతో వారికి తోడ్పడి, తర్వాత దాన్ని అమలు జరపడానికి మనకు వీలైనంత వరకూ సహాయపడడం మనం నిర్వహించవలసిన ధర్మం. మార్షల్ నోటివెంట వెలువడిన "యూరప్ ప్రజలే యూరప్‌ను రక్షించుకోగలరు" అన్న పసిడి పలుకులే ఈ పథకానికి జీవగర్ర వంటివి. ఈ పథకం అమలు జరపడానికి బాధ్యత వహించాలని కాంగ్రెసు శాసనం చేసేటప్పుడు నిబంధనలలో చేర్చింది. కాంగ్రెసు ఆ నిబంధనను బుద్ధిపూర్వకంగా చేర్చిందో లేక మనం ఇచ్చే డాలర్లకు కాపుదారిగా ఉంటుందని చేర్చిందో నేను చెప్పలేను. దుర్బలమైన ప్రభుత్వాలుగల దేశాలకు మార్షల్ పథకం అత్యద్భుతమైన సహాయాన్ని చేసిందని నేను గట్టిగా చెప్పగలను.

అతిక్లుప్తంగా చెప్పాలంటే మార్షల్ పథకం క్రింద ధనసహాయం పొందే అన్ని ప్రభుత్వాలు తమ కరెన్సీలలో దానికి సరిపోయినంత ధనాన్ని సిద్ధంచేయాలి.

దానిలో నూటికి 5 వంతులు అమెరికా ప్రభుత్వం ఆర్థిక సహకార సంస్థ ఖర్చులకు, అమెరికా నిల్వ చేయడానికి, యుద్ధావసర వస్తువులను కొనడానికి వినియోగించ బడు తాయి. మిగతా 95 వంతులు మార్షల్ పథకం క్రింద ఆ దేశాలలోనే ప్రాజెక్టుల పురోభివృద్ధికి వినియో గించబడుతాయి. అమెరికా ఇచ్చే డాలర్లు ఒకేసారి రెండు ప్రయోజనాలను సాధిస్తాయి. విదేశాలు తమకు ప్రాణావసరమైన వస్తువులు కొనుక్కోడానికి విదేశీ కరె న్సీని లభింపచేయడం, ఆ వస్తువులను వారు విడివ్యక్తు లకు విక్రయించగా వచ్చిన మొత్తాలను తమ దేశాల ఆర్థిక పునర్నిర్మాణానికి వెచ్చింపజేయడం రెండూ ఒకే సారి జరుగుతాయి.

అది మనకు చూడడానికి ఆర్థిక వైపరీత్యంగా కన్పించ వచ్చును. కాని అది ఆచరణలో ఎల్లావుంటుందో ప్రత్య క్షంగా చూద్దాము. ఫ్రాన్సు ఈ నాడు ప్రత్తిపరిశ్రమలో బాగా ముందుకువచ్చి యుద్ధానికి పూర్వం ఉన్న స్థాయిని చేకూర్చుకో గలిగింది. ముడిప్రత్తి కొరత యేర్పడి నందున యజమానులు ప్రత్తిఫాక్టరీలను మూసివేయా లనుకొన్నారు. దురదృష్టవశాత్తు ఫ్రాన్సు ప్రత్తిపండే దేశం కాదు. మిల్లు యజమానులవద్ద ఫ్రాంకులు (ఫ్రెంచి దేశపు నాణెములు) సమృద్ధిగా ఉన్నాయి. కాని అమెరికాలోని ప్రత్తిపండించే వ్యవసాయదారులు వాటిని

ఉపయోగించుకో లేరు. అప్పుడు మార్షల్ పథకం వచ్చింది. మిల్లుయజమానులు, ఫ్రెంచి ప్రభుత్వం, అమెరికా ఆర్థికసహాయ సంస్థ అధికారుల ఆమోదంపొంది తమవద్దవున్న ఫ్రాంకులను ఫ్రెంచి ఎక్స్చేంజి కంట్రోలు కార్యాలయానికి తీసుకువెళ్ళి డాలర్లుగా మార్చుకొని వాటితో అవసరమైన ప్రత్తిని కొనుక్కొని మిల్లులను పనిచేయించారు. మిల్లుయజమానుల ఫ్రాంకులు ఏమైనాయి? వాటిని పునరుద్ధరణనిధిలో చేర్చి, అత్యావసరమైన ప్రాజెక్టులకు ఉపయోగించారు.

ఆ సహాయంవల్ల కలిగిన ఫలితం ఏమిటి? అమెరికా ఇచ్చిన డాలర్లవల్ల ఫ్రాన్సులోని మిల్లులు పనిచేయడానికి అవకాశం కలిగింది. అనేకవేలమంది ఫ్రెంచి వర్కర్లకు ఉద్యోగాలు నిలిచాయి. ఫ్రెంచి ప్రభుత్వం పునరుద్ధరణ కార్యక్రమాలను సాగించుకోడానికి అవసరమైన ఫ్రాంకులు సమృద్ధిగా లభించాయి.

ఫ్రాన్సులోని మిల్లులు మూసివేసినట్లయితే వేలాది కార్మికులకు ఉద్యోగాలు పోయేవి. కమ్యూనిస్టులు ఆ అవకాశాన్ని సాకుగా తీసుకొని గంద్రగోళం చేసేవారు. ఇప్పుడు అదొకటి తప్పిపోయింది. ఫ్రెంచి మిల్లుయజమానులు అవసరమైన ప్రత్తిని డబ్బుపెట్టి కొనుక్కోవలసి వచ్చినందున తమ కవసరమైనంతవరకే కొనుక్కొన్నారు.

మొదటి ప్రపంచయుద్ధం ముగిసినప్పటినుంచి యూరప్‌కు విపరీతంగా సహాయం చేస్తున్నామని అమెరికను లందరికీ తెలుసు.

యూరప్‌కు 1947 వ సంవత్సరంలో అదనపు సహాయం పంపడం అమెరికా కాంగ్రెసుకు పెద్దసమస్య అయింది. అంతకు పూర్వాకంటె కట్టుదిట్టమైన పద్ధతిలో ఆ సహాయాన్ని పంపాలని కాంగ్రెసు యోచిస్తున్నది. మార్షల్ పథకాన్ని శాసనబద్ధం చేసేటప్పుడు కాంగ్రెసు ఆ విషయాన్నే ప్రధానంగా అందులో చేర్చింది. కాంగ్రెసు చేసిన కృషి విజయవంతమైనది. అది సహేతుకమైనదని నేను భావిస్తున్నాను. అమెరికా కాంగ్రెస్ నియమించిన ప్రత్యేక కమిటీలవారు యూరప్ సమస్యలన్నింటినీ క్షుణ్ణంగా పరిశీలించారు. ఆర్థిక సహకార సంస్థను ఏర్పరిచే సందర్భంలో జరిగిన చర్చలు, పరిశీలనలు 6,584 పేజీల రికార్డు అయింది. శాసనం చేసేటప్పుడు ఈ క్రింది షరతులు అందులో చేర్చబడినాయి: యూరప్‌లోని రాజ్యాలు,

(1) వాటి అవసరాలను గురించి సవివరమయిన నివేదికను అందచేయాలి.

(2) ఆ దేశాలు అనుసరించే ఆర్థిక విధానాలను గురించి అమెరికా ఆర్థిక సహకార సంస్థతో చర్చించాలి.

(3) అమెరికా ఇచ్చిన సహాయం అంగీకరించిన పద్ధతులలో ఉపయోగించినదీ, లేనిదీ తనిఖీ చేయడానికి అమెరికాకు అవకాశం ఉండాలి.

ఆ శాసనంలో చేర్చబడిన ఈ కొత్త అంశం డాలర్ల సక్రమ వినియోగానికి సహాయపడగలదని అంటున్నాను. ఆ అంశం నిరంకుశ ప్రవర్తనకు, నిర్దాక్షిణ్యానికి చిహ్నమని కొందరు ఫిర్యాదు చేయవచ్చును. మామూలుగా బ్యాంకర్లు అప్పులిచ్చేటప్పుడు అవలంబించే విధానమే అంతర్జాతీయ రంగంలో ఉపయోగించబడుతూంది తప్ప వేరుకాదు. ఒకవ్యక్తి తనమిత్రుడు వ్యాపారం చేసుకోడానికి ధనసహాయం చేసేటప్పుడు ఆయన తలపెట్టిన వ్యాపారం సక్రమమైనదేనా అని పరిశీలించడానికీ, ప్రారంభమైన తర్వాత వ్యాపారం ఎల్లా సాగుతున్నదీ పరిశీలించడానికీ అవకాశం ఉండదా? ఇది కూడా అటువంటిదేనని చెపుతున్నాను.

ఇటలీ పునరుద్ధరణ విషయంలో జరిగిన సంఘటనలను మనం పరిశీలిస్తే ఈపద్ధతివల్ల ప్రయోజనమేమిటో మనకు సులువుగా అర్థం కాగలదు. యుద్ధం ముగిసిన తర్వాత ఇటలీకి మోయలేని భారం మీదపడింది. మార్షల్ పథకం రాకముందే అమెరికా తాత్కాలికంగా ఆర్థిక సహాయాన్ని చేసింది. 1948 వ సంవత్సరం

మొదట్లో ఆ కార్యక్రమం ఇటలీలోని అమెరికా రాయబారి జేమ్సు డన్ ఆధ్వర్యంక్రింద నిర్వహించబడింది. 1948 ఏప్రెల్‌లో జరిగిన ఎన్నికలలో ఇటలీ కమ్యూనిష్టు ప్రాబల్యం క్రిందకు పోకుండా ఆ సహాయం కాపాడింది. అమెరికా ఆర్థిక సహాయ నిర్వహణ ప్రధానాధికారి జేమ్సు జెల్లర్ బాక్ వేసవిలో ఇటలీ వచ్చినప్పుడు, ఇటలీకి ఆర్థిక సహాయం పొడిగించడానికి ఎక్కువ పరిశీలన జరుపవలసిన అవసరం లేకపోయింది. ఇటలీ తన నియంత ముస్సోలినీ పిచ్చి కోర్కెలకు బలియై 20 సంవత్సరాలపాటు దుర్గతి పాలైంది. అక్షరాజ్యాల తరఫున ఇటలీ యుద్ధంలోకి దిగడం, చివరకు జర్మనీ ఇటలీని జయించడం, ఆతరువాత మిత్రరాజ్యాలు ఇటలీని వశపరుకొనడం జరిగింది. ఇటలీలోని నగరాలు, పట్టణాలు బాంబులచేత ధ్వంసం చేయబడినాయి. ఇటలీ ప్రజలలో నైరాశ్యం ప్రబలిపోయింది. వారికి తిండి, బట్ట తక్షణావసరాలైనాయి. అప్పుడు అమెరికా గోధుమలు, బొగ్గు పంపింది. ముడిపదార్థాలు లేక ఇటలీలోని ఫ్యాక్టరీలు మూలబడ్డాయి. అమెరికా ప్రత్తి, ఉక్కు, రాగి పంపింది.

ఇటలీ పునరుద్ధరణకు ఒక దీర్ఘకాలిక ప్రణాళికను రూపొందించి ఇటలీప్రభుత్వం అమెరికా ఆర్థిక సహకార సంస్థతో అంగీకారం కుదుర్చుకొన్న మీదట ఆ సహాయం

అమలు జరుపబడింది. మూల పడిపోయిన ఫ్యాక్టరీలకు కావలసిన యంత్రసామగ్రి, విద్యుచ్ఛక్తి, నవీన పద్ధతు లలో భూమి సాగుదల ప్రారంభించ బడింది.

ఇటలీకి యంత్రసహాయం అత్యవసర మయింది. ఫ్యాక్ట రీలు పనిచేయడానికి తగిన పరికరాలు లేనిదే ప్రజలకు కావలసిన ఆహార పదార్థాలు, వస్త్రాలు లభ్యంకావు.

అమెరికా ఆర్థిక సహకారిసంస్థ ట్యూరిన్‌లోని పియట్ ఫ్యాక్టరీకి 2,30,00,000, డాలర్లు అప్పు ఇవ్వడం వల్ల యుద్ధంలో దెబ్బతిన్న ఆ ఫ్యాక్టరీ పూర్వపు స్థితికి వచ్చింది. అమెరికా యంత్రసామగ్రిని తెప్పించుకొని ఆ ఫ్యాక్టరీ ఇప్పుడు అత్యద్భుతంగా పనిచేస్తున్నది. ఆ ఫ్యాక్టరీ ఇప్పుడు సంవత్సరానికి ఒక లక్ష కారులను, ఇంకా అనేక బస్సులను, లారీలను తయారు చేస్తున్నది.

అదే సమయంలో ఆర్థిక సహకార సంస్థ నిధినుంచి ఇటలీలో విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులను నిర్మించారు. దాని ఆర్థిక లోపమే పెద్ద అడ్డంకి. ఇటలీకి తగినంత బొగ్గు లేదు. బొగ్గును ఇతర దేశాలనుంచి దిగుమతి చేసుకొంటే చాల నష్టపడవలసి వస్తుంది. ఉత్తర ఇటలీలోని ప్రాజెక్టు లను నిర్మించి వాటిద్వారా తగినంత విద్యుచ్ఛక్తిని లభింప చేసుకొన్నది. ఉత్పత్తుల కవసరమయిన విద్యు చ్ఛక్తి కేంద్రాలను నెలకొల్పారు.

ఫ్లారెన్సుకు 40 మైళ్ళ దక్షిణాన ఉన్న టస్కనీలో కూడా 25 విద్యుచ్ఛక్తి కేంద్రాలను నెలకొల్పారు. యుద్ధానికి పూర్వమే అక్కడ విద్యుచ్ఛక్తి 'కేంద్రాలను నెలకొల్పాలని ఇటాలియన్ ఇంజనీర్లు ప్రయత్నాలు చేశారు. కాని తిరోగమిస్తున్న జర్మనులు వాటన్నిటినీ ధ్వంసంచేశారు. యుద్ధం ముగిసినతర్వాతకూడ వాటి నిర్మాణానికి ఇటాలియను ఇంజనీర్లు తిరిగి కృషిని ప్రారంభించారు. కాని అవసరమైన యంత్రసామగ్రి వారికి లభించలేదు. ఇంతలోకే అమెరికా ఆర్థికసహాయ పథకం వచ్చింది. ఆర్థిక సహాయ నిర్వహణాధికారులు ఇటాలియనులకు అవసరమైన పరికరాలను లభింపచేయడమే గాక, కొత్త ప్రాజెక్టులను నిర్మించి, విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి తోడ్పడడానికి సహాయపడ్డారు. ఇటలీయొక్క మొత్తం విద్యుచ్ఛక్తిలో 12 వ వంతు ఇప్పుడు అక్కడే లభ్యమవుతుంది.

ఇటలీలో వ్యవసాయ సమస్య మరింత క్లిష్టంగా ఉన్నది. పంటలను అదనంగా పండించడానికి ఆర్థిక సహకార నిర్వహణ శాఖవారు సహాయపడ్డారు. నవీనయంత్ర పరికరాలతో వ్యవసాయాన్ని సాగించడం, మంచి ఎరువులను రైతులకు లభింపచేయడం, మిడుతలు, తదితర కీటకాలు పంటలను పాడుచేయకుండా తగిన రక్షణ మొదలైనవన్నీ రైతులకు లభించాయి.

ఇటలీలో పంటలను అధికంగా పండించగలిగినంత మాత్రాన ఆ సమస్య పరిష్కారంకాదు. ఇటలీలో స్వయంగా వ్యవసాయం చేయనటువంటి భూస్వాములు అనేకమంది ఉన్నారు. వారి పెద్దపెద్ద ఎస్టేట్లన్నింటినీ చిన్నచిన్న ముక్కలుగా విడగొట్టి చిన్నచిన్న రైతులకు పంచాలనేది ఒక సమస్యగా ఉన్నది. రైతులకు సంఘంలో తగిన స్థానాన్ని లభింప చేస్తేనే అక్కడ వ్యవసాయ విధానం సక్రమంగా సాగగలదు. రైతులకు పంచిన భూమి అంతకుపూర్వం సాగుకాకుండా ఉండ వచ్చును. ఆ భూమిని సక్రమంగా సేద్యంచేసి మంచి పంట పండించడానికి ఆ రైతుకు తోడ్పడాలి. దీనికి నీటిపారుదల స్కీములు, మురుగు పోవడానికి వసతులు, రవాణాకు రోడ్ల నిర్మాణం, వ్యవసాయ పనిముట్ల సప్లయి మొదలైనవి జరగాలి. భూమి సంస్కరణలను అమలుజరిపి భూమిని అభివృద్ధి చేయడానికి అమెరికా సహకారసంస్థ తోడ్పడుతున్నది.

ఇటలీలో దాదాపు రెండువందల ప్రాజెక్టులు నిర్వహించ బడుతున్నాయి. వ్యవసాయాభివృద్ధికి కూడ విశేషమైన కృషి సాగుతున్నది. సార్డీనియానుంచి 'పో' నది యొక్క మైదానంలోను, కాలబ్రియా పర్వతాల వరకూ వ్యవసాయాభివృద్ధి ప్రాజెక్టులు నిర్వహించ బడు తున్నాయి. ఇటలీ ప్రభుత్వం మొట్టమొదటగా భూమి

సంస్కరణలు ప్రవేశపెట్టిన కాలబ్రియా ప్రాంతంలోని సిల్లావద్ద అమెరికా ఆర్థిక సహాయ శాఖక్రింద ఇరిగేషను ప్రాజెక్టులు చురుకుగా సాగిపోతున్నాయి. 1950 వ సంవత్సరం ఆకురాలు కాలంలో ఇక్కడే ఇటలీయొక్క ప్రథమ "భూమిసేన" అవతరించింది. అదృష్టవంతులైన 396 మంది రైతులకు ఒక్కొక్కరికి 9 ఎకరాలచొప్పున భూమిని ఇచ్చారు. రైతులందరి పేర్లు చీటీమీద వ్రాసి ఒక పెట్టెలో వేసి, వరుసగా బయటకుతీస్తూ వారిలోని మొదటి 396 మందికి ఆ విధంగా భూమిని పంచి ఇచ్చారు. ఇటలీ రైతులలో 9 ఎకరాల భూమిగలవారు అంతకు పూర్వం చాల తక్కువమంది ఉన్నారు. వాళ్ల నాయకుడు ఇలా అన్నాడు:-"మా జీవితంలో ఇంతటి అదృష్టపు రోజు వస్తుందని నేము కలలోనైనా అనుకోలేదు." అ విధంగా వారికి భూమిని పంచడం ఆ పథకాన్ని విస్తృతంగా అమలు జరపడానికి నాందీ ప్రస్తావన అని చెప్పాలి. ఇటలీ జనాభా సంవత్సరానికి నాలుగు లక్షల చొప్పున పెరుగుతున్నది.

విదేశ ఆర్థిక సహాయ కార్యక్రమాలను శక్తికి మించిపోని స్థితిలో ఉంచడానికీ, వాటివల్ల సత్ఫలితాలు కలిగించడానికీ, మొగమాటంలేని అధికారులు నిర్వాహణ శాఖలో ఉండాలి. కట్టుదిట్టాలు లేకుండా దుబారాగా వాటిని అమలు జరిపితే వ్యర్థ మవుతాయి. దేశాలను

శక్తివంతం చేయడానికి తలపెట్టిన ఆ కార్యక్రమాలు దుబారాగా అమలు జరిపితే ఆ దేశాలకు అవి మేలుకు బదులు హానిని చేకూరుస్తాయి. మార్షల్ పథకం విజయవంతం కావడానికి ఒక్కటే రహస్యం ఉన్నది. మేము కోట్లకొలది డాలర్లను వెచ్చించినా, ప్రతి పైసా సక్రమంగా వినియోగించబడుతూందా లేదా అని పరీక్ష చేస్తూనే ఉన్నాము. ఆ దేశాలకు ఆర్థిక సహాయ కార్యక్రమంక్రింద 1700 కోట్ల డాలర్లని అంచనా వేయబడింది. ఆర్థిక పునరుద్ధరణకు వివిధదేశాలకు కేటాయించబడిన మొత్తం 1300 కోట్ల డాలర్లకు మించదు. బ్రిటను విషయంలో అనుకున్న దానికంటె 18 నెలలు ముందుగానే సహాయం నిలిపివేయడానికి అవకాశం కలిగింది.

అమెరికా పారిశ్రామిక ఉత్పత్తులు అతి ఉన్నత స్థాయిలో సాగడానికి ప్రధాన కారణం మనకు శక్తివంతమైన యంత్రసామగ్రి ఉండడమే. దానికితోడు మనకు వివిధరంగాలలో శిక్షణ పొందిన నిపుణు లున్నారు. సాంకేతిక విషయాలలోను, తదితర రంగాలలోను ఆరితేరినవారు మనకు ఉన్నారు. వారిని విదేశాలకు పంపడం, అక్కడివారిని మనం ఉపయోగించడం సాంకేతిక సహాయశాఖయొక్క ప్రధాన లక్ష్యం.

యూరప్ శాశ్వత ఔన్నత్యాన్ని పొందడానికి ఉత్పత్తి కార్యక్రమాలను పెంపొందించాలని నేను 1928 నుంచి

చెపుతున్నాను. స్టుడిబేకర్ కార్పొరేషన్ సంస్థ అధ్యక్షుడు ఆల్బర్ట్ రస్సెల్ ఎర్స్కైన్ తమ లండను కార్యాలయానికి వచ్చి తమ వ్యాపారాన్ని గురించి ఒక నివేదిక తయారు చేయమని నన్ను కోరారు. అప్పటికి వారి వ్యాపారం నష్టంమీద సాగుతూంది. నేను లండను వెళ్లి పరిశీలన ప్రారంభించాను. అక్కడి కార్మికుల జీతాలు అమెరికను కార్మికుల జీతాలలో సగంకూడ లేకపోయినా, వస్తువులు బాగుచేయించుకోడానికి మాత్రం అమెరికాలో కంటె రెట్టింపు చెల్లించుకోవలసి వస్తూంది.

అమెరికాలో ఒక యంత్రంయొక్క "వాల్వు"ను బాగుచేయడానికి పదిడాలర్లు అవుతుంది. అందులో మెకానిక్కుకు (పనివాడికి) 4 డాలర్లు ఇస్తారు. ఖర్చులన్నీ పోను వర్కుషాపు యజమానికి ఒక డాలరు మిగులుతుంది. ఆ పనినే ఇంగ్లండులో ముగ్గురు పనివాళ్లు చేస్తారు. ముగ్గురికీ 8 డాలర్లు ఇస్తారు. కంపెనీవారు ఆ "వాల్వు"ను బాగుచేసినందుకు 18 డాలర్లు పుచ్చుకున్నప్పటికీ కంపెనీకి రెండు డాలర్లు నష్టం వస్తూంది.

లండను డిపోలో విద్యుత్పరికరాలను ప్రవేశపెట్టి, వ్యాపార పద్ధతులు సంస్కరించి, చెడిపోయిన వాటిని బాగుచేసినందుకు తీసుకునే కిరాయిలను తగ్గించి, కార్మికుల వేతనాలను పెంచాలని నేను మొదట సూచిం

చాను. కాని లండనులోని స్టుడిబేకర్ కంపెనీ సూప రెంట్లు, తదితరులు దానివలన ప్రయోజనం లేదన్నారు. పైగా సంప్రదాయ సిద్ధంగా వస్తున్న పద్ధతులను ఏ మాత్రం మార్చినా అత్యంత విషాద పరిణామాలు రాగలవని వారు నాతో అన్నారు. దానిమీాదట లండను డిపోను అమ్మమని ఎరిక్సన్ అధ్యక్షునికి నేను సూచించాను. ఆయన అదేవిధంగా ఆ డిపోను అమ్మి వేశారు.

అయితే, ఆతరువాత లండనులో నేను చూచిన విష యాలను నే నెన్నటికీ విస్మరించలేను. కార్మిక నిర్వ హణ పద్ధతులలోను, యజమానులు తమ బాధ్యతలను నిర్వర్తించే పద్ధతులలోను అమెరికనులు అవలంబించే విధానాలు ఐరోపాలోని కర్మాగారాల యజమానులకు, కార్మికులకు, కొనుగోలు దారులకు చాలా లాభకారి కాగలవన్న విశ్వాసం ఆ సంఘటనల వలన నాకు కలి గింది. ఆ విశ్వాసం నాలో నానాటికీ ఎక్కువ కాజొ చ్చింది. అయితే ఆ విషయంలో అప్పుడు నేనేమీా చెయ్యలేక పోయినాను.

1947 వేసవిలో ఒకనాడు పారిస్ నగరంలో నేను అప్పటి బ్రిటిష్ కోశాంగ శాఖామంత్రి సర్ స్టాఫర్డు క్రిప్సుతో మాట్లాడడం సంభవించింది. మా సంభాషణ

ఆర్థికాభ్యుదయానికి అవరోధాలుగా ఉన్న వాటిమీద జరగడంతో నా అభిప్రాయం బయటపెట్టడానికి నాకు మంచి అవకాశం లభించింది. బ్రిటనులో ప్రజల జీవన ప్రమాణం పెరగాలంటే ఉత్పత్తిని ఎక్కువ చెయ్యాలని ఆయన అన్నప్పుడు నాకు చాల సంతోషం కలిగింది. ఒక ఐరోపావాసి నోటివెంట అటువంటి మాటలను ఎప్పుడు వింటానా అని నేను ఎదురుచూస్తూండేవాణ్ణి. ఉత్పత్తులను ఎక్కువచేసే విషయంలో బ్రిటను అమెరికావద్ద చాల విషయాలు నేర్చుకోవలసి ఉన్నదని ఆయన అంతలో అన్నారు. కొంచెం సేపాగి "బ్రిటిష్ వారికి ఉత్పత్తుల విషయంలో కొన్ని రహస్యాలు తెలుసు. అవి ఇంతవరకు ఇతరులకు తెలియవు. కనుక మనం ఇద్దరం ఒకరికి తెలిసిన విషయాలను మరొకరికి చెప్పుకుంటే బాగుండదా" అన్నా రాయన.

సహజంగా ఆయన సూచన నాకు చాలా సంతోషం కలిగించింది. కనుక మన ఉభయదేశాలు ఈ దృష్టితో అప్పుడప్పుడు రాకపోకలు జరుపుకుంటే బాగుంటుందని నేను అన్నాను. "బ్రిటిష్ యజమానులను, కార్మికులను అమెరికాకు తీసుకువెళ్లి అక్కడి కర్మాగారాలను వారికి చూపిద్దాం. అట్లాగే అమెరికన్ యజమానులను, కార్మికులను కూడా బ్రిటనుకు తీసుకువెళ్లి అక్కడి కర్మాగారాల నిర్వహణ పద్ధతులను వారికి తెలియచేద్దా"

మని కూడా నేనప్పుడు సర్ స్టాఫర్డు క్రిప్స్‌తో చెప్పాను. అందుకాయన సమ్మతించి వెంటనే తగు చర్యలు తీసుకున్నారు. ఆయన తన శక్తినంతా వినియోగించి కొన్ని వారాలు గడవకముందే ఉత్పత్తిని ఎక్కువచేసే నిమిత్తం ఆంగ్లో-అమెరికన్ కౌన్సిలును ఏర్పాటు చేశారు. జనరల్ ఎలక్ట్రిసిటీ సంస్థకు చెందిన ఫిలిప్‌లీడ్, కార్మిక సంఘాల కాంగ్రెసు అధ్యక్షుడైన విక్టర్ రూథర్ మొదలైన ప్రముఖులను అమెరికా యజమానులు కార్మికుల తరఫున ఆ కౌన్సిలులో ప్రాతినిధ్యం వహించమని కోరాము. ఇదివరకు ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్‌కు ఉపాధ్యక్షుడు, ఇప్పుడు పరలోక గతుడైన సర్ ఫ్రెడ్రిక్ బెయిన్, ఐరన్ అండ్ స్టీల్ కాన్ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శి లింకన్ ఎవాన్స్‌లు బ్రిటను తరఫున ఆ సంఘంలో ప్రతినిధులుగా కలిసి కూర్చొని మంతనాలు జరిపి, ఒకరి అభిప్రాయాలు మరొకరు తెలుసుకుని లాభకరమైన పరిశ్రమలను, అవి తయారు చేయవలసిన వస్తువుల పరిమితిని, వాటిని నడపవలసిన పద్ధతులను నిర్ణయించారు.

బ్రిటనులో ఉక్కు పరిశ్రమకు సంబంధించిన యజమానుల ప్రతినిధులు, కార్మిక ప్రతినిధులు పై ప్రణాళికలో మొదటిజట్టుగా అమెరికాకు వచ్చారు. ఆరువారాలపాటు వారు అమెరికాలోని వివిధ కర్మాగారాలను

చూచారు. పగలల్లా కర్మాగారాలను చూచి వారికి అవసరమైన విషయాలను వ్రాసుకునేవారు. రాత్రిపూట ఆ విషయాలను గురించి తమలో తాము చర్చించుకునే వారు. కేవలం విలాసార్థం వారు అమెరికాకు రాలేదు. ఒక ధృఢ సంకల్పంతో అమెరికా పరిశ్రమలను సందర్శించారు. తరువాత ఇంగ్లండుకు వెళ్లి తాము అమెరికాలో చూచిన విషయాలను గురించి ఒక నివేదిక పుస్తక రూపాన ప్రకటించారు. పక్షం రోజులలో ఆ గ్రంథం 25 వేల ప్రతులు అమ్ముడు పోయింది. ఆ తరువాత దానిని మూడుసార్లు ప్రచురించవలసి వచ్చిందంటే అందులోని విషయాలు ఎంతముఖ్యమైనవో వేరే చెప్ప నవసరంలేదు. ఆ పుస్తకంలోని ముఖ్యమైన విషయం ఇది :

"బ్రిటనులో కార్మికులు ఒక గంటలో చేసేపనికంటే అమెరికాలో కార్మికుడు నూటికి 50 మొదలుకుని 90 రెట్లవరకు ఎక్కువచేస్తున్నాడు. బ్రిటిష్ ప్రజల జీవన ప్రమాణం పెరగవలసి ఉన్నది. కనుక బ్రిటను లోని కర్మాగారాలన్నింటిలో ఉత్పత్తులను ఎక్కువ చెయ్యాలి. లేకపోతే పెరగవలసినంతగా జీవనప్రమాణం పెరగదు."

ఆ విధంగా బ్రిటనులో ప్రారంభమైన యంత్ర సహాయ కార్యక్రమాన్ని ఇతర దేశాలుకూడా సమధి కోత్సాహంతో స్వీకరించగలవని నే నాశించాను.

అయితే, అటువంటిదేమీ ఆ విధంగా జరగలేదు. కర్మాగారాలను ఆధునిక పద్ధతులలో నడిపే పద్ధతులను వివరిస్తూ యంత్ర సహాయ సంఘం ప్రకటించిన విషయాలు ఇతర దేశాలవారికి చక్కగా అవగాహన కాకపోయి ఉండవచ్చు. ఆ సంఘానికి అనేక సదుపాయా లున్నవి. ఆ దృష్టితో చూస్తే ఆ సంఘం చేయవలసినంతపని చేయలేక పోయిందనే చెప్పాలి. ఈ విషయం ఇలా ఉండగా ఆర్థిక సహకార నిర్వహణసంఘం ఆధ్వర్యాన సుమారు 8 వేల మంది యూరోపియన్ సాంకేతిక నిపుణులకు అమెరికాలో శిక్షణ నిచ్చారు. వారందరు కర్మాగారాలకు సంబంధించినవారే కాదు. అయోవా వ్యసాయక్షేత్రాలను డచ్ వ్యవసాయదారులు సందర్శించి అక్కడి వ్యవసాయ పద్ధతులను తెలుసుకున్నారు. నార్వే ప్రతినిధులు అమెరికా బొగ్గు గనులను పరిశీలించారు. ఇటలీ ప్రతినిధులు అమెరికాలోని పంటలను గురించి తెలుసుకున్నారు. టర్కీ ప్రతినిధులు అమెరికా వైమానిక పద్ధతులను, రోడ్లు, గృహ నిర్మాణాలకు సంబంధించిన విషయాలు తెలుసుకున్నారు. వారందరు రెండు మూడు జట్లుగా అమెరికాకువచ్చి పై విషయాలు పరిశీలించారు.

పై ఐరోపా దేశాల ప్రతినిధులు తమ దేశాలకు తిరిగి వెళ్ళి అక్కడకూడా ప్రభుత్వ యాజమాన్యంలో జరిగే

పరిశ్రమలను, వ్యక్తులు నిర్వహించే పరిశ్రమలను తాము అమెరికాలో నేర్చుకున్న పద్ధతులపై సంస్కరించడానికి ప్రయత్నిస్తారు. అంటే పాత పద్ధతులకు స్వస్తిచెప్పడం అన్నమాట. అది ఏ దేశంలోను అంత సులభంగా నెరవేరే విషయంకాదు. అయినా, ఐరోపా దేశాలలో నేడొక వినూత్నమైన ఉత్సాహం పెల్లుబికి వస్తున్నది. అభ్యుదయం పట్ల వారిలో ప్రబలమైన ఆకాంక్ష కని పిస్తున్నది.

ఆ విధంగా యూరోపియన్ దేశాల ప్రతినిధులు అమెరికాకు రావడంవలన వారు గ్రహించిన ముఖ్య విషయాలేమిటి? కేవలం వ్యవసాయానికీ, పరిశ్రమలకూ సంబంధించిన కొత్త విషయాలు నేర్చుకోనడమేనా? కాదు. అమెరికాలో ఉత్పత్తి పెరిగినందున అక్కడ వ్యాపారం మూడుపూలు ఆరు కాయలుగా సాగుతున్న దనీ, అవే పద్ధతులను (యూరోపియన్ దేశాల ప్రతి నిధులు) వారుకూడా తమ దేశాలలో అమలు పరిస్తే తమ దేశాలుకూడా సిరిసంపదలతో తులతూగగలవనీ వారు గ్రహించారు. అంతేకాదు, అమెరికాలోని పద్ధతులు మానవునికీ, మానవ శ్రేయస్సుకూ అత్యంత ప్రాధాన్యం ఇస్తున్నవన్న ముఖ్యవిషయాన్ని వారు తెలుసుకోగలిగారు. ఆయా దేశాల ప్రతినిధులు వారి దేశాలకు తిరిగి వెళ్ళినతరువాత అమెరికాలో తాము

చూచిన విషయాలపై వారు చేసిన ప్రకటనలే అందుకు ప్రబల నిదర్శనం. బ్రిటనులోని సన్నటినూలును తయారు చేసే పరిశ్రమల ప్రతినిధులు అమెరికాలోని పరిశ్రమల యజమానులకు, కార్మికులకు పరస్పర సుహృద్భావ సంబంధా లున్నవని ప్రకటించారు. తాము చూచిన కర్మాగారాలలో చాలా వాటిలో యజమానులు, కార్మికులు పరస్పర గౌరవ మర్యాదలతో, స్నేహ భావాలతో వ్యవహరిస్తున్నారని బ్రిటిష్ కాటన్ స్పిన్నింగు పరిశ్రమ ప్రతినిధులు పేర్కొన్నారు. "అమెరికా యజమానులు గొప్ప మనస్తత్వ శాస్త్ర వేత్తలుగా కనిపిస్తున్నారు. వారు మానవతత్వానికి సంబంధించిన సమస్యలను చక్కగా గ్రహించారు. తమ భవితవ్యం కార్మికుల మంచి చెడ్డలమీద, వారి శ్రేయస్సుమీద ఆధారపడి ఉన్నదని గ్రహించారు," అని ఫ్రాన్సు కార్మికోద్యమానికి చెందిన ఒక ప్రతినిధి ఉద్ఘాటించాడు. "ఒకరి సమస్యల నొకరు చక్కగా అర్థం చేసుకొనడానికి, పారిశ్రామికుల శక్తి సామర్థ్యాలు పెంపొందించుకొని ఉత్పత్తిని ఎక్కువ చేయడానికి అటు అమెరికా పరిశ్రమల యజమానులు, ఇటు కార్మికులు కూడా చక్కగా కృషి చేస్తున్నారు" అని బెల్జియన్ బొగ్గుగనులకు సంబంధించిన ప్రతినిధి అన్నాడు. ఇవన్నీ వారంతట వారికి కలిగిన అభిప్రాయాలు.

ఇక మనంకూడా ఆ సాంకేతిక సహాయ ప్రణాళికల వలన రెండు ప్రయోజనా లున్నవని గ్రహించాము. కొన్ని పరిశ్రమలలో మేలిరకం వస్తువులను తయారుచేయడంలో బ్రిటిష్‌వారివద్దనుంచి అమెరికన్లు కొన్ని విషయాలు తెలుసుకోవలసి ఉన్నదని సర్ స్టాఫర్డ్ క్రిప్స్ నాతో అన్న మాట నిజం. వీటన్నింటికంటె మరొక ముఖ్యమైన ప్రయోజనం కలిగింది. ఆ రాకపోకలవలన ఇంగ్లండు, అమెరికాల మధ్య సుహృద్భావం పెంపొందింది తమను బ్రిటిషువారు ఇదివరకు మాదిరిగా "నేను చెపుతా వినరా బాబూ" అనే దృష్టితో చూడడంలేదని అమెరికన్లు గ్రహించారు. అమెరికన్లు సుఖలాలసతకు అలవాటు పడ్డవారనే దురభిప్రాయాన్ని బ్రిటిషువారు విడనాడారు. ఆ విధంగా ఒకరినొకరు చక్కగా అర్థం చేసుకొని పరస్పర సుహృద్భావ సంబంధాలతో వ్యవహరించడమే శాంతి స్థాపనకు రాజబాట కాగలదు.

ఆ విధంగా ఐరోపా రాజ్యాలకు సాంకేతిక సహాయం చేయడంద్వారా ఆ దేశాలలో ఉత్పత్తిని ఎక్కువ చేయడానికి ప్రయత్నించే రోజులలోనే, చైనాలో మరొక రకమైన సాంకేతిక సహాయాన్ని అమలు పరచాము. చైనాకు సహాయం చేయడానికి వీలుగా 1948 వ సంవత్సరంలో చట్టం చేశారు. దానిని అనుసరించి అయిదుగురు సభ్యులతో గ్రామాభ్యుదయాని కొక

సంయుక్తసంఘం నియుక్తమైంది. చైనాలోని (దక్షిణ ఆసియాలోకూడా) గ్రామాలలోని దుస్థితులను సమూలంగా పరిశీలించి వాటికారణాలను నివారించడానికి ఆ సంఘం అద్భుతమైన కార్యక్రమం అమలు పరిచింది. తత్ఫలితంగానే చైనా, దక్షిణాసియాలలోని పరిస్థితులు కమ్యూనిష్టు ప్రచారానికి ఎదురు తిరిగినవి.

1946వ సంవత్సరంలో అమెరికా చైనా ప్రతినిధులతో ఏర్పడిన సంయుక్త పరిశీలకసంఘం చైనాలో గ్రామ సంస్కారణలు అమలు జరుపవలసిన ప్రాంతాలను స్పష్టంగా సూచించింది. భూమిలో పంటపండించే రైతు తన పంటలో నూటికి యాభై వంతులు మొదలుకొని 80 వంతుల వరకు భూకామందుకు కౌలుగా చెల్లించవలసి ఉండేది. పోనీ ఆ కౌలు కంట్రాక్టులనయినా సక్రమంగా పాటించేవారా అంటే అదీ లేదు. భూకామందుల దయా దాక్షిణ్యాలమీద ఆ కంట్రాక్టుల బ్రతుకు ఆధారపడి ఉండేది. ఇక దళారీ దౌర్జన్యం ఒకటి ఉండనే ఉన్నది. ఆ యాభై వంతులో 80 వంతులో పోను మిగిలినదాంట్లో దళారీలు కొంత తన్నుకుపోయేవాళ్ళు. అదీపోను మిగిలినదానిలో విపరీతమైన పన్ను చెల్లించాలి. 1948 వ సంవత్సరాంతాన మాస్కో శిక్షితులైన కమ్యూనిష్టులు చైనా గ్రామాల సమస్యలను వారి తెలివినంతా వినియోగించి ముఖ్యమైన

రాజకీయ సమస్యగా మార్చివేశారు. అక్కడ వ్యవసాయరంగంలో ప్రబలిన అసంతృప్తి ప్రాముఖ్యాన్ని గురించిగాని, దాని తీవ్రతను గురించిగాని చెప్పడం అంత తేలికపనికాదు. ఆసియాలో జనాభా సుమారు 125 కోట్లు (వారిలో చైనావారు 46 కోట్లమంది). ఆ జనాభాలో నూటికి 80 మంది రైతులు. వారందరిలోను వ్యవసాయ సంస్కరణలు వెంటనే అమలుజరగాలనే కోరిక నానాటికి ప్రబలుతూనే ఉన్నది. ఆ కోరికను ఆధారం చేసుకొని కమ్యూనిస్టులు రాజకీయ ప్రాముఖ్యం గల ఆ సమస్యలకు "వ్యవసాయ సంస్కరణలే" శరణ్యం అని ప్రచారం ప్రారంభించారు. ఆ ప్రచారాన్ని ఆసియా రైతాంగం నమ్మినా నమ్మవచ్చు.

అందుచేత కమ్యూనిస్టు ఒత్తిడిని తగ్గించి సుస్థిరమైన ఆర్థిక వ్యవస్థను చైనాలో నెలకొల్పేముందు అమలు పరచవలసిన ముఖ్యమైనసంస్కరణలు, అభ్యుదయ కార్యక్రమాలు చాలా ఉన్నవని అప్పుడే స్పష్టమైంది.

ఆ ఆశయసిద్ధికి కృషిచేయడానికే గ్రామాభ్యుదయ సంయుక్త సంఘాన్ని (జె. సి. ఆర్. ఆర్.) ఏర్పాటు చేశారు. అయితే, పై సంస్కరణలతో పాటు మూడు పెద్దపనులుకూడా ఆ సంఘం చేయవలసి ఉన్నది. వెంటనే ఆ సంఘం సమాజ వ్యవస్థలో న్యాయం కలిగించడానికీ,

ఆరోగ్యాభివృద్ధికీ, సక్రమమైన కౌలు పద్ధతిని అమలు పరచడానికీ, ఉత్పత్తిని ఎక్కువచేయడానికీ కార్యక్రమం ప్రారంభించింది.

పదిమందీ కూర్చొని కబుర్లు చెప్పుకునే ఇతర సంఘాల వలెగాక పై సంఘం కొండలను, గుట్టలను లెక్కచేయక అక్కడి ప్రజలలో తిరిగి చూచింది. రైతులతో ఆ సంఘం ప్రతినిధులు కలిసి మెలిసి తిరిగారు. వ్యవసాయ దారుడు అత్యవసరంగా కావాలనుకుంటున్న అవస రాలను గురించి తెలుసుకోడానికి వారు ప్రయత్నించారు. మున్నెన్నడో లారెన్సు అరేబియాలో అట్లాగే పని చేశాడు. అప్పటినుంచి ఏ పాశ్చాత్య దేశ ప్రతినిధి కూడా సమీప ప్రాచ్యంలోగాని, దూరప్రాచ్యంలోగాని పై సంఘం చేసినంత కృషి చేయలేదని నేను నిస్సం దేహంగా చెప్పగలను. ఆ సంఘం సాధించిన విజయాలు కూడా అటువంటివే.

పై సంఘంలో అమెరికా ప్రతినిధిగాను, ఫార్మొజాకు అమెరికా ఆర్థికసహాయ నిర్వహణ సంఘాధ్యక్షుడు గాను డాక్టరు రేమాండ్ టి. మోయర్ పనిచేశారు. భూమి కౌలు సంస్కరణలను అమలు పరచడానికి గ్రామాభ్యుదయసంఘం కృషి చెయ్యాలని ఆయన ఆ సంఘానికి పదేపదే చెప్పారు. తత్ఫలితంగా ఆ సంఘం

వివిధ రాష్ట్ర గవర్నరులను భూమికౌలు సంస్కరణల విషయములో ఒత్తిడి చేశారు. దాని పర్యవసానంగా భూమిలో పండేపంటలో నూటికి 37½ వంతులు సీలింగు కౌలుగా అనేక రాష్ట్రాల గవర్నరులు నిర్ణయించారు. (ఈ ముప్పయ్యేడున్నర శాతంలో ఆయా భూముల పరిస్థితులను బట్టి నూటికి 12½ నుంచి 30½ వరకు తగ్గింపు కూడా ఉన్నది.)

ఆ సంస్కరణ ఫలితంగా కృషీవలుని దృక్పథం మారింది. తను కష్టపడి పండించిన పంటలో తనకు సరిపోను ముట్టగలదన్న ఆశాభావంతో వ్యవసాయదారుడు అదివరకుకంటే ఎక్కువగా కష్టపడి పనిచేసి పంటను ఎక్కువచేశాడు. ఆ సంతృప్తిని పురస్కరించుకొని స్థానిక ప్రభుత్వంపట్ల అతని దృక్పథం మారి పాలనా వ్యవహారాలలో తానూ పాల్గొన వలెనన్న భావం రైతుకు కలిగింది.

సూవాౕ, క్వాంగ్సీ, ఫూకిౕ - ఈ మూడు రాష్ట్రాలలో పై కార్యక్రమం అంతబాగా అమలు జరగలేదు. అయినా, అక్కడే కమ్యూనిస్టుల దాడులు తీవ్రమైన ప్రతిఘటనలను ఎదుర్కొన్నవి.

కమ్యూనిస్టుల కార్యక్రమానికి ప్రతి గ్రామాభ్యుదయ సంయుక్త సంఘం అమలుపరచిన కార్య

క్రమాన్ని రెండు సంవత్సరాలకుపూర్వం అమలు పరిచి ఉన్నట్లయితే చైనా చరిత్ర ఏ విధంగా ఉండి ఉండేదో!

అటు ఐరోపాలోగాని, ఇటు ఆసియాలోగాని ఆర్థిక సహకార నిర్వహణ సంఘం మూడు ముఖ్యోద్దేశాలతో పని చేసింది. మానవుడు సుఖంగా బ్రతకడానికి తోడ్పడే కార్యక్రమాలను అమలు జరిపినట్లయితే ప్రజలలో ఆశాభావం, మానవత్వంమీద నమ్మకం ఎక్కువ కాగలవు. వాటి ఫలితంగా ప్రజలు స్వేచ్ఛగా సహేతుకమైన నిర్ణయాలు చేసుకోగలరు. ఆర్థిక సముద్ధరణవలన నైతిక సముద్ధరణ సిద్ధించగలదు.

ఐరోపాలో జరిగిన ఎన్నికలు పై విషయాన్ని దృఢ పరుస్తున్నవి. ఆ యా దేశాల ప్రజల జీవన ప్రమాణంలో మార్పు ఎన్నికల ఫలితాలలోకూడా కనిపించింది. ప్రజాస్వామ్యానికి అనుకూలమైన శక్తులకు తిరిగి బలంచేకూరడం, కమ్యూనిజంపై చర్చిల్ దండయాత్ర సాగించడం, కమ్యూనిస్టులు కాని వారందరికీ కమ్యూనిస్టు ప్రచారంలోని బండారం క్రమంగా తెలియడం, మొదలైన ఇతర విషయాలుకూడా ఐరోపా ఎన్నికల ఫలితాలకు కారణం కావచ్చు. వీటన్నిటికంటె ముఖ్యమైన కారణం ఆ యా ప్రజల ఆర్థిక కష్టాలు తగ్గుముఖం

పట్టడమేనని మార్షల్ ప్రణాళిక రుజువు చేస్తున్నది. ఉదాహరణకు బెల్జియమ్ సంగతి తీసుకుందాం. ఆ దేశంలో పారిశ్రామికోత్పత్తి నూటికి పన్నెండువంతులు ఎక్కువైంది; పార్లమెంటులో కమ్యూనిస్టులకు అదివరకు 17 స్థానా లుండేవి. అవి పది అయినవి. నార్వేలో పారిశ్రామికోత్పత్తి నూటికి 23 వంతులు పెరిగి అదివరకు కమ్యూనిస్టులకున్న ప్రాభవం భ్రష్టమైనది. నెదర్లాండ్సులో పారిశ్రామికోత్పత్తి నూటికి 51 వంతులు ఎక్కువై 1946 లో కమ్యూనిస్టులకు రాష్ట్రశాసనసభలలో లభించిన పదివంతుల స్థానాలు 1950 లో ఇరవైవంతులకు దిగజారినవి. డైన్మార్కులో ఉత్పత్తి నూటికి 31 వంతులు అధికమై 1945 లో కమ్యూనిస్టులు గెలుపొందిన నూటికి 12 వంతుల స్థానాలకుగాను 1950 లో నూటికి నాలుగు స్థానాలలో మాత్రమే వారు గెలుపొందారు. ఆస్ట్రియాలో ఉత్పత్తి నూటికి సుమారు 140 వంతుల వరకూ పెరిగి, అయిదు సంవత్సరాల క్రిందట ఎన్నికలలో గెలుపొందిన 35 మంది మేయర్లు 1950 లో ఓడిపోయినారు.

బ్రిటనులోను, స్విట్ జర్ లాండ్ లోను కమ్యూనిస్టుల సమస్య అసలు ఎప్పుడు పెద్దసమస్యగా పరిణమించలేదు. గ్రీసు, టర్కీ, పోర్చుగల్ దేశాలు కమ్యూనిస్టులను చట్టరీత్యా నిషేధించినవి.

ప్రాక్ పశ్చిమాలకు జరుగుతున్న ఈ సంఘర్షణకు ఇటలీ ఫ్రాన్సులు ముఖ్యమైన రంగస్థలాలు. ఫలితం ఎట్లా ఉంటుందో ఇప్పుడే చెప్పడం కష్టమే అయినా మనం కొంతవరకు సాధించగలిగామనే నా అభిప్రాయము. మార్షల్ పథకాన్ని అనుసరించి ఆ దేశాలకి సహాయం లభిస్తుందన్నవార్త ఇటలీ ప్రభుత్వంలో కమ్యూనిస్టు ప్రాధాన్యాన్ని తగ్గించడానికి ఉపయోగించింది. పైగా అక్కడి ఉత్పత్తి నూటికి 27 వంతులు ఎక్కువ కావడం కమ్యూనిస్టుల కార్మికోద్యమానికి గొడ్డలిపెట్టయింది. ఫ్రాన్సులోకూడా మార్షల్ ప్రణాళికను అమలు పరచడంతో అక్కడి కమ్యూనిస్టులకు పరాజయమే వచ్చింది. ఆ గండం గడిచినప్పటినుంచీ ఉత్పత్తి నూటికి 29 వంతులు అధికమై కమ్యూనిస్టు వ్యాప్తిని నిరోధించింది. ఇకముందుకూడా ఫ్రాన్సు ఆర్థికాభివృద్ధికి మనం సహాయం చేసినట్లయితే అక్కడి నియంతృత్వ శక్తులను ప్రజాస్వామిక వాదులు తప్పక జయిస్తారనడంలో నా కెట్టి అనుమానం లేదు.

ఉన్నతోద్యోగాలు నిర్వహించడానికి అంతటి గొప్ప వ్యక్తులుంటేనేగాని పరిపాలనా కార్యకలాపాలు సమర్థమంతంగా నెరవేరవన్న విషయం నాకు తెలుసు. సంవత్సరానికి 15 వేల డాలర్ల జీతం లభించే 25 ఉద్యోగాలను, పదివేల డాలర్లు లభించే 75 ఉద్యోగాలను

అమెరికా కాంగ్రెసు మా (ఆర్థిక సహాయ నిర్వహణ) శాఖకు కేటాయించింది. ప్రభుత్వోద్యోగుల జీతాల దృష్టితో చూస్తే పై స్థానాల నిర్ణయం ఉదాత్తం కావచ్చు. కాని, మేము చేయవలసిన పనినిబట్టి చూస్తే ఇతర సంస్థలలోగాని, పరిశ్రమలలోగాని లభించే జీతాల కంటె కొన్నిరెట్లు ఎక్కువ జీతం లభించే వందస్థానాలు మాకు రావాలని తేలుతుంది. ముఖ్యమైన స్థానాలలో శక్తి సామర్థ్యాలు గలవారిని నియమించడంలో నా అటార్నీ ఎమ్. టి. మూర్ నాకు చాలా సహాయం చేశారు. ఆ విషయమై మేమిద్దరం చాలా దూరంనుంచి టెలిఫోనుద్వారా గంటల తరబడి మాటలాడుకునే వాళ్ళం. అవసరం అయితే ఆయనో నేనో విమానంలో బయలుదేరి వెళ్ళి అటువంటివాళ్ళను చూచివచ్చే వాళ్ళం. ఆ విషయంలో మేము ఆశించినదానికంటే ఎక్కువ విజయమే మాకు లభించింది. ఆర్థిక సహకార నిర్వహణశాఖ సాధించిన విజయాలకు కారణం నావంటి వారిని ఆ సంఘంలో నియమించడమేనని (వినయంగా) నిజంగా చెపుతున్నారు.

ఎవరల్ హారిమన్ అప్పుడు వాణిజ్య శాఖామంత్రిగా ఉండేవారు. ఆర్థిక సహకార నిర్వాణ శాఖ ఐరోపాలో చేయవలసిన పనులకు ప్రత్యేక ప్రతినిధిగా చేయమని నేనాయనను కోరాను. అందుకు ఆయన సమ్మతించడం

నా కార్యసాధనకు మొదటి విజయం. బ్రిటను, రష్యాలలో అమెరికా రాయబారిగాను, తదితర ప్రధానోద్యోగాలలోను ఆయన పనిచేశారు. కనుక ఆయనకు ఐరోపా విషయాలు బాగా తెలుసు. అందుచేత ఆర్థిక సహకార నిర్వహణ శాఖలో ఆయన చేతికిచ్చిన పనిని ఆయన ఆదర్శంగా నిర్వహించారు. విలియమ్ సి. ఫాస్టరు అప్పటిలో వాణిజ్యశాఖ ఉపమంత్రిగా పనిచేసేవారు. హారిమన్‌కు సహాయకారిగా పనిచేయడానికి ఆయనను ఒప్పించగలిగాను. మారిలాండ్ పారిశ్రామికులలో ప్రముఖుడు హెూవర్డుబ్రూస్ అప్పుడు విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆయన తెలివితేటలు, అనుభవము అగణ్యాలు. ఆయనను నా సహోద్యోగిగా నియమించుకోగలిగాను. బ్రూస్ మొదటిలో ఆరు నెలలు మాత్రమే పనిచేస్తానన్నారు. తరువాత మా శాఖలో సంవత్సరన్నర వరకు ఆయన దయతో పనిచేశారు. ఐరోపాలో జరుపవలసిన కార్యక్రమాలకు ప్రధాన సలహాదారుగా అపార మేధాశక్తిసంపన్నుడైన మిల్టన్ వాట్జ్‌ను సంపాదించగలిగాము. ఆయన రెండో ప్రపంచ యుద్ధంలో వాషింగ్‌టన్‌లో అమోఘమైన సేవచేశారు.

మా శాఖలో ఉన్నతోద్యోగాలకు సమర్థులైన వారిని నిర్ణయించుకోడంతో మేము సంతృప్తి పడలేదు.

అమెరికన్ సమాజంలోని అన్ని రకాలవారిని పరిశీలించి అమెరికాకు పూర్తిగా ప్రాతినిధ్యం వహించగల వారినే మిగిలిన ఉద్యోగాలలో నియమించే విషయంలోకూడా మేము జాగ్రత్త వహించాం. హేన్స్‌వంటి బాంకరును, కిన్నన్ ఎస్. గోల్డెన్‌వంటి ప్రముఖ కార్మిక రాజకీయ విజ్ఞుణ్ణి, మిడ్వెస్టు పారిశ్రామిక వేత్తలలో ప్రముఖుడయిన జూనియర్ ఎమ్. చిస్సెల్‌ను, మాజీ వాల్ స్ట్రీట్ బ్రోకరు కర్నల్ సి. టైలర్ మడ్‌ను, అమెరికా వ్యవసాయశాఖ నిపుణుడు డాక్టరు డెన్నిస్ ఫిట్జ్ గెరాల్డును మా శాఖోద్యోగులుగా నియమించాము. వారందరు అనేక రకాలవారు. సమాజంలోని విభిన్న తరగతులవారితో మా శాఖ పనిచేసింది. విశ్వ విద్యాలయాచార్యులు, వ్యవసాయ నిపుణులు, ఆర్థిక శాస్త్రవేత్తలు మొదలయిన వారందరు మా శాఖలో ఉన్నారు. కేవలం అమెరికన్ల ప్రయోజనాల దృష్టితోనే గాక ఐరోపా వాసుల అభివృద్ధికికూడా అనుగుణంగా ఆ శాఖలోనివారు పనిచేశారు.

విదేశాల ఆర్థికాభివృద్ధికి గాని, సైనిక నిర్మాణానికి గాని మనం ఆయా దేశాలలో ఖర్చుపెట్టే డాలర్లను ఒకే ఏజన్సీద్వారా ఖర్చుపెడితేనే దానివలన మనకు ఎక్కువ ఉపయోగం రాగలదని నేను అనుభవపూర్వకంగా గ్రహించగలిగాను. ఆయా నిధుల కేటాయింపుకు ఒకే

ప్రభుత్వ ఏజన్సీ బాధ్యత వహించాలి. ఆ విధంగా విదేశాలలోని మన ఆర్థిక కార్యకలాపాలను అదుపు చేయగలిగినట్లయితే -

(1) ఏ దేశానికి కావలసిన సహాయం ఆ దేశానికి ప్రత్యేకించగలం (అట్లా కాకుండా వివిధ ప్రభుత్వ శాఖలు ధనం మంజూరు చేస్తున్నట్లయితే ఒక దేశానికి చాలా ఎక్కువ సహాయం చేయడం కద్దు.)

(2) ఒక దేశంలో అనవసరంగా డాలర్లను ఖర్చుచేసే పద్ధతిని నివారించగలం (అనేక శాఖలు డబ్బును కేటాయిస్తున్నట్లయితే, ఒకే పనికి రెండు శాఖలు డబ్బు మంజూరుచేసే ప్రమాదం ఉన్నది.)

(3) మనం ఆర్థిక సహాయంచేసే దేశాలలో మన డబ్బువలన విపరీత పరిణామాలు ఏర్పడకుండా చూడాలి. అందరికీ ఉద్యోగ వసతులుగల బ్రిటనువంటి దేశాలను సైనిక పునరుద్ధరణ కార్యక్రమంమీద ఎక్కువ జాగ్రత్త వహించమని ఒత్తిడిచేస్తే ఆ దేశాల ప్రజల జీవన ప్రమాణం దెబ్బతింటుంది. నిరుద్యోగ సమస్య ఎక్కువగా ఉన్న జర్మనీవంటి దేశంలో అవే డాలర్లను సైనిక పునర్ధారణకు ఖర్చుచేస్తే అక్కడి ప్రజల జీవన ప్రమాణం పెరుగుతుంది.

ఆర్థిక సంస్కరణలు, ఆర్థికాభివృద్ధి, సైనిక పునర్ధారణ - ఈ మూడు కార్యక్రమాలను ఆర్థిక సహకార నిర్వహణశాఖ నిర్వహించింది. అటు ప్రణాళికలను నిర్ణయించడం, ఇటు కార్యక్రమాలను అమలు పరచడం కూడా ఒకసారి జరిగినవి. దానివలన కలిగే సత్ఫలితాలు స్పష్టంగా కనిపించినవి. పై మూడు విషయాలను ఒకేశాఖ నిర్వహించినంతవరకు దాని లక్ష్యాలు చక్కగా నెరవేరినవి. అట్లా కాక ఆ పనులను ఇతర శాఖలకు అప్పగించిన సందర్భంలో అటు దాని ప్రణాళికలు, ఇటు ఈ ప్రణాళికలు అమలుపరచిన కార్యక్రమాలు కూడా దెబ్బతిన్నవి.

అందుచేత అమెరికనులకు, కాంగ్రెసుకు నేను ఈ క్రింది ముఖ్య విషయాలను సూచిస్తున్నాను. వాటిని వెంటనే అమలుపరచాలి.

విదేశాలకుచేసే ఆర్థిక సాంకేతిక సహాయాల నిర్వహణకు విదేశాల ఆర్థిక నిర్వహణశాఖను ఏర్పరచాలి. విదేశాలకు డాలర్లను ఋణంగా ఇచ్చే ఎక్స్పోర్టు ఇంపోర్టు బ్యాంకు మొదలైనవాటిమీద ఆ శాఖకు పూర్తి పర్యవేక్షణాధికారం ఎక్కువ ఉండాలి. అంతర్జాతీయ ఆర్థిక సంస్థలలో అమెరికా ప్రతినిధులుగా వ్యవహరించేవారందరు ఆ శాఖకు బాధ్యత వహించాలి.

అమెరికా విదేశాంగశాఖ, వాణిజ్య శాఖ, దేశీయ వ్యవహారాల శాఖవలెనే ఆ శాఖకుకూడా మంత్రి వర్గపు హోదా కలిగించాలి. ఆ శాఖాధికారిని మంత్రి వర్గంలోకి తీసుకోవాలి.

ఇప్పటి ఆర్థిక సహకార నిర్వహణశాఖ పద్ధతులలో ఆ శాఖను ఏర్పాటుచెయ్యాలి. ప్రస్తుతం అమెరికా విదేశాంగశాఖ అమలు పరుస్తున్న చతుర్థసూత్ర ప్రణాళికను ఆ శాఖకు అప్పగించాలి. పరస్పర రక్షణ సంధి ననుసరించి, ఐరోపా రాజ్యాలలో అమలు జరుగుతున్న సైనిక పునర్ధారణ కార్యక్రమానికి సంబంధించిన ఆర్థిక వ్యవహారాలపైన (అజమాయిషీచేసే) అధికారం ఆ శాఖకు ఉండాలి. ప్రపంచ బ్యాంకులోను, అంతర్జాతీయ ద్రవ్యనిధిలోను, అంతర్జాతీయ కార్మిక వ్యవస్థలోను (దీనిలో మనం చేరినప్పుడు) అమెరికా ప్రతినిధులు ఆర్థిక సలహాలను ఆ శాఖనుంచి పొందాలి.

# శాంతిసాధనకై రాజకీయరంగంలో జాగ్రత్తపడాలి

## 7 వ అధ్యాయము

అమెరికాలోని డెమోక్రాటిక్, రిపబ్లికన్ రాజకీయ పక్షాలు, రాష్ట్ర ఎన్నికలు, జనరల్ ఎన్నికలు వినా వేరు రాజకీయాలు నాకు ఇటీవలివరకూ తెలియవు. దానికి తోడు, జార్జి వాషింగ్టన్ సలహాలను పాటించి, విదేశాలతో శాశ్వత ఒడంబడికలు చేసుకోరాదన్న అభిప్రాయం ఎక్కువమందికి ఉన్నట్లు నాకు తెలుసు. వాషింగ్టన్ రోజులలో అట్లాంటిక్ సముద్రాన్ని దాటడానికి అయిదు వారాలు పట్టేదనీ, ప్రపంచ పర్యటనకు 1½ సంవత్సరాలు పట్టేదనీ ఎవరూ గుర్తించినట్లు లేదు.

ఈనాడు సముద్రాలు అవే అయినా అతి తక్కువ వ్యవధిలో ఎక్కువదూరం ప్రయాణం చేయడానికి సాధనాలు ఏర్పడ్డాయి. నేను అనేకసార్లు అర్ధరాత్రి సమయాలలో బయలుదేరి అతిదూర ప్రయాణాలు అతి స్వల్పకాలంలో చేశాను. న్యూయార్కులో మధ్యాహ్నం భోజనంచేసి విమానంలో బయలుదేరి ప్రాతఃకాలపు ఫలహారం వేళకు లండను చేరిన సందర్భాలెన్నో ఉన్నాయి. నేను ఒకసారి 14 రోజులలో ప్రపంచమంతా

చుట్టి వచ్చాను. ఆ 14 రోజులలోకూడ ప్రయాణం చేసినది 6 రోజులే.

వాస్తవిక పరిస్థితులను అతి ధైర్యంతో ఎదుర్కొనే జార్జి వాషింగ్టన్ కూడ తన కాలంనాటి విధానాలు ఈ కాలం పరిస్థితులకు అనుగుణంగా ఉండజాలవని అంగీకరించేవాడనే నేను విశ్వసిస్తున్నాను. విన్సెంట్ షీన్ చెప్పినట్లు "చైనాలోని యాంగ్సీనది న్యూయార్కుకు అంది పుచ్చుకొన్నంత దూరంలోకి వచ్చింది" అన్న భావాన్ని వాషింగ్టన్ అంగీకరించేవారే నని నమ్ముతున్నాను. గత 160 సంవత్సరాలలోను కలిగిన విపరీత మార్పుల దృష్ట్యా, విదేశాంగ విధానం అతిప్రధానమైన దేశీయ సమస్యగా పరిణమించినదని హెన్రీ స్టిమ్సన్ వెల్లడించిన అభిప్రాయాన్నికూడ వాషింగ్టన్ ఈనాడు ఉంటే అంగీకరించేవారే.

ప్రపంచ రాజ్యాలన్నీ అతి సన్నిహితంగా ఉన్న ఈ ఇరవయ్యో శతాబ్దం రెండవ అర్థభాగంలో ఏ జాతి కూడా ఏకాకిగా ఉండి మనజాలదు. ప్రపంచ ప్రజల యోగక్షేమాల దృష్ట్యా కృషి సాగించడమే శాంతి అభ్యుదయాల సాధనకు ఏక మార్గం.

ప్రపంచంలోని వివిధ జాతులు ఒకరిమీద ఒకరు ఆధారపడి, పరస్పర సహకార సద్భావాలతో మెలగా

లనే భావమే నా విషయంలో 'రాజకీయాలు' అనే మాటకు క్రొత్త అర్థాన్ని కల్పించింది. ఏక రాజకీయ పక్షం, ఏక అభ్యర్థి విధానాలకు బదులు డెమోక్రాటిక్ పార్టీ, రిపబ్లికన్ పార్టీ, స్వేచ్ఛగా ఎన్నికలు సాగనిస్తే, మనం ప్రపంచ రాజకీయాలకు దూరంగా ఉండడానికి వీలులేదు. ప్రపంచ రాజకీయాలు మన రాజకీయాలకు రక్షగా ఉండకపోగా, మన జీవితాలమీద ఎక్కువ ఒత్తిడిని తెచ్చిపెడతాయి. బ్రెజిల్‌లో కాఫీపంట నాశనమైనా, ఇండియాలో క్షామంవచ్చినా, బ్రిటన్‌లో కరెన్సీ విలువ తగ్గినా, ఫ్రాన్సులో మంత్రివర్గ ప్రతిష్టంభనలు ఏర్పడినా, ఆఫ్రికాలో యురేనియంగనులు బయటపడినా వాటి ప్రభావం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రపంచ ప్రజల, నాయకుల భవిష్యత్తుకు సంబంధించిన నిర్ణయాలపై ప్రసరించక తప్పదు.

"స్వదేశ రాజకీయాలకంటె విదేశ రాజకీయాలకే ఎక్కువ ప్రాముఖ్యమున్నదని ప్రతిజాతి ఎప్పుడో ఒకప్పుడు గుర్తించక తప్పదు" అని "బారన్స్" పత్రిక సంపాదకులు వెల్లడించిన అభిప్రాయంతో మనమందరం ఏకీభవించాలని నేను కోరుతున్నాను. దేశీయసమస్యలు ప్రత్యక్షంగా కన్పిస్తాయి. వాటిని తక్షణం పరిష్కరించవలసిన అవసరం కన్పిస్తుంది. నిజానికి, నిర్ణయాలు చేయడం కొంచెం ఆలస్యమైనా, విదేశాలతో

సంబంధాలే అతి ప్రధానమైనవి. విదేశాంగ విధానం మీదనే ప్రపంచంయొక్క భవిష్యత్ చరిత్ర ఆధారపడి ఉన్నది.

ప్రపంచశాంతి సాధనాకృషికి ప్రపంచ రాజకీయాలు ప్రాణప్రదమైనవనీ, శాంతికాలంలో కూడ నిర్దిష్టమైన విదేశాంగ విధానముండి తీరాలనే పైన పేర్కొన్న విషయాలయొక్క అంతరార్థం. గత 10 సంవత్సరాల నుంచీ మన విదేశాంగ విధానం సక్రమ పద్ధతులలోకి మళ్ళుతున్నదని చెప్పాలి. మన విదేశాంగ విధానం యొక్క గత 10 సంవత్సరాల చరిత్రను సమీక్షించడానికి పూర్వం, విదేశాంగ విధానాన్ని ఎవరు రూపొందిస్తున్నారు, దాన్ని ఎవరు అమలు జరుపుతున్నారనే విషయాలను పరిశీలిద్దాము.

అమెరికా రాజ్యాంగాన్ననుసరించి అమెరికా ప్రెసిడెంటు విదేశాంగ విధానాన్ని రూపొందిస్తారు. విదేశాంగ శాఖ దానిని అమలుపరుస్తుంది. ఆచరణలో కాంగ్రెసు ప్రముఖపాత్రను నిర్వహిస్తుంది.

ప్రభుత్వం చేసుకొనే ఒడంబడికలను సెనేటు ఆమోదించాలి. విదేశాంగ విధానంక్రింద ఒక కార్యాన్ని నెరవేర్చడానికి అయ్యే ధనం కాంగ్రెసు, సెనేటు మంజూరు చేయవచ్చు లేదా నిరాకరించవచ్చు. ఈ

విషయంలో ప్రభుత్వంయొక్క ఏ శాఖవారు నిర్వహించే కార్యక్రమాలైనా అవి ప్రజాభిప్రాయాని కనుగుణంగా ఉంటాయి. వాణిజ్య సంస్థలు, కార్మిక సంఘాలు, వ్యవసాయ దారుల సంస్థలు తదితర ప్రజాసంస్థల అభిప్రాయాల కనుగుణంగానే విదేశాంగ విధానం రూపొందించ బడుతుంది.

అదేవిధంగా పత్రికా రచయితల, రేడియో వ్యాఖ్యాతల, విద్యావేత్తల, మంత్రుల అభిప్రాయాలను మన్నించి విదేశాంగ విధానాన్ని రూపొందిస్తారు. ఒక్కమాటలో చెప్పాలంటే అమెరికన్ ప్రజలంతా అమెరికా విదేశాంగ విధానాన్ని రూపొందిస్తారన్న మాట. మన లక్ష్యాలకు, మనశక్తిసంపదకు అనుగుణంగా నిర్మాణాత్మక పద్ధతులలో విదేశాంగ విధానాన్ని రూపొందించాలి. లేని పక్షంలో మన వ్యవహారమంతా తారుమారై పోతుంది. విదేశాంగ విధానాన్ని రూపొందించేటప్పుడు ప్రజలలోని వివిధవర్గాల అభిప్రాయాలను తీసుకొన్నప్పటికీ, దానికి సక్రమమైన రూపం కల్పించే బాధ్యత విదేశాంగ శాఖవారిదే. ఈ గురుతర బాధ్యతను నిర్వహించేటప్పుడు మనం ఒంటికట్టుగా వ్యవహరించాలనే అభిప్రాయాలు, విదేశాంగ శాఖోద్యోగుల పట్ల గల అనుమానాలు కొంతవరకు అడ్డు తగులుతూ ఉంటాయి.

విదేశాంగ కార్యాలయోద్యోగులను గురించి ప్రజలలో అనేక చిత్రమైన అభిప్రాయా లుండేవి. నేను మొదటిసారి వాషింగ్టన్ వచ్చినప్పుడు నాకుకూడ అట్టి అభిప్రాయా లుండేవి. ధనిక కుటుంబాలకు చెందినవారే విదేశాంగ కార్యాలయోద్యోగులుగా ఉంటారనీ, వారందరూ రాజకీయ సమస్యలను పట్టించుకోకుండా విందులు, వినోదాలతో కాలక్షేపం చేస్తూంటారనీ అనుకుంటూ ఉండేవారు.

నేను వాషింగ్టన్ వచ్చిన తర్వాత అవి తప్పు అభిప్రాయాలని తెలుసుకొన్నాను. అమెరికా ఆర్థికసహాయ నిర్వహణ శాఖాధికారిగా నేను వ్యవహరించిన 2½ సంవత్సరాల అనుభవంలోను విదేశాంగశాఖలోని వారందరూ చాల కష్టపడి పనిచేసేవారని గ్రహించ గలిగాను. సమర్థులైనవారినీ, శక్తివంచన లేకుండా కృషి చేసేవారినీ ఆ శాఖలో ఉద్యోగులుగా నియమిస్తారని తెలుసుకొన్నాను. అమెరికన్ ప్రజలలోని వివిధ వర్గాలకు చెందినవారిని ఆ శాఖలో ఉద్యోగులుగా నియమిస్తారు. 1939 సంవత్సరంలో అమెరికా విదేశాంగ శాఖలో 5,400 మంది ఉద్యోగు లుండేవారు. ఈ నాడు ఆ సంఖ్య 24,000 కు పెరిగింది. దాన్నిబట్టి ప్రపంచ నాయకత్వ నిర్వహణలో అమెరికా బాధ్యతలు ఎన్నో రెట్లు పెరిగినాయని వ్యక్తమౌతూంది. విదేశాంగ

శాఖలో ఉద్యోగాలు సంపాదించడానికి వ్యక్తులయొక్క సాంఘిక గౌరవం, కుటుంబంయొక్క ఘనత ప్రధానం కాదని ఋజువయింది.

అమెరికా విదేశాంగశాఖ సాధించిన విజయాలను, మహాత్కార్యాలను అమెరికన్ ప్రజలు, ప్రపంచంలోని ఇతర దేశాలవారు గుర్తిస్తున్నారు. ప్రపంచ శాంతి సాధనకు ఈ నాడు తోడ్పడుతున్న అనేక అంతర్జాతీయ సంస్థల నిర్మాణానికీ, వ్యవహారణకూ అమెరికా విదేశాంగ కార్యాలయం విపరీతంగా తోడ్పడుతూంది. శాంతి సాధనకు ఐక్యరాజ్య సమితి సాగించే కార్యకలాపాలకు విదేశాంగ కార్యాలయం ఆ మార్గాన్ని సుగమంచేసింది. ప్రపంచ రాజ్యాల సహకారాన్ని పొందడానికీ, ఇతర దేశాలకు అమెరికాపట్ల సద్భావం పెంపొందడానికీ, అమెరికా లక్ష్యాలు ఇతర దేశాలకు స్పష్టంగా అర్థం కావడానికీ ఐక్యరాజ్య సమితి సంస్థలద్వారా విదేశాంగ శాఖ విపరీతంగా కృషి చేస్తూంది. అమెరికా వ్యవసాయ పద్ధతులను అభివృద్ధిచేసే మార్గాలను గురించి ప్రపంచ ఆహార, వ్యవసాయ సంఘంద్వారా ఇతర దేశాలకు బోధపరుస్తున్నది. అమెరికా వైద్య విధానాలను ప్రపంచ ఆరోగ్యసంస్థద్వారా ప్రబోధిస్తున్నది. వైజ్ఞానిక రంగంలో ప్రపంచ విజ్ఞాన సంఘంద్వారా కృషి చేస్తున్నది. ప్రపంచపు మార్కెట్టులలో వస్తుమారకం,

వస్తువినిమయం సక్రమంగా, సత్వరంగా జరగడానికి ప్రభుత్వంయొక్క ఇతర సంస్థలతో పాటు, అంతర్జాతీయ వాణిజ్య సంస్థను నెలకొల్పడానికి విదేశాంగ కార్యాలయం సహాయపడింది. ప్రపంచ శాంతిసాధనకు ఆ వాణిజ్యసంస్థకూడ ఒక సాధనం.

అమెరికా విదేశాంగ కార్యాలయం పైన పేర్కొన్న వాటికంటె మరికొన్ని ముఖ్యమైన మహాత్కార్యాలను సాధించింది. ట్రూమన్ సిద్ధాంతం, మార్షల్ పథకం, పరస్పర సహాయరక్షణ పథకం, ఉత్తర అట్లాంటిక్ సంధి మొదలైన పథకాలను విదేశాంగ కార్యాలయం అభివృద్ధిచేసింది. ఐక్యరాజ్యసమితి కార్యకలాపాలలో అమెరికా చురుకుగా పాల్గొనడం, పైన పేర్కొన్న పథకాలను రూపొందించడం శాంతికాలంలో అవలంబించవలసిన విదేశాంగ విధానానికి నిదర్శనాలు. పశ్చిమ యూరప్‌లో మన విధానాలు విజయవంతం కావడానికీ, ఆసియాలో విజయవంతం కాకపోవడానికీ కారణం ఏమిటంటే, ఆసియా రాజ్యాలపట్ల మనం నిర్దుష్టమైన విధానాన్ని అవలంబించడంలేదు.

ఇతర దేశాలతో సంబంధం మనకేమిటని వ్యవహరించడానికి వీల్లేదు. అమెరికా ఒంటికట్టుగా ఉండాలనే భావంతో రూపొందించబడిన మన్రో సిద్ధాంతం,

సముద్రాలమీద స్వాతంత్ర్యం మొదలైన సిద్ధాంతాల వల్ల మనకు కలిగిన చెరుపును కొన్ని తరాల వరకూ మరచిపోవడానికి వీల్లేదు. అట్టి విదేశాంగ విధానమే మొదటి ప్రపంచయుద్ధం తర్వాత మనం నానాజాతి సమితిలో పాల్గొనడానికి వీల్లేకుండా చేసింది. దూరదృష్టి లేకుండా యూరప్‌కు గ్రాంట్లు, ఋణాలు ఇవ్వడానికీ, యుద్ధాన్ని నిరసిస్తూ కెల్లాగ్ - బ్రియాండ్ ఒడంబడికను సమర్థించడానికీ ఆ విదేశాంగ విధానమే కారణమైంది.

ప్రపంచంలోని ఇతర దేశాలతో మనం ఏర్పరుచుకో వలసిన సంబంధాలను స్పష్టీకరించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. అమెరికా విదేశాంగ కార్యాలయం వారు ఆ రంగంలో విపరీత కృషి సాగించడం అత్యావసర మని నేను విశ్వసిస్తున్నాను. విదేశాలలోని అమెరికా రాయబారుల కార్యాలయాలు నిర్వహించే కార్య కలాపాలు తప్ప మిగతావాటిని నిలిపివేసి అయినా విదే శాంగశాఖ ఈ కార్యభారాన్ని తక్షణం నిర్వర్తించాలి.

ఉదాహరణకు చెపుతున్నాను. అమెరికా రాజకీయ లక్ష్యాల సమగ్ర స్వరూపాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రపంచంలోని ఏ ప్రాంతాలకు ఆర్థిక సహాయం పంపాలో, ఏ ప్రాంతాలలో రాజకీయ ప్రచారం సాగించాలో, అమెరికా విదేశాంగ కార్యాలయంవారు తమ ప్రభుత్వం

యొక్క ఇతర శాఖల సహాయంతో పరిశీలించి తగిన నిర్ణయాలు చేయాలి. ప్రెసిడెంటు ట్రూమన్ చతుర్ సూత్రకార్యక్రమాన్ని అమలు పరుస్తున్నా మనీ, "వాయిస్ - ఆఫ్ అమెరికా" రేడియోద్వారా ప్రచారం చేస్తున్నామనీ సాకుగా చెప్పి ఈ కార్యక్రమాన్ని మూలకు త్రోసివేయకూడదు. ఆ పథకాల నిర్వహణ ప్రత్యేక సంస్థలకు అప్పగించకుండా తామే నిర్వహిస్తా మంటే కలగా పులగం, ఖంగారు తప్ప, సక్రమంగా అమలు జరుగవు. విదేశాంగశాఖ సిబ్బంది గందరగోళం పడవలసి వస్తుంది.

అమెరికా ఆర్థిక సహకార నిర్వహణ శాఖవారు, సిబ్బంది నిర్వహించవలసిన కార్యకలాపాలను, ఇతర పథకాల నిర్వహణను వేరుచేయడంవల్ల అనేక సత్ఫలితాలు కలిగాయని అనుభవ పూర్వకంగా తెలుసుకున్నారు. ఒక ప్రత్యేక రాజకీయ లక్ష్యాన్ని, అమెరికా విదేశాంగ కార్యాలయం యొక్క ఆదేశాన్ని ఆర్థిక సహాయ కార్యక్రమంద్వారా అమలు పరచడానికి ఆర్థిక సహాయ నిర్వహణశాఖ ఒక ప్రత్యేక సంస్థగా ఏర్పాటు చేయబడింది. దానిని స్థాపించి నప్పుడు ఆ సంస్థకూ, విదేశాంగ కార్యాలయానికీ ఎవరి అధికారం ఎంతవరకూ అనే విషయంలో వివాదాలు సంభవిస్తాయని భావించారు. కాంగ్రెసుకూడ ఈ విషయంలో చాల భయపడింది.

ఆర్థిక సహాయ నిర్వహణ శాఖను నెలకొల్పడానికి 1948 సంవత్సరంలో కాంగ్రెసు ఆమోదించిన విదేశ సహాయ శాసనంలో అమెరికా విదేశాంగ మంత్రి, ఆర్థిక సహాయ నిర్వహణాధికారి పరస్పరం సంప్రతించుకొంటూ, ఇద్దరికీ ఆమోదకరంగా ఉండే నిర్ణయాలను చేయాలని పేర్కొన్నారు. వారిద్దరికి అంగీకారం కుదరని విషయం ఏదైనా వస్తే, అది అమెరికా ప్రెసిడెంటుకు నివేదించాలని ఆ శాసనంలో పేర్కొనబడింది. ఈ రోజువరకూ వారిద్దరి మధ్యా అట్టి వివాదం సంభవించలేదు. భవిష్యత్తులో కూడా సంభవించదనే నేను విశ్వసిస్తున్నాను.

నిజానికి అమెరికా ఆర్థిక సహాయ నిర్వహణశాఖ విదేశాంగ కార్యాలయం యొక్క సంపూర్ణ సహకారాన్ని పొందింది. అది లేకపోతే ఆర్థిక సహాయ నిర్వహణశాఖ విజయవంతంగా పురోగమించడానికి అవకాశం ఉండేదికాదు. ఆర్థిక సహాయ నిర్వహణశాఖ ఆర్థిక రంగంలో విశేషంగా కృషిచేయడంవల్ల అమెరికా విదేశాంగ శాఖయొక్క ప్రధాన లక్ష్యాలు చాలవరకూ నెరవేరాయి. పశ్చిమ యూరప్ రాజ్యాల ప్రజలు తమ సమస్యలను, తమ అవకాశాలను, తమ ఇబ్బందులను సక్రమంగా గుర్తించి, పరస్పర సహకారంతో సమష్టి కృషిని సాగించడానికి వారికి తగిన ప్రోత్సాహం ఇవ్వగలిగింది. ఈ రంగంలో ఇటీవల సాధించిన విజయాలు ఆర్థిక

సహాయ నిర్వహణశాఖ సాగించిన కృషియొక్క ఫలితమే నని ఒప్పుకు తీరాలి. పశ్చిమ యూరప్ ప్రజలలో ఆర్థిక విషయాలలో కలిగిన ఏకీభావం ఇతర రంగాలలోకి వ్యాపించింది. ఆర్థిక రంగంలో సమైక్యత ఏర్పడితే, అది రాజకీయ రంగంలోకి, సైనికరంగంలోకి కూడ వ్యాపిస్తుంది.

ఈ ఐక్యమత్యం ఈనాడు కూడ సుస్థిరంగా ఉన్నదని నేను అనుభవ పూర్వకంగా చెప్తున్నాను. అమెరికా ఆర్థిక సహాయ నిర్వహణాధికారిగా నేను బ్రిటను వెళ్ళి నపుడు పరిశీలన చేయగా బ్రిటను ఆర్థికవ్యవస్థ ఛిన్నా భిన్నమై పోయింది. పశ్చిమ యూరప్‌లోని ప్రతి జాతి కూడ స్వయం పోషకత్వాన్ని సాధించడానికి ప్రయత్ని స్తూంది. ఆ లక్ష్యసాధనకు పశ్చిమ యూరప్‌లోని ఏ ఒక్క దేశంకూడా యూరప్ వస్తుసంపదను సక్రమంగా వినియోగించుకోలేదు. పశ్చిమ యూరప్ 50 సంవత్స రాలుగా ఆర్థికాభ్యుదయంకోసం యమయాతన పడు తున్నది.

వాణిజ్య నిబంధనల విషయంలోను, ఎగుమతి దిగుమతి కోటాలను పెంపొందించడంలోను, స్వదేశ పరిశ్రమలకు రక్షణ కల్పించడంలోను ఒకదేశంతో మరొక దేశం పోటీపడడం ప్రారంభమైంది. ఈ అవరోధాలన్నీ వాణిజ్యం పెంపొందకుండా నిరోధించాయి. తక్కువ వ్యయంతో

ఎక్కువ వస్తువులను ఉత్పత్తిచేసే ఆధునిక పద్ధతులను పశ్చిమ యూరప్ అవలంబించకుండా అవి అడ్డుతగిలాయి. ఆ 50 సంవత్సరాలలోనే అమెరికా ఆధునిక పద్ధతులమీద ఉత్పత్తులను సాగించి, అమెరికన్ ప్రజల జీవన ప్రమాణాలను పెంపొందించింది. దానికి కారణం ఒక్కటే. ఉత్పత్తి అయిన వస్తువులు ఫ్యాక్టరీనుంచి వినియోగదారులకు స్వేచ్ఛగా చేరడానికి అవకాశమున్నప్పుడు, ఆంక్షలు, నిబంధనలు లేక స్వేచ్ఛా వ్యాపారం సాగినప్పుడే, తక్కువ వ్యయంతో ఎక్కువ ఉత్పత్తులను సాగించడానికి అవకాశ ముంటుంది.

వాణిజ్య అవరోధాలవల్ల యూరప్‌లోని దేశాలకు ఎంతటి నష్టం కలుగుతున్నదీ ఆ దేశాలలోని ఉత్పత్తుల సంఖ్యను, అమెరికాలోని ఉత్పత్తుల సంఖ్యతో పోల్చి చూస్తే తెలుస్తుంది. 1900 సంవత్సరంలో అమెరికాలోని కార్మికుడు ఎంత ఉత్పత్తి చేసేవాడో, యూరప్‌లోని కార్మికుడు అంతే ఉత్పత్తి చేసేవాడు. ఇద్దరి జీవన వ్యయప్రమాణం ఒకే స్థాయిలో ఉండేది. 1950 సంవత్సరంలో 15,10,00,000 జనాభాగల అమెరికా 279,00,00,00,000 డాలర్ల విలువగల వస్తువులను ఉత్పత్తి చేసింది. అదే సంవత్సరంలో 27,40,00,000 జనాభాగల మార్షల్ పథకం దేశాలు 170,00,00,00,000 డాలర్ల విలువలుగల వస్తువులను ఉత్పత్తిచేశాయి.

యూరప్ దేశాలలో కార్మికుల ఉత్పత్తి శక్తి అమెరికా కార్మికుని ఉత్పత్తి శక్తితో సమానంగా ఉన్నట్లయితే ఆ దేశాలవారు 500,00,00,00,000 డాలర్ల విలువగల వస్తువులను ఉత్పత్తి చేయవలసి ఉన్నది.

పశ్చిమ ఐరోపా దేశాలకు ముడిపదార్థాలు, చాలినంత యంత్రసామగ్రి లేనిమాట నిజమే. యూరప్‌లోని పరిశ్రమలు అమెరికాలోని పరిశ్రమల స్థాయికి రావడానికి ఎంతకాలం పడుతుందో నిర్ధారణగా చెప్పజాలము. అయినప్పటికీ యూరప్‌లో స్వేచ్ఛా వాణిజ్యం ఏర్పడి, కంట్రోళ్ళు, ఎగుమతి సుంకాలు సడలించబడితే యూరప్ దేశాలు 100,00,00,00,000 డాలర్ల విలువగల వస్తువులను అదనంగా ఉత్పత్తి చేయగలుగుతాయి. ఆ అదనపు ఉత్పత్తులను యూరప్ కొనసాగించ గలిగినట్లయితే ఆర్థికాభ్యుదయాన్ని, ఆయుధ పునర్ధారణ కార్యక్రమ సత్వర నిర్వహణను యూరప్ సాధించగలిగి ఉండేది.

పశ్చిమ యూరప్ దేశాలలో వాణిజ్య అవరోధాలను తొలగించాలని మనం కోరడంలో ఎట్టి ఆర్థిక ప్రయోజనాలను ఆశించి గాదు. మార్షల్ పథకం శాంతి సాధనకొరకు రూపొందించబడిన కార్యక్రమమన్న విషయాన్ని మేము ఎన్నడూ విస్మరించలేదు. ఆర్థిక

రంగంలో సర్వాధికారాలు కావాలనీ, నిరంకుశాధి కారాలు వెలగబెట్టాలనీ ప్రయత్నాలు జరుగుతుండడం వల్లనే వాణిజ్య అవరోధాలు ఏర్పడుతున్నాయి. ఉదాహరణకు చెపుతున్నాను. హిట్లరు జర్మనీలో స్వయం పోషకతను ముందుగా సాధించకపోతే, రెండవ ప్రపంచ యుద్ధానికి దిగడానికి అతడికి తాహతు ఉండేదికాదని మేము విశ్వసిస్తున్నాము. జర్మనీలో యుద్ధానికి అత్యవసరమైన రబ్బరును, పెట్రోలును హిట్లరు కృత్రిమ పద్ధతులలో సమృద్ధిగా తయారు చేయించాడు. ఉక్కు కర్మాగారాలను నెలకొల్పాడు. వీటన్నిటినీ ఎక్కువ వ్యయంతో సాగించాడు. జర్మనీ వెలుపలి దేశాలతో పోటీకి నిలవడానికి అవసరమైన వాటి నన్నిటినీ సమకూర్చుకొన్నాడు.

అమెరికా ఆర్థిక సహాయ నిర్వహణశాఖ యూరప్ అభివృద్ధికి చేయగలిగిన ఏకైక సహాయం ఆర్థిక సమైక్యతా సాధనకు తోడ్పడమే. ఆ శాఖ తోడ్పాటువల్ల యూరప్ ఆర్థిక వ్యవస్థ చక్కబడేది. అంతకుముందున్న అవరోధాలన్నీ తొలగిపోయి, అమెరికాలో మాదిరిగా స్వేచ్ఛా వాణిజ్యం నిరాఘాటంగా సాగేదని చెప్పగలను గాని, అది జరుగలేదు. యూరప్‌లో ఎగుమతి, దిగుమతి సుంకాల విషయంలో కంట్రోళ్ళు మితిమీరి ఉండడం వల్ల వస్తువినిమయ విధానం, సిబ్బంది వినిమయ విధానం

సక్రమంగా అమలు జరుగలేదు. కాకపోతే, ఆర్థిక నిరంకుశత్వం కోసం జరుగుతున్న పెనగులాట తిరుగు ముఖం పట్టింది.

యూరప్ రాజ్యాలలో వాణిజ్య ప్రతిష్ఠంభన ఏర్పడి నప్పుడు మార్షల్ పథకం అమలులోకి వచ్చిన తొలి సంవత్సరంలోనే అమెరికా ధనసహాయంచేసి యూరప్ వాణిజ్యం యథావిధిగా కొనసాగడానికి తోడ్పడింది. యూరప్‌లో ఒక దేశం మరొక దేశానికి ఎగుమతిచేసిన వస్తువులకు డాలర్లు సేకరించుకోడానికి అవకాశం ఏర్ప డింది. ప్రస్తుత పరిస్థితులలో అనుసరించ వలసిన మార్గం అదొక్కటే. పశ్చిమ యూరప్‌లోని వివిధ దేశాల లోని కరెన్సీ విలువ ప్రపంచంలోని ఇతర దేశాలలోని విలువ కనుగుణంగా లేదు. పశ్చిమ యూరప్ దేశాలు దిగుమతులపై కంట్రోళ్ళను సగానికి పైగా తగ్గించి వేశాయి.

యూరప్ దేశాల వాణిజ్యం సన్నగిలిపోతున్న ఈ సమయంలో బ్రిటను తన పౌనుయొక్క విలువను తగ్గించ డంతో, వాణిజ్య పురోభివృద్ధికి చక్కని మార్గ మేర్పరచ డానికి అవకాశం ఏర్పడింది. బ్రిటను తన కరెన్సీ విలు వను తగ్గిచడంవల్ల యూరప్ దేశాలన్నీ తమతమ కరెన్సీ విలువలను మార్చుకోవలసి వచ్చింది. యూరప్

లోని వివిధ దేశాల కరెన్సీలు, ఫ్రాంకులు, గిల్డర్లు, పౌనులు మొదలైనవాటిని ఒక కరెన్సీనుంచి మరొక కరెన్సీకి మార్చుకోడానికి వీలుగా యూరప్ వాణిజ్య చెల్లింపుల సంఘం (యూరపియన్ పేమెంట్సు యూనియన్) ఏర్పరచడడానికి వీలు ఏర్పడింది. అందులో భాగస్వాములైన వారందరూ తమలోని ఒక దేశానికి వస్తువులను ఎగుమతిచేయగా లభించే ధనాన్ని మరొక దేశంనుంచి దిగుమతి చేసుకొనేవాటికి చెల్లించవచ్చును. ఒక దేశంనుంచి మరొక దేశానికి పంపే ఎగుమతులలో లోగడ ఉన్న కంట్రోళ్ళు నూటికి 10 వంతులు తొలగించబడ్డాయి. యూరప్‌లోని దేశాల మధ్య ఆహారపదార్థాలు, ముడిపదార్థాలు, తయారైన వస్తువుల విషయంలో సాగుతున్న వాణిజ్యంలో నూటికి 60 వంతులు యథేచ్ఛగా సాగడానికి అవకాశం లభించింది.

యూరప్‌లోని వాణిజ్యపు చెల్లింపుల సంఘం యూరప్ దేశాలమధ్య ఆర్థిక, సాంఘిక సమైక్యతను, పరస్పర సహకారాన్ని పెంపొందింప చేసింది. బ్రిటిషు పార్లమెంటు, ఖజానాశాఖ, పారిశ్రామిక, వ్యవసాయక శక్తుల సమష్టి కృషితో ఆ సంఘం రూపొందింది.

వాణిజ్యపు చెల్లింపుల సంఘంయొక్క చరిత్రను స్థాలాభావంచేత సమగ్రంగా వివరించడానికి ఇక్కడ సావకాశం

లేదు. పశ్చిమ యూరప్ దేశాలవారు చాల దూర దృష్టితో ఆలోచించి, అతిక్లిష్ట విషయాలపై దీర్ఘకాలం సంప్రతింపులు జరిపి, జాతి శ్రేయస్సు దృష్ట్యా ఆ సంఘాన్ని నెలకొల్పారు. అమెరికా ఆర్థిక సహాయ నిర్వహణ శాఖ వారి మార్గదర్శకత్వం క్రింద ఈ సంఘం వ్యవహరిస్తున్నదని టూకీగా చెపుతున్నాను.

పశ్చిమ యూరప్ రాజ్యాలు పరస్పర సహాయం చేసుకోవాలన్న భావనే షూమన్ ప్రణాళిక రూపొందడానికి ప్రధాన కారణమైంది. పశ్చిమ యూరప్‌లోని ఇనుము, బొగ్గు సంపదను పరిరక్షించి, గనుల నుంచి ఫ్యాక్టరీలకు, ఫ్యాక్టరీలనుంచి మార్కెట్లకు చేరవేయడానికి సౌకర్యాలు కలుగ చేయడమే మార్షల్ ప్రణాళిక యొక్క ప్రధాన లక్ష్యం. అంతేగాక ఆర్థిక రాజకీయ రంగాలలోకూడ సన్నిహిత సహకారాన్ని సమకూర్చింది. ఈ ప్రతిపాదనను చేస్తూ, ఫ్రెంచి విదేశాంగ కార్యాలయం ఇలా ప్రకటించింది: "ఒక్కసారిగా పునర్నిర్మాణం సాధ్యంకాదు. ఆ సమస్య లన్నింటినీ ఒక్కసారి పరిష్కరించాలంటే సాధ్యంకాదు. మనం ఒక్కొక్క కార్యాన్ని సాధిస్తూఉంటే యూరప్ పరిస్థితి క్రమేణ చక్కబడుతుంది. యూరప్‌లోని వివిధ దేశాల మధ్య సమైక్యతను సాధించాలంటే అనాదిసిద్ధంగా ఫ్రాన్సు జర్మనీల మధ్య ఉన్న వైషమ్యం తొలిగించాలి. యూరప్‌లోని ముడిపదార్థా

లన్నిటినీ సేకరించి వాటిని వినియోగించడానికి ఒక అధికారవర్గాన్ని నెలకొల్పాలి. యూరప్‌లోని అన్ని దేశాలవారు ఆ వర్గంయొక్క ఆదేశాలను పాటించాలి. ఈ ప్రతిపాదన యూరప్ దేశాల సమాఖ్య రూపొందడానికి ప్రాతిపదిక కాగలదు. ప్రపంచ శాంతిరక్షణకు యూరప్ దేశాల సమాఖ్య ఏర్పడడం అత్యవసరం."

షూమర్ పథకంలో రాజకీయ ఆశయాలు ఆ పథకంయొక్క ఆర్థిక లక్ష్యాలద్వారా నెరవేరగలవు. ఆ చెల్లింపుల సంఘంలో సభ్యత్వంగల యూరప్ దేశాలకు సమాన షరతుల మీద ఉక్కు, బొగ్గు పంపడం, నవీన పద్ధతులలో ఉత్పత్తులను పెంపొందించడం, ఉత్పత్తుల నాణ్యతను ఎక్కువ చేయడం, కార్మికుల జీవన ప్రమాణాలను పెంపొందించడం, యజమానులకు అధికలాభాలు వచ్చేటట్లు చేయడం పథకంయొక్క లక్ష్యాలు.

ఒకతరం క్రిందట షూమర్ పథకంలాంటి దాన్ని రూపొందించ వచ్చుననే తలంపుకూడ ఎవరికీ లేదు. కాని, ఈ గ్రంథం అచ్చువేయ బోతూన్న సమయంలో ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీ, ఇటలీ, నెదర్లెండ్సు బెల్జియం, లగ్జెంబర్గు ప్రభుత్వాల ప్రతినిధులు షూమర్ పథకంపైన సంతకాలు చేయడానికి సన్నాహపడుతున్నారు. షూమర్ పథకంలోని రాజకీయ లక్ష్యాలు చాల సాహసంతో

కూడినట్టివి. యూరప్ రాజ్యాల సమాఖ్యకు అవి ప్రాతి పదికగా ఏర్పడినాయి. పశ్చిమ యూరప్ రాజ్యాలలో రాజకీయ పరిణామాల దృష్ట్యా ఆ సమాఖ్య ఏర్పడడం అత్యవసరం. షూమన్ పథకంక్రింద ఏర్పడే అధికార వర్గానికి జాతీయ వాణిజ్య పురోభివృద్ధికిగల అవరోధా లను తొలగించడమే గాక వ్యక్తిగతంగా విధించ బడిన ఆంక్షలనుకూడ తొలగించే అధికార మున్నది. 1928 వ సంవత్సరంలో యూరప్‌లోని ఉక్కు ఉత్పత్తిదార్లు, వ్యాపారస్తులు అమ్మకం ధరలకు రక్షణ ఏర్పాటుచేసి, ఉత్పత్తి పెరుగకుండా చేశారు. యూరప్‌లోని వివిధ దేశాలవారు ఆ విధంగా ఒక ఒడంబడిక చేసుకున్నారు. ఆ ఒడంబడిక ఉక్కు ఉత్పత్తులను పెంపొందించనూ లేదు వాణిజ్య అవరోధాలను తొలగించనూలేదు. అందు వల్ల ఆ పరిశ్రమ విపరీతంగా దెబ్బతిన్నది. మార్షల్ పథకంవచ్చిన తర్వాత ఉక్కు అమ్మకపు ధరలను సరసంగా నిర్ణయించి, కార్మికులకు సక్రమమైన జీతాలను ఏర్పాటుచేయడం జరిగింది. పశ్చిమ యూరప్ రాజ్యాల లోని ఉక్కు, బొగ్గు పరిశ్రమలు క్రమాభివృద్ధి నొందడానికి షూమన్ పథకం పైన పేర్కొన్న ఒడంబడికకు విరుగుడుగా పనిచేసింది.

అమెరికా ఆర్థిక సహాయ నిర్వహణ శాఖయొక్క ఉన్నత రాజకీయ లక్ష్యాలను వివరిస్తున్నాను. అమెరికా

వంటి శక్తివంతమైన రాజ్యం అంతకంటె తక్కువ శక్తి గల రాజ్యాలతో భాగ స్వామ్యం ఏర్పరచుకొని ఆ రాజ్యాల స్వాతంత్ర్యానికి భంగం లేకుండా వ్యవహరించ వచ్చునని అమెరికా ఆర్థిక సహకార నిర్వహణ శాఖ నిరూపిస్తున్నది. ఒక శక్తివంతమైన రాజ్యం మరొక రాజ్యంయొక్క ఆంతరంగిక వ్యవహారాలతో సంబంధం కలిగించుకొన్నా, ఆ రాజ్యంయొక్క స్వాతంత్ర్యానికి భంగం కలిగించడానికి నిరాకరిస్తూ, పై పెచ్చు దాన్ని రక్షిస్తూ, వ్యవహరించడానికి అమెరికా ఆర్థిక సహకార నిర్వహణశాఖను నెలకొల్పడం ప్రపంచ రాజకీయాలలో అమెరికా చేసిన ప్రధాన ప్రయత్నం. కొత్తగా స్వాతంత్ర్యం పొందిన ఫిలిప్పీన్స్, ఇండోనీసియా, బర్మా దేశాలు ఇతర దేశాల ఆధిపత్యం, ప్రాబల్యం విష యాలలో ఎక్కువ సందేహాలతో ఉన్నప్పటికి, ఆర్థిక సహకార నిర్వహణశాఖ చాల ప్రయోజనాలు కలిగించింది.

అమెరికా ఆర్థిక సహకార శాఖలోని ఉద్యోగులు స్వతంత్రంగా వ్యవహరించాలనే అభిలాష గలవారు. ఆ శాఖయొక్క నిర్వహణ కార్యకలాపాలలో ప్రావీ ణ్యతను సాధించాలని అమెరికా త్వరపడినా, ప్రావీణ్యత, స్వాతంత్ర్యాలు ఈ రెండింటిలో ఆ ఉద్యోగులు స్వాతంత్ర్యంవైపే మొగ్గుచూపారు. లండనులోని

"ఎకానమిస్టు" పత్రికకూడ ఆ విషయాన్నే వ్రాసింది. పశ్చిమ యూరపు పునరుద్ధరణకు కృషి చేయాలనే సంకల్పం, పశ్చిమ యూరప్ రాజ్యాల స్వీయసంకల్పమే.

ప్రజాస్వామ్యం వర్ధిల్లడానికి ప్రజాస్వామిక విధానాలను సక్రమంగా అవలంబించడ మొక్కటే మార్గమని నేను ఆర్థిక సహకార నిర్వహణాధికారిగా గణించిన అనుభవంద్వారా తెలుసుకొన్నాను. అందుకు నేను చాల గర్వపడుతున్నాను. రెండు తీవ్ర వాదాలకు సంఘర్షణ ఏర్పడినప్పుడు మధ్య మార్గ మవలంబించడం, విభిన్న వర్గాలమధ్య సామరస్యాన్ని సాధించడం, దార్జన్య చర్యలద్వారా గాక, సంప్రతింపులు, చర్చల ద్వారా వాటిని సాధించడం అత్యావసరంగా పరిగణించ దగిన విషయాలు. ప్రజాస్వామిక యుగంలో చర్చలు, సంప్రతింపులు జరపడానికి జరిగే సమావేశాలు గందరగోళాలతోను, ఆవేశాలతోను సమాప్త మవుతాయి. విదేశాలలో పనిచేస్తున్న అమెరికా ఆర్థిక సహకార శాఖ ఉద్యోగులు జరిపే సమావేశాలు చాల ప్రశాంతంగా జరుగుతాయి. ఎదుటివారి వాదాన్ని బాగా అర్థం చేసుకొని, ఎట్టి ఆవేశాన్ని ప్రదర్శించకుండా, చర్చలు తాపీగా సాగిస్తారు. మన దేశంనుంచి యంత్ర సామగ్రి, ఆహారపదార్థాలు విదేశాలకు ఎగుమతి అవడానికి ఇట్టి మన స్తత్వాన్ని ప్రదర్శించడమే కారణం.

మన జాతీయ రాజకీయాలలో ఇచ్చి పుచ్చుకొనే విధానాలు మనకు అలవాటుకావడం, మనలో మనకుగల వైషమ్యాలను తొలగించుకోడానికి మనం నేర్చుకున్న పద్ధతులు, మనం విదేశాలకు వెళ్ళినా సునాయాసంగా వ్యవహారాలను పరిష్కరించుకోడానికి ఉపకరిస్తున్నవి.

ఆసియాలో మనం నిర్వహించవలసిన కర్తవ్యాన్ని మనం యూరప్‌లో అనుభవపూర్వకంగా తెలుసుకున్నాము. ఎందువల్లనంటే మార్షల్ పథకంలో ప్రపంచ రాజకీయాలకు అతి ప్రధానమైన వాటన్నింటినీ పొందుపరిచాము. యూరప్‌కు ట్రాక్టర్లు మొదలైన పరికరాలను లభింపచేయడానికి తోడ్పడ్డాము. ఆసియాకు వ్యాధుల నిరోధానికి టీకాలమందులు, వ్యవసాయానికి అవసరమైన ఎరువులు లభింపచేయవలసి ఉన్నది. యూరప్‌లోనైనా, ఆసియాలోనైనా మన రాజకీయ లక్ష్యం ఒక్కటే. నిరంకుశవిధానాలు, స్వతంత్ర విధానాలు, ఏది ప్రయోజనకారో గుర్తించలేని వారిని ప్రజాస్వామిక విధానాల సక్రమ మార్గంలోకి మళ్ళించగలవు.

రాజకీయ రంగంలో తగిన జాగ్రత్తలు తీసుకొనడంలో పరిపూర్ణతను సాధించామని నేను చెప్పడం లేదు. అమెరికా నిర్దుష్టమైన విదేశాంగ విధానాన్ని

ఇటీవలే అమలు జరపడంవల్ల, కొన్ని ప్రాంతాలలో రక్షణ చర్యలు జరపడం, మరికొన్ని ప్రాంతాలలో వాటిని జరపడానికి సన్నాహాలు చేయడం దగ్గరే ఉన్నాము. ప్రపంచ నాయకత్వాన్ని స్వీకరించడం మనకు కొత్త కావడంవల్ల శాంతిని సాధించడానికి ఇంకా ఎట్టి సంస్థలను నెలకొల్పవలసి ఉన్నదీ మనం నిర్ణయించుకోవలసి ఉన్నది. ఈ గురుతర బాధ్యతను మనం తక్షణం స్వీకరించి, దాని సక్రమ నిర్వాహణకు సత్వర చర్యలు తీసుకోవాలని కాంగ్రెసు, అమెరికా ప్రభుత్వం, ప్రజలు చాలా తొందర పడుతున్నారు. ఆ విషయంలో మనం తటపటాయించడానికి కూడ వ్యవధిలేదని నేను విశ్వసిస్తున్నాను. మనం వెంటనే దాన్ని స్వీకరించి, సమర్థనీయంగా నిర్వహించకపోతే మనం సమూలంగా నాశనం కాక తప్పదు. ఎందువల్లనంటే ప్రమాదం కనుచూపుమేరలో ప్రత్యక్షంగా కన్పిస్తున్నది. జాగుచేస్తే ముప్పు తప్పదు.

# శాంతిసాధనకై సమాచారరంగంలో జాగ్రత్తపడాలి

## 8-వ అధ్యాయం

నా జీవితంలో ఎక్కువ భాగం నేను పనిచేస్తున్న కంపెనీ ఉత్పత్తులను పెంపొందించడంలోను, వాటిని మార్కెట్టులోకి ఎక్కించి ప్రజలచేత వాటిని ఎక్కువగా కొనిపించడానికి కృషిచేయడంలోనూ గడిచింది. ఏదైనా ఒక వస్తువు మార్కెట్టులో బాగా చలామణి అయి, పేరు ప్రఖ్యాతులు పొందాలంటే అది మంచి సరుకయివుండాలనే సూత్రాన్ని దృష్టిలో ఉంచుకుని నేను కృషిచేస్తూ వచ్చాను. ఆ వస్తువు మంచిదైతేనే పదికాలాలపాటు మార్కెట్టులో నిలబడుతుందని నా విశ్వాసం. ఆ సిద్ధాంతాన్ని విశ్వసించే చాలా కాలం వరకు నేను కమ్యూనిజాన్ని లక్ష్యపెట్టలేదు. రాజకీయ దృష్ట్యా కమ్యూనిజం అభ్యుదయ నిరోధకమైనదని నా గట్టి విశ్వాసం. క్రెమ్లిన్ ఆచరణలోకి తెచ్చిన కమ్యూనిజం రష్యన్ ప్రజలపై క్రూరతరకమైన దౌర్జన్య విధానాలు ప్రయోగించడంగా పరిణమించింది. అందువల్ల కమ్యూనిజం విదేశాలలో చలామణీ కావడం మాట అటుంచి, స్వదేశంలోనే దీర్ఘకాలం నిలవలేదని నా నమ్మకం.

నేను 1946 సంవత్సరం ఆకురాలు కాలంలో యూరప్ వెళ్ళినప్పుడు నా ఆనందానికి భంగం కలిగింది. ఇటలీ, ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీలలోని కోట్లాది ప్రజలు ప్రజాస్వామికం కంటె కమ్యూనిజమే తమకు సుఖసంపదలను కలిగించగలదనే నమ్మకంలోపడి ఆ విధంగా నాతో చెప్పారు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఆ దేశాలయొక్క ఆర్థిక వ్యవస్థలు ఛిన్నాభిన్నమై ప్రజలు యమయాతన లనుభవించవలసి రావడం, అట్టి సమయాలలో ప్రజలలో ఏర్పడే నిస్పృహ నైరాశ్యాల కారణంగా వారికి కమ్యూనిజంపట్ల గౌరవం ఏర్పడడం గుర్తించాను. కమ్యూనిస్టు దుష్ప్రచారకులు ఆ దేశాల ప్రజల శోచనీయ పరిస్థితులను అవకాశంగా తీసుకొని ఆ దేశాలలో కమ్యూనిస్టు ప్రభుత్వాలు ఏర్పడితేనే వారికి కడుపునిండా తిండి, రక్షణ దొరుకుతాయని ప్రచారాలు ప్రారంభించారు. ముఖ్యంగా బీదతరగతి ప్రజలలో ఈ అస్త్రాన్ని ఎక్కువగా ప్రయోగించారు. బీదప్రజలు మాత్రమే కమ్యూనిస్టులతో పొత్తు కలుపుకుంటున్నారని అనడానికి వీల్లేదు. ఎంతో మంది మేధావంతులు, భాగ్యవంతులు, వివిధ వృత్తుల లోని వారు కమ్యూనిజంవైపు మొగ్గుతూనే ఉన్నారు. ఈ విషయాన్ని మరికొంత తరిచిచూడగా, ప్రజలలోని వివిధ వర్గాలమధ్య వైషమ్యాలను రెచ్చగొట్టి, వాటిని

అవకాశంగా తీసుకుని కమ్యూనిస్టులు సాగిస్తున్న దుష్ప్రచారమే అందుకు కారణమని స్పష్టమైంది.

కమ్యూనిస్టు ప్రచారంవల్ల కలుగుతున్న ప్రమాద మేమిటంటే, ప్రజానీకంయొక్క స్వతంత్ర భావాలనూ, సహకారాన్నీ కమ్యూనిస్టులు స్వార్థ ప్రయోజనాలకోసం ఉపయోగించు కుంటున్నారు.

కమ్యూనిస్టుల దౌర్జన్య విధానాలు, అనాగరిక చర్యలు, యుద్ధోన్మాదాలు కప్పిపుచ్చడానికి కమ్యూనిస్టులు ఎప్పుడూ శాంతి సౌభ్రాత్రం అంటూ నీతి వాక్యాలు మాట్లాడు తూంటారు. ప్రజలకు నిజమేమిటో అబద్ధమేమిటో తెలియకుండా కంగారుపెట్టి, అయోమయావస్థను కలుగచేసే ప్రచారం చేయడానికి సమర్థులు కమ్యూనిస్టు లొక్కరే. గోబెల్స్, మాకవిల్లీలు వారి ముందర తీసికట్టే. ఈ విషయాలన్నీ నాకు చాలా భయాన్ని కలిగించాయి. స్వతంత్ర దేశాలు కమ్యూనిజాన్ని ప్రతిఘటించాలంటే ప్రజల జీవన ప్రమాణాలను పెంపొందించడమే గాక క్రెమ్లిన్ సాగిస్తున్న అసత్య ప్రచారాన్ని అరికట్టాలి. వాస్తవ పరిస్థితులను ప్రజానీకానికి తెలియ పరచి, కమ్యూనిస్టుల దుష్ప్రచారం ఫలితంగా పెడమార్గాన్ని పట్టిన ప్రజలను సక్రమ మార్గంలోకి మళ్లించాలి.

'ప్రచారం' అనేమాట అమెరికనులలో చాలా మందికి అనుమానం, భయం కలిగిస్తుంది. 'ప్రచారం' అనేపదం మోసం, జిత్తులమారి తనాలకు సన్నిహితమైన దనీ, నిరంకుశ ప్రభుత్వాలకు సరిపడేది తప్ప ప్రజా స్వామిక ప్రభుత్వాలకు సరిపోయేదికాదనీ వారి నమ్మకం. హిట్లర్, స్టాలిన్ దానిని ఉపయోగించిన పద్ధతులనుబట్టి 'ప్రచారం' అనేమాట 'శుద్ధ అబద్ధం' అనేమాటకు పర్యాయ పదమైంది. వాస్తవానికి 'ప్రచారం' అంటే అవి కానేకావు. ప్రచారం నిర్మాణాత్మకంగాను, నైతిక విలువల ప్రబోధానికి సాగించ వచ్చును. లేదా విధ్వంసక చర్యలకు, అవినీతిని యెక్కువ చేయడానికి సాగించ వచ్చును. 'ప్రచారం' అనేదాన్ని మనం ఆ దృష్టితో చూడాలి. అమెరికా కాంగ్రెసు సభ్యులు, ప్రజలు 'ప్రచారం', 'సమాచారం' అనే మాటలకుగల వ్యత్యాసాన్ని గుర్తించక అనవసరంగా ఖంగారు పడుతూంటారు. ఆ రెండు మాటలకుగల వ్యత్యాసాన్ని స్పష్టంగా పేర్కొంటూ న్యూయార్క్ టైమ్సు ఆదివారం పత్రిక సంపాదకుడు లెస్టర్ మార్కెల్ యిచ్చిన నిర్వచనాలను నేను స్వీకరిస్తున్నాను. ఆ రెండు మాటలను పరస్పర విరుద్ధార్థాలలో ఉపయోగిస్తున్నారని మార్కెల్ పేర్కొన్నారు. ఆ రెండు మాటలకుగల వ్యత్యాసం స్పష్టంగా అర్థమై, వాటిని ఉపయోగిస్తున్నట్లు లేదని

చెపుతూ, ఆ రెండింటికీ యీ క్రింది నిర్వచనాలను ఆయన ఇచ్చారు: (1) వాస్తవపరిస్థితులను, అభిప్రాయాలను గురించి ఇతరులకు తెలియచెప్పడం సమాచారం (2) ఇతరులమీద తమ ప్రభావాన్ని ప్రసరింపచేయడానికి వాస్తవిక విషయాలను, అవాస్తవిక విషయాలను, కాస్తఉంటే గంపంతచేయడం ప్రచారం.

సమాచారం అందివ్వడం, ఆవేశం, అలజడి లేకుండా పని సాగిపోవడమన్నమాట. 'ప్రచారం' మాత్రం ఆవేశాలతోను, లేని దానిని కల్పించడం, ఉన్నదానిని ఎక్కువ చేయడంతోను కూడివుంటుంది. ఆ రెండింటికీ గల తేడాను గుర్తించడం చాల కష్టమయిన పని. ఎందువల్లనంటే అబద్ధాలని తెలియనీయకుండా ఒడుపుగా ప్రచారం చేయవచ్చును. అసత్యాలను అవేశంతో ప్రచారం చేసేకంటె, వాస్తవిక విషయాలను ఎట్టి ఆవేశం లేకుండా ఇతరులకు తెలియజేయడంలోనే ఎక్కువ ప్రయోజన ముంటుంది.

'ప్రచారం', 'సమాచారం' అనే రెండింటియొక్క సరిహద్దులను గుర్తించడం అంత తేలిక కాకపోయినా ఈనాడు మానవుని సహృదయతకు, మేధాశక్తికీ జరుగుతున్న పోటీలో అమెరికా నిర్వహించవలసిన ప్రధాన బాధ్యతలు రెండున్నాయి.

(1) మన విదేశ విధానాన్ని గురించి, విదేశాలతో వ్యవహరించే అన్ని విషయాలను గురించి మన ప్రజలకు మనం ఎప్పటి కప్పుడు తెలియజేస్తూండాలి. ఇది సమాచారశాఖ చేయవలసినపని.

(2) విదేశ ప్రజలు మనలనుగురించి, మన లక్ష్యాలను గురించి ఎక్కువగా తెలుసుకోడానికి మనం కృషి చేయాలి. అది ప్రచారశాఖవారు నిర్వహించవలసినపని.

రష్యా తన ప్రభావాన్ని ప్రసరింపచేయదలచిన ప్రాంతాలలో అక్కడి ప్రజలకు బాగా నచ్చచెప్పి తమ వైపుకు త్రిప్పుకోడానికి క్రెమ్లిన్ వద్ద అద్భుతమైన చిట్కా ఒకటి ఉన్నది. మార్క్సు, ఏంజిల్సు వ్రాసిన గ్రంథాలలో ఆ చిట్కా పేర్కొనబడింది. వర్గరహితమైన సాంఘిక వ్యవస్థ ఏర్పడాలనీ, అప్పుడు ప్రజలు శాంతి సౌఖ్యాలతో జీవించగలరనీ వారు సిద్ధాంతీకరించారు. ఆ సిద్ధాంతాలను లెనిన్, స్టాలిన్ ఆచరణలోకి తీసుకు రావడంలో నియంతృత్వ విధానంగా పరిణమించి, కొద్ది మంది వ్యక్తులు పాలకవర్గంగా ఏర్పడి హింసా దౌర్జన్యాలతో పరిపాలన సాగించడంగా తయారైంది. కాని ప్రచారం చేసేటప్పుడు వారు మార్క్సు సిద్ధాంతాలను గురించి ఎక్కువగా చెపుతారు.

ఆ సిద్ధాంతాన్ని వ్యాపింపచేయడానికి క్రెమ్లిన్ ఒక బ్రహ్మాండమైన వ్యవస్థను నిర్మించింది. అందు నిమిత్తం

ధనాన్ని విపరీతంగా వ్యయపరుస్తూ, అతి చాకచక్యంతో ఆ కార్యకలాపాలను సాగిస్తున్నారు. రష్యా ప్రజలను, దాని ఉపగ్రహ రాజ్యాల ప్రజలను భావదాస్యంలో ఉంచి స్వతంత్ర ప్రజల మనస్సులను చెడగొట్టడానికిగాను విపరీత ప్రయత్నాలు సాగిస్తున్నారు. క్రెమ్లిన్ అనుసరించే విధానాలలో అదే ప్రధానమైనది. కమ్యూనిస్టు పార్టీ చేసే ప్రచారం అదే. ఆ కార్యక్రమానికి సమగ్ర రూపం కల్పించి అవలంబించవలసిన పద్ధతులన్నీ విశదీకరించారు.

ఈ ప్రచారకయంత్రం ఏ విధంగా పనిచేస్తున్నదో తెలుసుకోవాలంటే ఉదాహరణకు ఫ్రాన్సులో క్రెమ్లిన్ సాగిస్తున్న వ్యవహారాన్ని పరిశీలిస్తే బోధపడుతుంది. ఫ్రాన్సులో అంతం కలహాలు లేవదీసి ప్రభుత్వాన్ని వశపరుచుకోవాలని రష్యా విపరీత ప్రయత్నాలు కొనసాగించింది.

ఫ్రాన్సు జనాభా అమెరికా జనాభాలో మూడవ వంతు ఉంటుంది.

కాని ఫ్రాన్సులోని కమ్యూనిస్టు పార్టీ బలం అమెరికాలోని కమ్యూనిస్టు పార్టీ బలానికి 10 రెట్లు ఉంది. ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ రికార్డులలో 7,00,000 మంది సభ్యులున్నట్లు పేర్కొన్నప్పటికీ నూటికి నూరు

పాళ్ళు కమ్యూనిస్టులైన వారు కనీసం 2½ లక్షల మందైనా ఉంటారు. వారందరూ ఎల్లవేళలా క్రెమ్లిన్ సిద్ధాంతాలను ప్రచారం చేసేటటువంటివారే. ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీకూడా ఇతర దేశాలలో కమ్యూనిస్టు పార్టీల మాదిరిగానే రష్యా విదేశాంగ విధానాన్ని ఆమోదించి, అమలు పరుస్తూంటుంది.

ఫ్రెంచి కమ్యూనిస్టులు అతి జాగ్రత్తగా ఆలోచించి ఒక నిర్ణీత కార్యక్రమ ప్రకారం ప్రజలలో విభేదాలు రేకెత్తించడానికి కృషి ప్రారంభించారు. యుద్ధంనుంచి తిరిగి వచ్చినవారినీ, బాంబులకు గురియైన కుటుంబాల వారినీ, యుద్ధంలో భర్తలను కోల్పోయిన మహిళలను, మాజీయుద్ధ ఖైదీలను చేరదీసి సంఘాలు స్థాపించారు. వారి సౌకర్యార్థం ఆటలక్లబ్బులు, ఇతర సంస్థలు నెల కొల్పారు. ప్రజలలోని కొందరిని చేరదీసి వారికి చాడీలు చెప్పడం, రహస్యంగా కుట్రలు లేవదీయడం, పెద్ద మనుష్యులను అపఖ్యాతిపాలు చేయడం మొదలైన విద్యలు నేర్పారు. కమ్యూనిజాన్ని వ్యతిరేకించేవారిని అపఖ్యాతి పాలు చేయడానికి కొంతమంది మహిళలను నియోగించారు. కమ్యూనిస్టుపార్టీ వ్యతిరేకులైన వారి రహస్యాలను పార్టీకి చేరవేయడానికి రహస్య సిబ్బందిని నియమించారు. కమూనిస్టుపార్టీ తరఫున ఈ విధంగా ప్రత్యక్షంగాను, పరోక్షంగాను పనిచేసే సంస్థలు,

వ్యక్తులు ఫ్రాన్సులో కుక్కగొడుగులు మాదిరిగా వెలిశాయి.

ఫ్రాన్సులోని కార్మిక సంస్థలలో అతి ప్రధానమయిన కార్మిక సమాఖ్యను కమ్యూనిస్టులు తమ ఆధిపత్యంలోకి తెచ్చుకొన్నారు. గత రెండు సంవత్సరాలలోను ఆ సమాఖ్యబలం క్షీణించినప్పటికీ ఇంకా 22,50,000 మంది సభ్యులున్నారు. వారందరూ ప్రధాన పారిశ్రామిక సంస్థలలోను, యుద్ధ సాధనపరిశ్రమలలోను పని చేస్తున్నారు. ఆ సంస్థలు కమ్యూనిస్టుల ఆధిపత్యంక్రింద వున్నా, వాటిలోని సభ్యులందరూ నూటికి నూరు వంతులు కమ్యూనిస్టులు కారు. అందులో సిసలైన కమ్యూనిస్టుల సంఖ్య ఎంతో తెలియదు. కాని, కార్మిక పత్రికలుచేసే గగ్గోలుమాత్రం అందరూ ఎరిగినదే.

ఫ్రాన్సులో పత్రికలే కమ్యూనిస్టులకు ప్రధానాయుధాలు. కమ్యూనిస్టు దినపత్రికలు, వారపత్రికలు, మాస పత్రికలు ఫ్రాన్సులో ఉన్నాయి. ప్రజలలోని వివిధ వర్గాల వారికి, వ్యవసాయ దారులకు, మేధావంతులకు, రేవు కార్మికులకు, మంత్రులకు, యువకులకు, మహిళలకు, మతగురువులకు వేర్వేరు పత్రిక లున్నాయి. ప్రతి పెద్దనగరం నుంచి చిన్న పట్టణం వరకూ కమ్యూనిస్టు పార్టీకి బ్రహ్మాండమైన దినపత్రికలు, బొమ్మల పత్రికలు,

రాజకీయాలు, అసత్య ప్రచారం సాగించే పత్రికలు ఉన్నాయి. ఫ్రాన్సులో ఇటీవలే ఏర్పడిన 'కమ్యూనిస్టు ప్రెస్ అసోసియేషన్' వారికి సరికొత్త ఆయుధం. ఆ అసోసియేషన్ వారు ఏ ప్రాంతంలో జరిగిన వార్తలనైనా టెలిగ్రాముల ద్వారా తమ పత్రికలకు అందజేసి, ఒక్క-క్షణం వ్యవధిలో వార్తలను దేశమంతటికి అందిస్తారు.

కమ్యూనిస్టుపార్టీ ప్రచురించే పత్రికలను చూచీ చూడడంతోనే కమ్యూనిస్టు పత్రికలని చెప్పలేము. దుస్తులు ధరించే పద్ధతుల దగ్గరనుంచి, ఫుట్ బాల్ పందేల వరకూ పత్రికలలో వార్తలను ప్రచురిస్తారు. ఫ్రాన్సు మొత్తంమీద కమ్యూనిస్టుపార్టీ ప్రచురణలు దాదాపు వందవరకూ ఉన్నాయి. పారిస్ నగరంలోనే 40 ప్రచురణలదాకా ఉన్నాయి. కమ్యూనిస్టు విధానాలకు అనుకూలంగా ఉన్న విషయాలు, అమెరికా వ్యతిరేక వార్తలు ప్రముఖ స్థానాలలో ప్రకటిస్తారు. మార్షల్ పథకాన్ని గురించి వ్యతిరేక ప్రచారం సాగిస్తున్నారు. పత్రికా ప్రకటనలకుతోడు బహిరంగ సభలు, సమావేశాలు, విజ్ఞప్తులు సాగుతూ ఉంటాయి. శాంతి మహాసభలు, జన్మదినోత్సవాలు జరుపుతారు.

కమ్యూనిష్టు పార్టీ పోస్టర్లు ప్రతి వీథిలోను, సందులోను కనిపిస్తాయి. కమ్యూనిష్టు కరపత్రాలు ప్రతి కాఫీ

హోటలులోనూ పంచిపెడతారు. ఇవిగాక కమ్యూనిష్టు సిద్ధాంతాలనుగురించి వ్రాయబడిన గ్రంథాలు, ప్రదర్శనలు, ఫిల్ము ఉపన్యాసాలు ఉంటాయి. కమ్యూనిష్టు పార్టీ ఉపయోగించే సాధనాలకు అంతులేదు.

ఫ్రెంచి కమ్యూనిష్టుపార్టీకి ధనంవచ్చే మార్గాలు కొన్ని మాత్రమే మనకు తెలుసు. రష్యా ఆ పార్టీకి ధన సహాయం చేస్తూందన్న విషయంలో ఎట్టి సందేహంలేదు. ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ ప్రతిసంవత్సరం ఒక కోటి 70 లక్షల డాలర్లను ఖర్చుచేస్తున్నదని రూఢిగా తెలుస్తూంది.

ఒక నిర్ణీత పద్ధతిలో, అతి చాకచక్యంగా సర్వతో ముఖంగా అమలు జరుపబడుతున్న ఈ ప్రచారక కార్యక్రమం స్వతంత్ర రాజ్యాల పాలిటి అతి క్లిష్ట సమస్యగా పరిణమించింది.

కమ్యూనిష్టులు తమ ప్రచార ప్రభావంవల్ల అమాయక ప్రజలలో కలిగించిన దురభిప్రాయాలను పోగొట్టడానికి స్వతంత్ర దేశాల కర్తవ్యమేమిటి ?

ప్రపంచ మంతటిలో గల స్వతంత్ర దేశాల ప్రజల ఆశయాలను, లక్ష్యాలను ప్రతిబింబింప చేసేటటువంటి ఒక సిద్ధాంతాన్ని మొట్టమొదటగా మనం రూపొందిం

చాలి. ఆ సిద్ధాంతాన్ని ప్రజలకు సూటిగా అర్థమయ్యేటట్లు ప్రబోధించడానికి మనం సక్రమ మార్గాలలో కృషి చేయాలి.

స్వాతంత్ర్యంపట్ల అలసత్వం ఏర్పడిన ప్రజలలో నూతన చైతన్యం కలిగించడం, ఇప్పుడు బానిసత్వంలో మ్రగ్గుతున్నవారిని ఉద్ధరించడం మనం సునాయాసంగా చేయగలం. వారసత్వరీత్యా మనకు సంక్రమించినట్టి మహత్తర విషయాలదృష్ట్యా ఆ సిద్ధాంతాన్ని మనం రూపొందించాలి. మాగ్నకార్టా, అమెరికా స్వాతంత్ర్య ప్రకటనలలోని మన ఆశయాలు, లక్ష్యాలు, మన మూల సిద్ధాంతాలు, ప్లేటో, ఏసుక్రీస్తుల ప్రబోధాలనుంచి అవి గ్రహించబడినాయి.

మన స్వతంత్ర దేశాల సిద్ధాంతంలో ఈ క్రింది నాలుగు అంశాలు ఉండాలి :

(1) మత విషయాలలో వ్యక్తి స్వాతంత్ర్యం, వ్యక్తి యొక్క విలువ, సౌభ్రాత్రాలను గౌరవించాలి.

(2) రాజకీయ రంగంలో ప్రభుత్వ విధానాలు గాక, పౌర స్వాతంత్ర్యాన్ని కలిగించాలి.

(3) ఆర్థిక రంగంలో ప్రజలందరికీ ఆర్థిక ప్రయోజనాలు కలిగే విధంగా కృషిచేయాలి.

(4) సాంఘిక రంగంలో ప్రజలందరికీ సమానావకాశాలు, విద్యాసాంస్కృతిక ప్రయోజనాలు, వ్యక్తి రక్షణ, మొదలైనవి కలిగించాలి.

'స్వతంత్ర ప్రజల' సిద్ధాంతాన్ని రూపొందించడం పూర్తయిన తర్వాత దానిని ప్రచారంలోకి తేవడానికి అన్ని విధాలా కృషి చేయాలి. ఇతర స్వతంత్ర దేశాలు స్వయం కృషివల్ల అభివృద్ధిచెందడానికి అమెరికా తోడ్పడ గలదని గుర్తించాలి. కాని ఆ బాధ్యతనంతనూ అమెరికా ఒక్కటే నిర్వహించడానికి ప్రయత్నించకూడదు. ఈ సిద్ధాంతాన్ని ఏ దేశం ప్రజలు ఆ దేశంలో అమలు జరిపితే అది తేలికగా నిర్వహించబడుతుంది. స్వతంత్ర దేశాలు, ఉక్కు తెర వెనుక దేశాలు ఈ కర్తవ్యాన్ని నిర్వహించవచ్చు. అమెరికనులకంటె ఫ్రెంచి ప్రజలు ఈ సిద్ధాంతాలవల్ల అధిక ప్రయోజనాలను పొందగలరు. పోలెండులోను, బయట దేశాలలోనుగల పోలిష్ ప్రజలు ఇతరులకంటె ఎక్కువ విజయవంతంగా దీనిని సాధించవచ్చును.

అమెరికా విదేశాలలో ప్రచారం సాగించడానికి అనేక గురుతర బాధ్యతలను స్వీకరించవలసియున్నది. స్వతంత్ర రాజ్యాల నాయకమణిగా, సర్వమానవుల శాంతియుతజీవనమే మన ప్రధాన లక్ష్యమని మాటలతోను, చేతలతోను మనం నిరూపించాలి.

మన ప్రచారాన్ని మనం సాధించిన మహాత్కార్యాలను గురించి సాగించాలి. మార్షల్ పథకం క్రింద యూరపు దేశాలకు మనం చేసిన సహాయం, ఆగ్నేయాసియాకు మనం చేసిన ఆర్థిక సహాయం, చతుర్థసూత్ర కార్యక్రమంక్రింద చేస్తున్న సహాయం మనం ఇతరులకు నచ్చచెప్పగల మహాత్కార్యాలు. వాటిని గురించి స్వతంత్ర దేశాల ప్రజలకు మనం సవివరంగా తెలియజేయాలి.

కోమిన్‌ఫారమ్ దేశాలు మార్షల్ పథకాన్ని ప్రతిఘటించినప్పుడు ఉత్పన్నమైన సమస్యలనుగురించి గడచిన అధ్యాయాలలో ఒకచోట పేర్కొన్నాను. మార్షల్ పథకంలోనే నేను పైన పేర్కొన్న సిద్ధాంతం చేరి ఉన్నది. యూరప్‌ను ఆర్థికంగా పునరుద్ధరించి, కోల్పోయిన శక్తిని తిరిగి కలిగించడానికి ఆ పథకం ఎంతో తోడ్పడింది. మన మహాత్కార్యాలనుగురించి ఇతరులకు తెలియ చెప్పుకోడానికి మనకు సాధనం లేకపోయింది.

అమెరికా ఆర్థిక సహకార నిర్వహణ సందర్భంలో, దానిని గురించి ఇతరులకు తెలియజేయడానికి సమాచార శాఖను నెలకొల్పి ఉంటుందని మాకు మొదట్లో తెలియలేదు. దానికి అవసరంలేదని భావించాము. ఆర్థిక సహకార నిర్వహణ శాఖ తరఫున విదేశాలలో

ఒక్కొక్కచోట ఒకరిద్దరు ప్రతినిధులను నియమించి, స్థానిక పత్రికల సంపాదకులతో వారు పరిచయం ఏర్పరుచుకొని తమ కార్య కలాపాలను గురించి ఆ పత్రి కలకు ప్రకటనలు విడుదలచేస్తూ, అందువల్ల కలిగిన ఫలి తాలను మాకు తెలియచేస్తూంటే సరిపోతుం దను కున్నాము. కాని కమ్యూనిస్టులు ఈ రంగంలో మాకు వ్యతిరేకంగా 90 రెట్లు ప్రచారం సాగిస్తున్నట్లు మేము అతి త్వరలో గుర్తించగలిగాము. ఆర్థిక సహకార పథ కాన్ని గురించి, దాని నిర్వహణను గురించి విదేశాల లోని మా ప్రతినిధులు ఒక రిద్దరు పత్రికలకు ప్రకటనలు ఇచ్చినంత మాత్రాన ప్రయోజనం లేదనికూడ త్వర లోనే గుర్తించాము.

ఆ కారణంగా, వెంటనే మేము అమెరికాలోని ఉత్తమ పత్రికా కార్యాలయాలనుంచీ, రేడియో కేంద్రాలనుంచీ, సినీమా సంస్థలనుంచీ అనుభవశాలు రను, ప్రతిభావంతులను ఎన్నికచేసి సమాచార శాఖను నెలకొల్పాము. బహుముఖ ప్రజ్ఞా విశేషాలుగల బాబ్ ముల్లెన్ ఆధిపత్యంక్రింద వాషింగ్టన్‌లోను, రాస్కో డ్రమ్మండ్ ఆధిపత్యంక్రింద పారిస్‌లోను సమాచార కేంద్రాలను నెలకొల్పాము. ఈ కార్య నిర్వహణకు అమెరికా బడ్జెటును ఎక్కువ చేయవలసి వచ్చింది. కాంగ్రెసు ఈ విధానాన్ని బలపరిచి బడ్జెటును 20 లక్షల

నుంచి 1 కోటి 70 లక్షలకు పెంచడానికి సంతోషంగా అంగీకరించింది.

మార్షల్ పథకాన్ని గురించి వివిధదేశాల ప్రజలకు సవివరంగా తెలియచెప్పడానికి ఒక సంచార ప్రదర్శన శాఖను ఏర్పాటుచేశాము. మార్షల్ పథకంక్రింద అమలుజరిగే కార్యక్రమాన్ని ఆ శాఖవారు సవివరంగా తెలియచేస్తారు. ఆ శాఖవారు పశ్చిమ యూరప్‌లో 6 వేల మైళ్ళు సంచారంచేస్తూ, 'యూరప్ నిర్మాణా'న్ని గురించి ప్రజలకు వివరంగా చెపుతున్నారు. వారు వెళ్ళిన ప్రతిచోట, ఒక డేరా ఏర్పాటుచేసి మార్షల్ పథకం ప్రయోజనాలను తెల్పుతూ తీయబడిన ఫిల్ములను ప్రదర్శిస్తున్నారు. ఏ దేశానికి వెడితే ఆ దేశభాషలోనే ఆ ప్రదర్శనలు ఏర్పాటు చేస్తున్నారు. ఫ్రాన్సు, బెల్జియం డెన్మార్క్, స్వీడన్, జర్మనీ దేశాలలో వారు సంచారం పూర్తిచేశారు. పశ్చిమ యూరప్‌లోని రాజ్యాల పరస్పర సహకారంవల్ల కలిగే ప్రయోజనాలను గురించి, పశ్చిమ యూరప్‌లోని 27,40,00,000 మంది ప్రజలు ఉత్పత్తులను ఎక్కువచేసి, ఒకొరికొకరు సహాయపడితే వారి జీవనప్రమాణాలు పెంపొందడానికి గల అవకాశాలను గురించీ వారికి తెలియజెపుతున్నారు.

సంచార ప్రదర్శనల శాఖవారు అవలంబిస్తున్న మార్గాలలో అతి ప్రధానమైనదీ, ఆకర్షణీయమైనదీ ఒకటి

ఉన్నది. వారు 50 లక్షల గాలిగుమ్మటాలను (బెలూన్స్) గాలిలోకి వదిలిపెట్టారు. వాటి పరిధి రెండు అడుగు లుంటుంది. వాటికి ఒక పోస్టుకార్డు వేళ్ళాడ కట్టబడి ఉంటుంది. ఆ గాలిగుమ్మటం వదిలిపెట్టిన వారి చిరు నామా ఆ కార్డుమీద ఉంటుంది. పశ్చిమ యూరప్‌లోని ప్రజలు ఒకొరి కొకరు తెల్పుకునే మిత్ర సందేశం దాని మీద వ్రాయబడి ఉంటుంది. ఈ సంచార ప్రదర్శన శాఖవారు డెన్మార్కులో ఉన్నప్పుడు అటువంటి గాలి గుమ్మటాలను సుమారు 70 వేల దాకా గాలిలో వదిలారు. ఆ గుమ్మటాలకు వేళ్లాడ కట్టబడిన పోస్టు కార్డుల మీద ఈ విధంగా వ్రాయబడి ఉంది:

"డెన్మార్కులో మార్షల్ పథక ప్రదర్శన శాఖవారు ఏర్పాటుచేసిన ప్రదర్శనాలను చూచినట్టి నీ మిత్రుడు పంపుతున్న శాంతి సందేశం."

మార్షల్ పథకంక్రింద సహాయం పొందుతున్న 18 స్వతంత్ర, ప్రజాస్వామిక దేశాల ప్రజలు శాంతిసౌభా గ్యాలమీద పెట్టుకొన్న ఆశలకు ఆ గాలి గుమ్మటం చిహ్నం. స్వేచ్ఛగా సాగే వస్తువుల మారకానికీ, పర స్పర సహకారానికీ అది చిహ్నం. ఈ గాలి గుమ్మటాలు ఆకాశంలోను, సముద్రంమీద యథేచ్ఛగా విహరించి నట్లే, మన భావాలు, వస్తువులు యథేచ్ఛగా మార్పిడి జరుగగలవని ఆశిస్తున్నాను.

మార్షల్ పథకం, ప్రజాస్వామిక పద్ధతులలో శాంతిని సాధించడానికి రూపొందిన ప్రణాళిక.

ఆ విధంగా గాలిలోకి వదలిపెట్ట బడిన గుమ్మటాలు రెండువందల మైళ్లు, కొన్ని మూడువందల మైళ్లు, కొన్ని 500 మైళ్లు ప్రయాణంచేసి తూర్పు జర్మనీలోను, పోలెండు, హంగరీలలోను, ఆస్ట్రియా, చెకోస్లోవాకియా, లిథూనియాలలోను నేల మీదకు దిగాయి.

కమ్యూనిస్టు దేశాలలో మార్షల్ పథకాన్ని గురించి అక్కడక్కడ సన్నసన్నగా ప్రశంసలు వినబడినా కమ్యూనిస్టు ప్రభుత్వాలు ఈ క్రింది చర్యలు తీసుకున్నాయి:

(1) ఆ గాలిగుమ్మటాలను ముట్టుకుంటే అవి ప్రేల గలవనీ, అందువల్ల ప్రమాదం సంభవిస్తుందనీ ప్రభుత్వ ఉద్యోగులు ప్రజలను హెచ్చరించారు.

(2) వాటి ఆచూకీని పోలీసులకు తెలియ పరిచిన వారిని ప్రభుత్వం బహిరంగంగా అభినందించింది.

(3) కమ్యూనిస్టు పత్రికలు, రేడియో, అమెరికా వ్యతిరేక ప్రచారాన్ని జోరుగా సాగించాయి. ఆ గాలి గుమ్మటాలద్వారా విడుదల చేయబడిన సందేశాల ప్రతులలో వ్యాధిక్రిము లున్నాయనీ, క్రిమియుద్ధాన్ని ప్రారంభించడానికి ముందుగా పశ్చిమ యూరప్

సామ్రాజ్య వాదులు ప్రయోగాలు జరుపుతున్నారనీ ప్రచారం సాగించారు.

ఉక్కు తెరవెనుక దేశాలలోని కొందరు హంగరీని యన్ను, పోలెండు దేశస్థులు యూరప్‌లోని తమ మిత్రులకు కొన్ని రహస్యలేఖలు వ్రాశారు. ఆ విధంగా వచ్చిన ఒక లేఖలో ఇలా ఉంది :

"ఈ లేఖను మీకు రహస్యంగా పంపుతున్నాను. మీరు వదలిన గాలిగుమ్మటం చాలాదూరం వచ్చింది. మీ ఆశయాలు, లక్ష్యాలను గురించి మాట్లాడడానికి వీలులేని ప్రాంతాలకు అది చేరింది. మేము ఇతర ఐరోపావాసులమాదిరి స్వేచ్ఛగా జీవించే రోజు ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాము. యూరప్ ఉక్కు తెరవద్ద సమాప్తమైనదని భావించవద్దు." మిగతా లేఖలలో కూడ అదేవిధంగా ఉన్నది. ఉక్కు తెరవెనక వారందరూ భయసందేహాలతో ప్రాణాలు గుప్పిటలో పెట్టుకొని జీవిస్తున్నామని ఆ లేఖలలో పేర్కొన్నారు.

ఈ లేఖలనుబట్టి మార్షల్ పథక వ్యాప్తికి మేము చేసిన ఇతర ప్రయత్నాలనుబట్టి, యూరప్‌లోని అధిక సంఖ్యాక ప్రజలు మాకు అండగా నిలబడి ఉన్నారనీ, రష్యా ఉపగ్రహ రాజ్యాలలోని ప్రజలు స్వతంత్ర దేశాలలో ఏమి జరుగుతున్నదో తెలుసుకోవాలనే ఆసక్తితో ఉన్నారనీ నేను గట్టిగా విశ్వసిస్తున్నాను.

మహత్తర బాధ్యతల నిర్వహణకు అమెరికా సమాచార రంగంలో చేయవలసిన కృషిని మేము సంపూర్ణంగా బలపరచవలసి ఉన్నది. అమెరికా రక్షణ కార్యక్రమాలకు ఏవిధంగా తోడ్పడుతున్నామో, సమాచార రంగంలో అట్టి తోడ్పాటును ప్రదర్శించవలసి ఉన్నది. విదేశాలలో స్వతంత్రమైన ఒక సమాచార సంస్థను నెలకొల్పి, దానికి విస్పష్టమైన అధికారాలు కలుగ చేయాలి. మంత్రి హోదాగల ఒక నిర్వహణాధికారిని దానికి పెద్దగా నియమించాలి. అమెరికా ప్రభుత్వ శాఖలలో ఏదో ఒకదానికి ఈ కార్యాభారాన్ని అప్పగించడానికి వీలులేదు. దీనికి ప్రత్యేకంగా ఒక అధికారి ఉండాలి. ఒక ఉపమంత్రిని నియమించి ప్రయోజనం లేదు.

ప్రచార కార్యక్రమాన్ని మన శత్రువులు జాతీయ సమస్యగా పరిగణిస్తున్నప్పుడు, మనంకూడా దానిపట్ల అంతటి శ్రద్ధను కనపరచాలి. దీనిని ఆచరణలో పెట్టడంలో, ఈ రంగంలోఉన్న కొలది అడ్డంకులను మనం తొలగించాలి. ఉదాహరణకు మార్షల్ పథకాన్ని గురించి సాగిస్తున్న సమాచార కార్యక్రమానికి, విదేశాంగ శాఖ నిర్వహిస్తున్న అమెరికా కార్యక్రమానికి ముడిపెట్టకుండా, ఒకరిమీద ఒకరు ఆధారపడ నవసరం లేకుండా చేయాలి.

సమాచార శాఖలోని అనుభవజ్ఞులైన ఉద్యోగుల మీద ఉన్న ఆంక్షలను తొలగించి వారికి స్వాతంత్ర్యాన్నివ్వాలి. మన ప్రభుత్వ విధానాల ఫలితంగా వారు ఇతర శాఖలలోని పై అధికారులతో సంప్రదించకుండా స్వతంత్రంగా నిర్ణయాలు చేయరాదనే ఆంక్ష ఉన్నది. ఇతర శాఖాధిపతులు తమ శాఖకు సంబంధించిన కార్య కలాపాలను చక్కదిద్దుకొనడంలోనే సరిపోతుంది. వారి ఆమోదం ప్రతిదానికీ కావాలంటే ప్రతిపనీ ఆలస్యమైపోతుంది.

సమాచార రంగంలో జాగ్రత్త పడడంకోసం ఈ శాఖలో ప్రత్యేక సామర్థ్యం, ఎక్కువచొరవ ఉన్న ఉద్యోగులనే నియమించాలి. దూరదృష్టితోను, ధైర్య సాహసాలతోను ఏ సమయానికి ఏ పని చేయాలో నిర్ణయించగల మేధాశక్తి ఉన్న వారిని ఆ శాఖలో ఉద్యోగులుగా నియమించాలి. తగిన వారిని మనం ఏరుకోవాలి. ప్రచారం, వార్తాసేకరణ, సమాచార సేకరణ మొదలైన వాటికి మంచి అనుభవజ్ఞులైన వారిని ఎలా నిర్ణయిస్తామో అదేవిధంగా ఇప్పుడూ చేయాలి. ప్రచారానికి అవసరమైన లక్షణాలు స్వత స్సిద్ధంగా ఉన్న వ్యక్తిని పై లక్షణాలనుబట్టి తెలుసుకోడం కష్టం. వార్తాపత్రికా కార్యాలయంలో అనుభవం ఉండితీరాలనే నియమం ఉండకూడదు. చార్లెస్

మిచిల్‌సన్ మాదిరి పత్రికానుభవం ఉన్నవారయితే మరీ మంచిది.

ప్రజలతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకొని మన అభిప్రాయాలను వారికి స్పష్టంగా తెలియ చేయడానికి తేలిక మార్గాలేమిటో ఆ వ్యక్తికి తెలిసి ఉండాలి. ప్రచారకుడు ప్రజలకు సమాచారాన్ని అందించి ఊరుకోడు. తమ చర్యలపట్ల ఆ దేశ ప్రజల అభిప్రాయాలను తెలుసుకోడానికి విశేషంగా ప్రయత్నిస్తాడు. ఆయన నిర్వహిస్తున్న వ్యవహారాలు ప్రశంసా పాత్రాలైతే, విదేశాంగ విధానంవల్ల అనేక సత్ఫలితాలను కలిగించినవాడవుతాడు.

మన దేశంలోని రాజకీయ విధానాల దృష్ట్యా ప్రభుత్వసంస్థ కమ్యూనిస్టు ప్రచారాన్ని అరికట్టజాలదని ఒకప్పుడు వాదాలు జరిగాయి. వాక్స్వాతంత్ర్యాన్ని పట్టుదలతో రక్షిస్తున్న మన దేశంలో, ఈ కార్య నిర్వహణకు పూనుకొనే ప్రభుత్వ సంస్థలకు కొన్ని అడ్డంకులు కలుగవచ్చును. అదే ప్రభుత్వానికి సంబంధంలేని సంస్థగాని, నియంతృత్వ దేశానికి చెందిన సంస్థగాని అయితే అట్టి అడ్డంకులు రావు.

ఈ కార్య నిర్వహణకు అవసరమైన ధనం అమెరికా కాంగ్రెసుచేసే కేటాయింపులనుంచి లభించవలసి

ఉన్నది. ఆ కార్య నిర్వహణలో ఏ సంస్థ ధనాన్ని వ్యయపరచినా కాంగ్రెసు బాధ్యురాలై ఉండాలి. కాంగ్రెసుకు నివేదికలను సమర్పిస్తూ ఉండాలి. ఆర్థిక సహాయ నిర్వహణాధి కారిగా నేను గణించిన అనుభవాన్ని బట్టి, ఏదైనా ఒక విధానం విజయవంతంగా అమలు జరగాలంటే ప్రభుత్వం ధనసహాయంచేసే సంస్థల ద్వారాకంటె ప్రభుత్వ సంస్థలద్వారానే సాధ్య మవుతుందని గ్రహించాను.

ప్రచార కార్యక్రమాన్ని అమలు పరచడంలో నిర్మాణాత్మక దృక్పథం అవసరం. భిన్న సంస్కృతిగల ప్రజలతో మనం వ్యవహరించడానికి, వారికి మన లక్ష్యాలను గురించి సూటిగా తెలియచేయడానికి అవసరమైన హంగులను కలిగి ఉండాలి.

మన ప్రచారక కార్యక్రమ నిర్వహణను ఎప్పటికప్పుడు పరిశోధిస్తూ ఉండాలి. మన సాయుధసేనలు యుద్ధరంగంలో ఎంత చురుకుగా ఉంటాయో, ప్రచార రంగంలో మనం అంత చురుకుగా ఉండాలి. మన సాధన సంపత్తితో ఈ కార్యక్రమాన్ని సాగించాలి. ఈ కార్యక్రమాన్ని మనం ఇంకా సంపూర్ణంగా అమలుజరపడం లేదు. ఇంతకంటె ఉత్తమ విధానాలను అవలంబించడం, ఉన్న వాటిని అభివృద్ధిచేయడం జరగాలి.

మన బాధ్యతలను మనం గుర్తించి, వాటి నిర్వహణకు మన ప్రచార కార్యక్రమాన్ని విస్తృతం చెయ్యాలి. దానికి ఇప్పుడు మనం వ్యయపరుస్తున్న దానికంటె ఎక్కువ మొత్తాన్ని ఖర్చుచెయ్యవలసి వస్తుంది.

మన జాతీయ విధానాలలో అతిముఖ్యమైన ఈ ప్రచారక రంగంలో వ్యయపరచడానికి అమెరికా విదేశాంగశాఖ 12,00,00,000 డాలర్లను కేటాయించింది. ఈ మొత్తాన్ని కూడ సెనేటర్ విలియం బెంటర్ ప్రభృతులు విశేషంగా పట్టుపట్టిన ఫలితంగా లభించింది. క్రెమ్లిన్ అజమాయిషీక్రింద మనపైన వ్యతిరేక ప్రచారం సాగించే కమ్యూనిస్టు పార్టీలు ఖర్చుపెడుతున్న మొత్తంలో ఇది సహస్రాంశం కూడ లేదు.

పశ్చిమ యూరప్‌లో మార్షల్ పథకాన్ని గురించి ప్రచారం చేయడానికి మనం వెచ్చించిన ధనంవల్ల మనకు సత్ఫలితాలే కలిగాయి. ఆ విధంగా ప్రపంచంలోని ఇతర దేశాలలో ప్రచారం చేయడానికి ఈ మొత్తం చాలదు. విదేశాలలో మన ప్రచార శాఖలవలన ప్రయోజనాలు కలుగుతున్నాయని నిరూపించి, ఈ మొత్తాన్ని కనీసం 30 కోట్ల డాలర్లకైనా పెంచాలి. ఒక దేశంయొక్క ప్రజల హృదయాలను, మనస్సులను స్వాధీన పరచుకొని

వారిని తమకు విధేయులుగా చేసుకొనే పద్ధతులు, సైన్యా లతో యుద్ధం సాగించే దానికంటె చాల చవుకలో తేలి పోతాయని రష్యాచేస్తున్న ప్రతి చర్య నిరూపిస్తున్నది.

ఈ మొత్తాన్ని కేటాయించేటప్పుడు, ఈ ధనంలో నూటికి 15 వంతులు రహస్యంగా ఖర్చుచేయడానికి అధికార ముండాలి. ఆ శాఖ నిర్వహణాధికారి నిర్ణయం ప్రకారం ధాన్ని వ్యయపరచాలి. ప్రచారక సాధనాలు ఎల్లప్పుడు సంప్రదాయ సిద్ధంగా ఉండవు. వాటిని మనం ముందే ఊహించలేము. ప్రచారక శాఖోద్యోగులు అవసరాలనుబట్టి ధనాన్ని రహస్యంగా ఖర్చుపెట్టడానికి వారికి అధికారం ఇవ్వకపోతే, కార్యనిర్వహణలో వారికి అవరోధాలు కలిగించిన వార మవుతాము. అత్యవసర మైన ఈ స్వాతంత్ర్యాన్ని వారికి మనం కలిగించి, జనరల్ అక్కౌంటింగు ఆఫీసువారిచేత లెక్కలను తనిఖీ చేయించాలి. కాంగ్రెసుయొక్క కమిటీలకు ఆ శాఖవారు నివేదికలను సమర్పిస్తూ ఉండాలి.

ప్రచారక కార్యక్రమాన్ని సాగించే ప్రభుత్వ సంస్థకు తోడ్పాటుగా పనిచేసే అనధికార సంస్థలు ఏవైనా ఉంటే వాటికి ప్రభుత్వం ధనసహాయం చేయాలి. ప్రభుత్వ సంస్థలు చేయడానికి వీలులేని కార్యక్రమాలను ఆ సంస్థలకు అప్పగించాలి. ఆ సంస్థలకుకూడ ప్రపంచంలోని వివిధ దేశాలలో శాఖలను ఏర్పాటుచేయాలి. అనేక

లక్షలమంది యువతీ యువకులను వారు చేరదీసి స్వతంత్రదేశాల సిద్ధాంతాలను ప్రచారం చేయాలి. స్వతంత్ర దేశాలలోని స్త్రీ పురుషులు "నేను ఏ విధంగానైనా మీకు తోడ్పడ గలనా?" అని వేసేప్రశ్నకు ఆ సంస్థవారు సమాధాన మిచ్చేటట్లుగా ఉండాలి.

ఈ అనధికారసంస్థలు ముఖ్యంగా రెండు పనులను నిర్వర్తించాలి. స్వతంత్ర దేశాల సిద్ధాంతాలను పల్లె పల్లెలలోను ప్రచారం చేయడానికి అవసరమైన వారిని సమకూర్చుకోడం మొదటిది. ఇది విశేష ప్రయాసతో కూడినట్టి పని. అందువల్ల ఈ కార్యక్రమానికి స్వచ్ఛంద సేవకులను సమకూర్చుకోవాలి. వారు వినయ విధేయతలు, భక్తి విశ్వాసాలు కలిగినవారై ఉండాలి. ఈ విషయాలలో క్రెమ్లిన్ అనుసరించే విధానాలను తెలుసుకొన్నవారు, వాటి ప్రయోజనాలను గుర్తించినవారు ఈ రంగంలో మనం ఉపేక్ష వహిస్తున్నట్లు తెలుసుకోగలుగుతారు. అట్టి విధానాలు అవలంబించకుండా స్వాతంత్ర్యాన్ని రక్షించడమంటే, వస్తువులను విక్రయించే సిబ్బంది లేకుండా ఆ వస్తువులను గురించి పత్రికా ప్రకటనలు చేయడంలాగ ఉంటుంది.

ఆ సంస్థలు నిర్వహించవలసిన పని మరొకటి ఉన్నది. కమ్యూనిస్టులు చేసే వాగ్దానాలు కల్ల బొల్లివని నిరూపించి వారు సాగిస్తున్న దుష్ప్రచారాన్ని అరికట్టాలి.

రష్యా శుద్ధ అబద్ధాలమీద ఆధారపడి ప్రచారం చేస్తుంది. దానిని అరికట్టడానికి చేయవలసిన పను లన్నిటినీ వివరించలేము. రష్యా సిద్ధాంతాలన్నీ చరిత్రను తారుమారుచేసి రూపొందించినవే. కార్మిక కర్షక రాజ్యానికి చిహ్నంగాగల రష్యా పతాకకూడ కేవలం బూటకమే. వర్గ రహితమైన సాంఘికవ్యవస్థ రష్యాలోనే ఉన్నదనడం మరొక అబద్ధం. రష్యా సాంఘికవ్యవస్థలో అనేక తరగతు లున్నాయి. రాజకీయ రంగంలో వారు అవలంబిస్తున్న వక్రమార్గాలు అపవిత్రమైన ఆశయాలను సిద్ధింప జేయడానికి పవిత్ర సాధనాల నుపయోగిస్తున్నామనే సిద్ధాంతాన్ని రుజువు చేస్తున్నాయి. స్వాతంత్ర్యాన్ని గురించి రష్యాచెప్పే సిద్ధాంతాలు బానిసత్వాన్ని, దాని శాంతి ప్రయత్నాలు యుద్ధాన్ని సిద్ధింప జేస్తున్నాయి.

రష్యనులు చెప్పే మాటలలోనే, చేసే పనులలోనే క్రెమ్లిన్ శుద్ధ అబద్ధాలను ప్రచారం చేస్తున్నదని నిరూపించడానికి కావలసినంత సాక్ష్య మున్నది. మేధావంతుల దగ్గరనుంచి సామాన్య ప్రజలవరకూ యీ నగ్న సత్యాలను తెలియచేయవచ్చును. రష్యా ప్రపంచ దృష్టిలో యెంత అప్రతిష్ఠ పాలవుతున్నదో దానినికూడ మనం వెల్లడించ వచ్చును.

స్టాలిన్, ఆయన కార్యనేతలు తమ అసత్యప్రచారంత నాలుగు దిక్కులా మారుమ్రోగాలని వాంఛిస్తున్నారు. రష్యన్‌నాయకుల వెర్రి కలలను వెంటనే నివారించాలి.

ఈ విధంగా మనం సోవియెట్ కమ్యూనిస్టుల ఆట కట్టించవచ్చును. రష్యనులు ఇప్పుడు ఇతరదేశాలలో చేస్తున్న అసత్య ప్రచారాన్ని అప్పుడు తమ దేశంలోనే సాగించుకొంటూ కూర్చుంటే, విదేశాలలో కల్లోలాలు లేవదీయడానికి వారికి సావకాశం ఉండదు.

తూర్పు యూరప్ దేశాలలోని ప్రజలు మార్షల్ పథకంవల్ల పశ్చిమ యిరోపాకు కలిగిన ప్రయోజనాలను చూచి ఇప్పుడు విచారిస్తున్నారు. రష్యా మాటలు విని తాము మార్షల్ పథకాన్ని ఆమోదించనందుకు ఇప్పుడు విచారపడుతున్నారు. పొరుగువారు తమకంటె సుఖసంపదలతో ఉన్నారు కదా అని అనుకుంటున్నారు. మార్షల్ పథకం అమలులోకి వచ్చిన తర్వాత పశ్చిమ యూరప్‌లో జరిగిన ప్రతి ఎన్నికలోను కమ్యూనిస్టుల ఓటమినికూడా వారు గుర్తించారు.

ఆసియా ప్రజలు, ముఖ్యంగా స్వతంత్ర ప్రజలు ఒక విషయాన్ని గ్రహించారు. బడుగుదేశాలకు సహాయం చేయడంగాని, వలసదేశాల ప్రజలకు స్వాతంత్ర్యం కలిగించడంగాని రష్యా ఉద్దేశ్యంకాదనీ, సోవియెట్ ఆధి

పత్యం క్రింద సకల ప్రపంచాన్ని బానిసత్వంలో ఉంచ డానికే రష్యా ప్రయత్నిస్తున్నదనీ వారు గ్రహించారు.

రష్యా ఆదేశాల ప్రకారం ఉత్తర కొరియనులు ప్రారంభించిన దురాక్రమణవల్ల, కమ్యూనిస్టు చైనా దండయాత్రవల్ల రష్యా ఉద్దేశ్యాలేమిటో ప్రపంచానికి స్పష్టంగా తెలిసినవి.

స్వతంత్ర ప్రజలు తమ స్వాతంత్ర్య సిద్ధాంతాన్ని ప్రపంచంలోని అన్ని ప్రాంతాలకు, ఉక్కు తెరలోపల దేశాలకుకూడా అందచేయాలి.

మార్షల్ పథకం సందర్భంలో సమాచార రంగంలో మేము చేసిన కృషి సత్ప్రయోజనాలను కలిగించినదని నేను అనుభవపూర్వకంగా తెలుసుకొన్నాను. స్వాతంత్ర్య సిద్ధాంతాలను గురించి విశేషంగా ప్రచారం సాగిస్తే అది ఎటువంటి ఫలితాల నిస్తుందో చెప్పజాలను. అది స్వాతంత్ర్యం కోరుతున్న వారికి క్రొత్త ఆశ, ధైర్యాన్ని, శత్రువులకు అపజయాలను కలిగిస్తుంది.

స్వతంత్ర దేశాల స్వాతంత్ర్యాన్ని పరిరక్షించాలంటే, స్వతంత్ర దేశాలను గురించిన ప్రచార కార్యక్రమం ప్రారంభించడానికి యిదే మంచి తరుణం.

# శాంతిసాధన నిమిత్తం చేయవలసిన వ్యయం

## 9 వ అధ్యాయం

**1950** మే 8 వ తేదీన ఫ్లారిడా రాష్ట్రంలోని మియామీ నగరంలో జరుగనున్న "కివానీస్ ఇంటర్నేషనల్" సమావేశంలో నా ప్రసంగం ఏర్పాటు చేయబడింది. కివానీయులకు అమెరికా ఆర్థిక సహాయ నిర్వాహణ శాఖనుగురించి వివరంగా చెప్పవచ్చునుగదా అని ఉత్సాహంతో ఆ ఆహ్వానాన్ని అంగీకరించాను. అంతేగాక, నా పాతస్నేహితుడు కెప్టెన్ ఎడ్డీ రిక్కెన్ బేకరును కలుసుకోవచ్చునని కూడ ఆనందపడ్డాను. ఆ సమావేశంలో ఆయన ప్రసంగంకూడ ఏర్పాటు చేయబడింది. మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వం నేను లాస్ యాంజిలెస్‌లో స్టుడిబేకర్ కారుల విక్రేతగా పనిచేసి నప్పుడు రిక్కెన్ బేకర్ అక్కడి మెర్సెర్ ఏజన్సీలో పని చేస్తూ ఉండేవాడు. ఆ రోజులలో మంచి పేరు ప్రఖ్యాతులు పొందిన మెర్సర్ స్పోర్ట్, రోడ్‌స్టర్ కారులను ఆయన విక్రయిస్తూఉండేవాడు.

అమెరికా సెనేటు కేటాయింపుల సంఘంవారు ఆర్థిక సహాయ నిర్వాహణను గురించి పరిశీలన జరపడానికి

మే నెలలోనే సమావేశ మవుతుండడంవల్ల నేను వాషింగ్‌టన్‌లోనే ఉండవలసి వచ్చింది. మే 9 వ తేదీ ఉదయ్యాన నేను వార్తాపత్రిక తెరిచేసరికి, అందులో రిక్కేన్ బేకర్ ప్రసంగం కన్పించింది. మార్షల్ పథకాన్ని ప్రపంచంలోని అన్ని దేశాలలోను అమలు జరపడానికి రెండులక్షల కోట్ల డాలర్లు వ్యయమవు తుందని ఆయన తన ప్రసంగంలో పేర్కొన్నట్లు పత్రికలో చదివాను. ఆయన పేర్కొన్న మొత్తంలో అమెరికా ఆయుధ పునర్ధారణ కార్యక్రమాని కయ్యే మొత్తం కూడ కలిసి ఉన్నది. ఆ 2 లక్షల కోట్ల డాలర్లు ఖర్చుపెట్టినా శాంతిని సాధించ కలిగితే గొప్ప విషయమేనని కూడ ఆయన ఆ ప్రసంగంలో చెప్పారు. మొత్తంమీద ఆయన ప్రసంగం విదేశ ఆర్థిక సహాయానికయ్యే వ్యయాన్ని గురించి గంద్రగోళం కలిగించింది.

శాంతి సాధనకు ఎంత మొత్తం వ్యయం కాగలదో ఎవరూ నికరమైన అంచనా వేయలేరు. కాని నేను ఒక అంచనాను తయారు చేస్తున్నాను. ప్రపంచంలోని అన్ని దేశాలలోను మార్షల్ పథకాన్ని అమలు పరచాలని బుద్ధిమంతు లెవరూ అనరు. కాని స్వతంత్ర రాజ్యాల శాంతి భద్రతల రక్షణకు అతి ప్రధానమైన ప్రాంతాలను బలీయం చేయాలని మాత్రం కోరుతున్నారు. నేను

తయారుచేసిన సాలుసరి అంచనాలను ఈ క్రింద ఉదహరిస్తున్నాను :

| | డాలర్లు |
|---|---|
| అమెరికా ఇతర స్వతంత్ర రాజ్యాల రక్షణకు, అభివృద్ధి జరపగలసిన దేశాలకు చేయవలసిన ఆర్థిక సహాయం | 2,00,00,00,000 |
| రాజకీయ కార్యకలాపాలకు ... | 35,00,00,000 |
| సమాచార శాఖ కార్యాలయాలకు, ప్రచారశాఖకు ... | 30,00,00,000 |
| అనుకోకుండా వచ్చే ఆర్థిక సహాయ ఖర్చులకు ... | 30.00,00,000 |
| మొత్తం ... | 2,95,00,00,000 |

ఈ అంచనాలో అనుకోకుండావచ్చే ఖర్చులకోసం 30,00,00,000 డాలర్లు ప్రత్యేకించాను. ఇప్పుడు మన రాజకీయ కార్యకలాపాలకూ, రాయబారి కార్యాలయాలకూ సంవత్సరానికి 15,00,00,000 డాలర్లు వ్యయమవు తున్నాయి. మన సమాచార కార్యకలాపాల నిర్వహణకు 20,00,00,000 డాలర్లు వ్యయమవు తున్నాయి. ఈరెండు రంగాలను విస్తరింప చేయడానికి 30,00,00,000 డాలర్లను ప్రత్యేకించాను. మిగతా 30,00,00,000

డాలర్లు అనుకోకుండావచ్చే ఖర్చులకు వినియోగ పడతాయి.

విదేశాలకు ఆర్థిక సహాయ పథకంక్రింద నేను వేసిన అంచనాలు మార్షల్ పథక నిర్వహణకు అయ్యే వ్యయం కంటె తక్కువగానే కన్పిస్తున్నవి. మార్షల్ పథకంక్రింద మొదటి 15 మాసాలలోను 6,10,00,00,000 డాలర్లు, రెండవ సంవత్సరంలో 38,00,00,00,000 డాలర్లు వ్యయమైనాయి. 1951 వ సంవత్సరానికి 2,25,00,00,000 డాలర్లు కేటాయించ బడ్డాయి. పశ్చిమ యూరప్ దేశాల ఆర్థిక పునరుద్ధరణకు మార్షల్ పథకాన్ని నాలుగు సంవత్సరాలపాటు అమలు పరచడానికి వ్యయమయ్యే 1300 కోట్ల డాలర్లలోను, 900 కోట్ల డాలర్లు పునరావాస పునర్నిర్మాణ కార్యక్రమాలకు అత్యవసరంగా ఖర్చు పెట్టవలసి ఉన్నది. ఆ సమస్యలు యుద్ధంమూలంగా ఏర్పడినవే. కాందిశీకులకు ఆహార సదుపాయాలు కలిగించడానికి, బాంబులకు గురియై పాడయిపోయిన రైలురోడ్లు, నౌకాశ్రయాలను బాగు చేయడానికి ఆ మొత్తం వినియోగించబడింది. మరొక 900 కోట్ల డాలర్లను అక్కడ వ్యయపరచ నవసరం లేదు. మార్షల్ పథకం దేశాల పునరుద్ధరణకు 400 కోట్ల డాలర్లు వ్యయపరచ వచ్చును. మార్షల్ పథకం క్రింద వ్యయపరిచే మొత్తం సొమ్ములో మూడవవంతు

యుద్ధానంతర ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమాలకు సరిపోగలదు.

ఆర్థిక సహాయ కార్యక్రమం, పైన నేను పేర్కొన్న మొత్తంలో సరిపెట్టవచ్చు ననడానికి మరొక కారణం ఉన్నది. ఆర్థిక సహాయ కార్యక్రమం ప్రస్తుతానికి ఆగ్నేయాసియా దేశాలలోనే అమలు జరుపుతున్నాము. ఇండొనీసియా, ఇండోచైనా, బర్మా, థాయ్‌లెండ్‌లలో ఆర్థిక సహాయ కార్యక్రమాలు అమలు జరపాలని మొదట్లో ప్రతిపాదించి నప్పుడు మన మిత్రులు అభ్యంతరం చెప్పారు. కొన్నివందల కోట్ల డాలర్లు ఎక్కువ ఖర్చు పెట్టవలసి ఉంటుందని గందరగోళం చేశారు. ఆ దేశాలలో ఆ కార్యక్రమం అమలు జరపడానికి మొదటి సంవత్సరానికి 8,40,00,000 డాలర్లు ఖర్చు అవుతాయని అంచనా వేయబడింది. చైనాకు మొదట కేటాయించబడిన 27,50,00,000 డాలర్లలో చాల మొత్తం మనకు మిగులనున్నది. ఫిలిపీన్సుకు కేటాయించవలసిన మొత్తాన్ని దానికి చేర్చాలి.

ఇవిగాక, రబ్బరు, తగరం ఆ దేశాలకు ఎగుమతిచేసి ఎక్కువ మొత్తాలను మనం పొందవచ్చును. ఆగ్నేయాసియాలో తొలి సంవత్సరపు కార్యక్రమానికి అంత తక్కువ మొత్తం కావడానికి కారణమేమిటి? ఆగ్నే

యాసియా దేశాలన్నీ వ్యవసాయ దేశాలు. కాబట్టి వ్యవసాయ రంగంలో ఆ దేశాల నభివృద్ధి చేయాలి. అక్కడ రైతులుపయోగించే కొయ్య నాగళ్ళకు బదులు ఉక్కు నాగళ్ళు, శ్రేష్ఠమైన విత్తనాలు, నీటిపారుదల, భూసారరక్షణ మొదలైనవి అమలు జరపాలి. కొన్ని ప్రాంతాలలో చైనాలో మనం అమలు పరచిన గ్రామ పునరుద్ధరణ కార్యక్రమాలను అమలు జరపాలి. మరి కొన్ని ప్రాంతాలలో నవీన వ్యవసాయ పద్ధతులు అమలు పరచడానికి ముందు భూసారాన్ని ఎక్కువ చేయాలి. ఆ ప్రాంతంలో గల వ్యాధులను ముందు నిర్మూలించాలి. ఇండో చైనాలోని వియత్ నామ్ రాష్ట్రంలో మలేరియా ప్రబలంగా ఉన్నది. వ్యవసాయ ఉత్పత్తులను పెంపొం దించడానికి అంగబలం అవసరం కాబట్టి, మలేరియాను నిర్మూలిస్తే తప్ప, అక్కడి ప్రజల ఆరోగ్యం చక్కబడదు. అంటే అక్కడ ఆరోగ్య విధానాలను ప్రవేశపెట్టడం మనం ముందుగా చేయవలసిన పని. ఆసియాలోని ఇండి యాకుకూడ మన ఆర్థికసహాయ కార్యక్రమం విస్తరింప చేయడమేగాక, భవిష్యత్ చైనాకుకూడ అందచేయ వలసి యున్నది.

శాంతిసాధన కృషిని ప్రారంభించి, శాంతిని సాధించ డానికే, ఇతర దేశాలకు మనం ఆర్థికసహాయం చేయడానికి నడుమకట్టినాము. మన వాణిజ్య ప్రయోజనాలకోసం

స్వతంత్ర రాజ్యాలకు సహాయంచేస్తున్నా మని చెప్పడం భావ్యంకాదు. సాంఘిక, ఆర్థిక వ్యవస్థలు ఛిన్నాభిన్నమై ఉన్నప్పుడు లాభసాటి వ్యాపారం చేయడం ఎంత కష్టమో ప్రతివర్తకునికీ తెలుసు. స్వతంత్ర రాజ్యాలు క్రమేణా అభివృద్ధిపొందితే వ్యాపారం సాగించడానికి కూడ మంచి అవకాశం లభిస్తుంది. ప్రతివ్యాపారస్థుడు తనకు సాలీనావచ్చే ఆదాయంలో కొంతభాగం వ్యాపార ప్రచారానికి వెచ్చించాలి. వ్యాపార ప్రకటనలకు కొంత సొమ్ము వెచ్చించాలి. ఆ విధంగా వెచ్చించిన సొమ్ముకు ప్రతిఫలం ఎంత ఉంటుందో అంచనావేసి, దాని ప్రకారం ఖర్చుపెట్టాలి. ఆదాయంలో నూటికి 4, లేక 5 వంతులు ఖర్చుపెడతారు. ఆర్థిక, రాజకీయ, సమాచార రంగాలలో మనం పెట్టుబడి పెట్టే 2,95,00,00,000 డాలర్లు మన జాతీయాదాయంలో 99 వ వంతు. వాణిజ్య ప్రయోజనాల దృష్ట్యా కాకపోయినా అభ్యుదయ దేశమైన అమెరికా స్వతంత్రరాజ్యాల శ్రేయస్సుకోసం ఆ మొత్తాన్ని పెట్టుబడి పెట్టడం కష్టంకాదు. క్రెమ్లిన్ వివిధ దేశాలలోను రహస్యంగా సాగిస్తున్న దురాక్రమణల నరికట్టడానికి ఈ పెట్టుబడి ఉపయోగిస్తే, ఏకాలంలోను ఏ దేశం పెట్టనటువంటి పెట్టుబడి పెడుతున్నామన్నమాట.

సైనిక వ్యవహారాలతో నిమిత్తంలేని పైమూడు రంగాలలోను వ్యయపరచవలసిన 295 కోట్ల డాలరుల

మొత్తంతో సైనిక రంగంలో వ్యయపరచ వలసిన 50,00,00,00,000 డాలర్ల మొత్తాన్ని పోల్చినపుడు, సైనిక వ్యయమే ఎక్కువ అని అర్థమవుతుంది. ప్రతి సంవత్సరం ఇంత మొత్తాన్ని మనం ఖర్చుచేయవలసివస్తే మన ఆర్థిక వ్యవస్థ పెద్దభారాన్ని ఎదుర్కోవలసి వస్తుంది.

అదైనా మన ప్రజల ఆమోదంతోనే జరుగవలసియున్నది. ఇంత పెద్ద మొత్తాన్ని వ్యయపరచినా క్రెమ్లిన్ దురాక్రమణలను అరికట్టగలిగితే, మన ప్రజలను ఇబ్బంది పెట్టి అయినా ఆ మొత్తాలను వెచ్చించడం న్యాయమే. మూడవ ప్రపంచయుద్ధం వచ్చిందంటే వ్యక్తిగతంగా అనేక త్యాగాలు చేయవలసి యుంటుంది. జాతి మొత్తానికే తీరని ఉపద్రవం సంభవిస్తుంది.

మూడవ ప్రపంచ యుద్ధంవల్ల ఎంతటి ఘోర విపత్తులు కలుగుతవో తెలుసుకోవాలంటే ఒక్కసారి గత రెండు ప్రపంచయుద్ధాలను పరికిస్తే బోధపడుతుంది. మొదటి ప్రపంచయుద్ధంలో 1,19,000 మంది అమెరికనులు మరణించారు. 1,94,000 మంది గాయపడ్డారు. రెండవ ప్రపంచయుద్ధంలో 3,06,000 మంది అమెరికనులు మరణించారు. 5,72,000 మంది గాయపడ్డారు. ఈ ఉపద్రవం ఎంతఘోరమైనదీ వేరుగా చెప్పనక్కరలేదు. యుద్ధంవల్ల ఆర్థికంగాను, నైతికంగాను, సాంఘికంగాను జరిగే నష్టాలు అపారం.

కాకపోతే, యుద్ధానికి ఖర్చు ఎంత అవుతుందో అణా పైసలతో సహా లెక్కగట్టవచ్చును. మొదటి ప్రపంచ యుద్ధానికి సుమారుగా 22,00,00,00,000 డాలర్లు ఖర్చు అయాయి. రెండవ ప్రపంచ యుద్ధానికి సుమారుగా 350,00,00,00,000 డాలర్లు ఖర్చయాయి. మాజీ సైనిక మంత్రి గార్డన్ గ్రే రెండవ ప్రపంచ యుద్ధానికి 13,00,00,00,00,000 డాలర్లు ఖర్చయినవని ప్రకటించారు. ఆ అంకెల వంక చూస్తే నాకు విపరీతమైన భయం కలుగుతుంది. యాటంబాంబు, క్రిమి, విషవాయువుల ప్రయోగం ఇవన్నీ తల్చుకుంటే మూడవ ప్రపంచ యుద్ధం పేరు చెపితేనే అందరికీ ఖంగారు పుడుతూ ఉంది. అట్టి మహా ప్రళయం సంభవించకుండా చేయడానికి మనం అన్ని రంగాలలోను శాంతిసాధకకృషిని ప్రారంభించి, శాంతిని సాధించేవరకూ దానిని సాగించాలి.

క్రెమ్లిన్‌తో ప్రతిఘటన దీర్ఘకాలం సాగవలసి ఉండవచ్చును. ఆ విషయమే నాకు విపరీత ఆందోళనను కలిగిస్తుంది. మనం స్వాభావికంగా ఓర్పు లేనివాళ్ళం. మనమీద పెద్ద ఉపద్రవం వచ్చిపడినా, దానిని ఎదుర్కోడానికి విశేష ప్రయత్నం అవసరమైనా, స్వల్పకాలిక ప్రయాత్నాలను మాత్రమే మనం చేస్తాము. ఇది చాల ప్రమాదం తెచ్చిపెడుతుంది. దానివల్ల కలిగే నష్టాన్ని మనం ఎన్నటికీ భర్తీ చేయలేము.

వాస్తవానికి ఒక జాతియొక్క బలాన్ని చెప్పేటప్పుడు ఆ దేశంలోని ప్రజలందరి బలాన్ని చెపుతున్నామన్న మాట. మనం ఈ నాడు బలంగా ఉండడానికి మన రాజకీయసంస్థలు, ఆర్థిక వ్యవస్థ మహత్తర అవకాశాలను కలిగించాయి.

అమెరికనులకు అట్టి ఉత్తమ అవకాశాలు కలిగించబడినందుననే అమెరికా స్వాతంత్ర్యం ఉన్నత లక్షణాలతో కూడివున్నదని ప్రశంసలు పొందగలిగింది. అమెరికన్ ప్రజలు వాక్స్వాతంత్ర్యాన్ని, మత స్వాతంత్ర్యాన్నీ ఉత్తమ స్థాయిలో అనుభవిస్తున్నారు. ఆహారం, వసతి సౌకర్యాలలో యెట్టిలోపం లేకుండా జీవనం సాగించగలుగుతున్నారు. వ్యక్తిగత సామర్థ్యాన్ని ప్రదర్శించడానికి అమెరికన్ ప్రజలకు అనేక అవకాశాలు ఉన్నాయి.

ఇన్ని మహత్తర అవకాశాలు గల స్వాతంత్ర్యాన్ని పొందడం తేలిక విషయంకాదు. మానవుడు సాంఘిక శ్రేయస్సును, దేశ శ్రేయస్సును దృష్టిలోవుంచుకొని కృషి చేయాలి. వాటిని త్యజించి మానివుడు స్వాతంత్ర్యాన్ని సాధించ జాలడు. మానవుడు స్వార్థ ప్రయోజనాలకోసం కృషిచేసే రోజులు గతించాయి. వ్యక్తులు సమష్టికృషి సాగించే శకం ప్రారంభమైంది.

ఈనాడు మానవుడు స్వాతంత్ర్య పథంలో యథేచ్ఛగా కృషి సాగించడానికి అవకాశం ఏర్పడింది. అతడి సంతతి వారైన వ్యవసాయదారులు, కార్మికులు, మేధావంతులు పల్లెలలో ఉన్నా, పట్టణాలలో ఉన్నా సహజీవనం సాగిస్తున్నారు. మార్గదర్శి అయిన ఆ వ్యక్తి స్వతంత్ర రాజ్యాలను నిర్మించడమే లక్ష్యంగా పెట్టుకొన్నాడు. అతడి మనుమలు, మునిమనుమలు స్వేచ్ఛా ప్రపంచ నిర్మాణానికి ఇతర ప్రజల మార్గా న్ననుసరించ వలసిందే.

మానవులు పరస్పరం సంతృప్తికరమైన పరిష్కారాలు కుదుర్చుకొంటూ, పరిస్థితుల కనుగుణంగా తమ వైఖరులను సరిపుచ్చుకొంటూ మెలగితేనే స్వాతంత్ర్యం సార్థకమవుతుంది. నేటి ప్రపంచంలో మనం అనేక క్లిష్టసమస్యలను ఎదుర్కొనవలసి యున్నది.

ఈ నాటి ప్రపంచ సమస్యల పరిష్కారానికి దీర్ఘకాలిక పథకాలు, తీవ్రకృషి అత్యంతావశ్యకం. బ్యాంకింగ్ వ్యవస్థలను నెలకొల్పడం, ఆర్థిక సాంఘిక సమస్యలను పరిష్కరించడం తక్షణం చేయవలసిన వ్యవహారాలు. ప్రభుత్వ బాధ్యతలుకూడ ఎక్కువైనాయి. జాతీయ కార్మిక వ్యవహారాల పరిశీలనసంఘం దగ్గరనుంచీ, కరెన్సీ మార్పకపు వ్యవహారాల సంఘం ఆర్థిక వ్యవస్థను చక్కబరిచే సంఘంవరకూ మనం

ఏర్పాటు చేయవలసి వచ్చింది. సాధారణ పరిస్థితులలో గాని, రక్షణ కార్యకలాపాల నిర్వహణలోగాని స్వాతంత్ర్యానికి భంగం కలుగకుండా, ఆర్థిక, సాంఘిక వ్యవహారాలను చక్కబరచడమే ప్రభుత్వంయొక్క ప్రధానాశయం. కాని వాటిని ఆచరణలో పెట్టేటప్పుడు ప్రజలయొక్క శక్తిని, ఉత్సాహాన్ని తగ్గించేటట్లుగా ఉండరాదు.

1602 వ సంవత్సరంలో 'పిల్‌గ్రిమ్ ఫాదర్స్' ప్లిమత్‌లో కాలుపెట్టి నప్పటినుంచీ, కెప్టెన్ హెన్రీ హడ్సన్ కాలంనుంచీ అమెరికనుల జీవిత విధానంలో వ్యక్తిగత అవకాశాలు ప్రధాన స్థానాన్ని ఆక్రమించాయి. ఈ శతాబ్దం మొదట్లో ఆ పద్ధతి మారిపోయిందని వాదించేవారు కొందరున్నారు. ఆ వాదాన్ని నేను అంగీకరించను. ఈ శతాబ్దం మొదటిభాగంలో కాలానుగుణంగా అవకాశం అనే పదానికి నిర్వచనంలో కొంతమార్పు వచ్చినప్పటికీ, అమెరికా చరిత్రలో అతి విజయవంతమైన ఘట్టం అదేనని చెపుతున్నాను.

1951 వ సంవత్సరంలోని అమెరికనులకు, అతడి పూర్వీకులకు, అంటే అతడి తాతలకాలంనాటికీ భౌతిక రంగంలో విశేషవ్యత్యాసం ఉన్నది. ఈనాడు మన జాతీయ ఉత్పత్తుల పెంపుదల చాల అధికమైనది. 1900 వ సంవత్సరంలో 50,00,00,00,000 డాలర్ల విలువగల

వస్తువులు ఉత్పత్తి అయేవి. 1951 వ సంవత్సరంలో అవి 2,79,00,00,00,000 డాలర్ల విలువకు పెరిగినాయి. 1951 లో అమెరికా జనాభా 1900 వ సంవత్సరంకంటె రెండురెట్లు మాత్రమే పెరిగింది. వాణిజ్య రంగంలోను, ఉద్యోగ సదుపాయాలలోను ఈనాడు మనకు అవకాశాలు ఎక్కువైనాయి. 1900 వ సంవత్సరంలో అమెరికాలో 18 లక్షల ప్రయివేటు సంస్థలుమాత్రం ఉండేవి. ఈనాడు వాటి సంఖ్య 40 లక్షలకు పెరిగింది. 1920 వ సంవత్సరంలో 300 పరిశోధనాలయాలు మాత్రమే ఉండేవి. అప్పుడు పారిశ్రామిక సంస్థ లన్నింటిలోను 9,000 మంది ఉద్యోగులు మాత్రం ఉండేవారు. 1940 వ సంవత్సరానికి 2,200 పరిశోధనాలయాలు అయాయి. వాటిలో 70,000 మంది ఉద్యోగులున్నారు. అమెరికా జాతీయాదాయాన్ని ఈనాడు చెప్పవలసి వస్తే 1,36,00,00,00,000 డాలర్లు ఖజానాలోను, 97,10,00,00,000 డాలర్లు బ్యాంకులలో నిల్వలరూపంలోను, 60,00,00,00,000 డాలర్లు ఇన్సూరెన్సు పాలసీల రూపంలోను ఉన్నాయి. మిగతావి చెప్పాలంటే, ఈనాడు అమెరికనులకు 4,00,00,000 మోటారుకార్లు, 8,00,00,000 రేడియో సెట్లు ఉన్నాయి.

మనం జాతీయ రంగంలో సాధించిన విజయాలు డాలర్ల పెరుగుదలతో నిల్చిపోలేదు. 1951 వ

సంవత్సరంలో కార్మికుల పని గంటలు వారానికి 40 కి తగ్గించబడ్డాయి. కార్మికులు పనిచేస్తూన్నప్పుడు ప్రమాదాలకు లోనయితే సక్రమ పరిహారం ఇవ్వడానికి ప్రత్యేక శాసనాలు అమలులోకి వచ్చాయి. కార్మికులకు వృద్ధాప్యంలో రక్షణ, ఇన్సూరెన్సు సదుపాయాలు కలుగచేయబడ్డాయి. నిరుద్యోగులు బాధపడకుండా సదుపాయాలు, వికలాంగులకు ప్రత్యేక సౌకర్యాలు కలిగించబడ్డాయి. కార్మికులకు కనీస వేతనాలు నిర్ణయిస్తూ, బాల బాలికలను కర్మాగారాలలో పని చేయించరాదని నిషేధిస్తూ శాసనాలు చేయబడ్డాయి.

భౌతిక రంగంతోపాటు, సాంస్కృతిక, వైజ్ఞానిక రంగాలలో మనం అభివృద్ధి చెందడానికి ఈనాడు అవకాశాలున్నాయి. విద్యా వ్యాప్తికి లోగడగల ఆర్థిక అవరోధాలు తొలగించ బడ్డాయి. ఆ రంగంలో సాధించిన అభ్యుదయం ప్రపంచ చరిత్రలో ఇంతకు ముందు కని విని ఎరుగమని హార్వర్డ్ విశ్వ విద్యాలయానికి చెందిన డాక్టర్ సమ్నర్ స్లిక్టర్ అన్నారు. 1890 వ సంవత్సరంలో నూటికి ఏడుగురు స్కూళ్లలో చదివేవారు. ఈనాడు నూటికి 80 మంది విద్యాభ్యాసం చేస్తున్నారు. పట్టభద్రుల సంఖ్యకూడ విపరీతంగా పెరిగింది. 1900 వ సంవత్సరంలో 7,272 మంది కాలేజి ప్రొఫెసర్లు ఉండేవారు. ఈనాడు 75,007 మంది ఉన్నారు.

ఆధ్యాత్మిక రంగంలో కూడ చెప్పుకోదగ్గ అభ్యుదయాన్ని సాధించాము. రాజకీయరంగంలో జేమ్సు మాడిసన్, మన స్తత్వ శాస్త్రంలో విలియం జేమ్సు, ఆధ్యాత్మిక రంగంలో జాన్ డ్యూయీ లాంటి మహానుభావులు బయలుదేరారు. సాంస్కృతిక రంగంలో యూరపియనుల సంప్రదాయాలను పాటించడంకంటె ఎక్కువ పనే చేశాము. ఇంగ్లండులోని పత్రికలు అమెరికనుల పాండిత్యాన్ని, సాహిత్యాన్ని విశేషంగా ప్రశంసించాయి. అమెరికన్ లోకోక్తులను ఆంగ్ల గ్రంథాలలో చేర్చుకొన్నారు.

బ్రిటనులోని అనేక పత్రికలు అమెరికను సంప్రదాయాలను పాటిస్తున్నాయి. బ్రిటిషు లేబరుపార్టీ సమావేశాలలో అమెరికనుల గీతాలను గానం చేస్తున్నారు. బ్రిటనులోని 'పంచ్' (వారపత్రిక) న్యూయార్క్ టైమ్సు ప్రారంభించిన "ఏకపంక్తి" శీర్షికలను ఇప్పుడు ఉపయోగిస్తున్నది. కళారంగంలో క్లీవ్ లెండ్ చిత్రకళా ప్రదర్శనశాలవారు ప్రకటించిన సమీక్ష ప్రశంసనీయమైనదని ఒక ప్రముఖ బ్రిటిష్ కళాకారుడు పేర్కొన్నాడు. అమెరికాలోని కోకా - కోలా పానీయం, హాలీవుడ్ లోని అలంకరణ సామగ్రి ఇప్పుడు ప్రపంచమంతటా వ్యాపించాయి. విలియం ఫాక్నర్ కు సాహిత్యంలో నోబెల్ బహుమానాన్ని ఇచ్చారు.

అది నేను అమెరికనుగా గర్వించతగ్గ విషయం. భౌతిక రంగంలో మనం సాధించిన విజయాలు అనేకం. పూర్వం ఇతరుల పౌరసత్వపు హక్కులనుగురించి పట్టించుకునేవాళ్లం కాదు. అందరికీ సమానావకాశాలు ఉండాలనే విషయాన్ని గుర్తించి, ఆ రంగంలో తీవ్ర కృషిచేసి ముందుకు వెళ్ళగలిగాము. నా బాల్యంలో, ఆ విషయాన్ని ఎవరూ ఎక్కువగా పట్టించుకోలేదు. ఊరికే మొసలి కన్నీళ్లు మాత్రం కార్చేవారు. నా పిల్లలకు, ఇతర బాల బాలికలకు ఈనాడు పౌరసత్వం అనేది జన్మహక్కు అయింది. సర్వమానవ సౌభ్రాత్రం వల్ల విశేష ప్రయోజనాలున్నాయని గుర్తించాము. మనం ఇప్పుడు ప్రతిదీ ఆచరణలోపెట్టి తర్వాత ఇతరులకు బోధిస్తున్నాము.

గత 50 సంవత్సరాలలోను భౌతిక, వైజ్ఞానిక, సాంస్కృతిక రంగాలలో మనం సాధించిన అభ్యుదయాన్ని క్లుప్తంగా వివరించాను. మనం సాధించిన ఘన కార్యాలకు మనం గర్వించవలసి ఉన్నది. కాని, మనం ఇంతటితో ఆగిపోకూడదు. అమెరికాయొక్క ప్రత్యేకత ఏమిటంటే, ఎన్ని మహత్కార్యాలు సాధించినా, మరి కొన్ని సాధించాలనే ఉత్సాహం తగ్గక పోవడమే.

ప్రస్తుత ప్రపంచ పరిస్థితులు అతి క్లిష్టంగా ఉన్నాయి. ఎక్కడచూచినా ఉద్రిక్త వాతావరణం కన్పిస్తున్నది.

ఇట్టి తరుణంలో మనం అవకాశాలను ఎక్కువ చేసుకోవాలి. ఇది చెప్పేటంత తేలికపని కాదు. క్రెమ్లిన్ లేనిపోని భయాందోళనలను కలిగిస్తున్నది. మనం తగిన జాగ్రత్తలు తీసుకోకపోతే మన అభ్యుదయానికి తీవ్రమైన అవరోధాలు ఏర్పడుతాయి. మనం ఊహించలేని ఘోర విపత్తులు సంభవిస్తాయి. పౌరసత్వాలను, స్వాతంత్ర్యాలను కబళించే ప్రతిపాదనను అతి జాగ్రత్తగా పరిశీలించి, వాటి దుష్ఫలితా లేమిటో జాగ్రత్తగా గమనించాలి.

మన రక్షణ కార్యకలాపాలకు ప్రాధాన్యం ఇవ్వడం అవసరమైనందున కొన్ని ఆర్థిక కంట్రోళ్లు అమలు జరపవలసిన అవసరం ఏర్పడిందని అందరూ గుర్తించిన విషయమే. సంస్థల నిర్వాహకులకు ఉత్పత్తుల విషయంలో స్వాతంత్ర్యం ఇవ్వడంవల్ల, కార్మికులకు కోరుకున్న ఉద్యోగాలు ఇవ్వడంవల్ల ఉత్పత్తులు వేగంగా పెంపొందడానికి అవకాశం లభిస్తుంది. కంట్రోళ్లను విధించేటప్పుడు, అవి తప్పని సరి అని నిర్ధారణ చేసుకొన్న తర్వాతనే వాటిని అమలు జరపాలి; ఆ అవసరం తొలగిపోయిన తర్వాతనే వాటిని రద్దుచేయాలి.

మన ఆర్థిక వ్యవస్థను సక్రమంగా రక్షించుకోడమే గాక, మన పౌరసత్వాలను జాగ్రత్తగా కాపాడుకోవాలి. వాటికి భంగం కలిగితే ఘోర ప్రమాదం ఏర్పడుతుంది.

తూర్పు బెర్లిన్ ప్రజలకు, పశ్చిమ బెర్లిన్ ప్రజలకు గల తేడా నాకు ఎప్పుడూ జ్ఞాపకముంటుంది. పశ్చిమ బెర్లిన్ ప్రజలు ఎన్ని ఇబ్బందులకు గురి అవుతున్నా వారి ముఖాలలో జీవకళ, ఆశాభావం ఉట్టి పడుతూంటాయి. తూర్పు బెర్లిన్ ప్రజల ముఖాలలో నైరాశ్యం, భయం తాండవిస్తూ ఉంటాయి. ఈ ఉద్రిక్త పరిస్థితులను అమెరికా తట్టుకోగలదు. మనం పౌరసత్వాల బిల్లుకు ఏవిధంగాను భంగం కలిగించకపోతే, అభివృద్ధి పొందుతూ, ప్రపంచ దేశాల అభివృద్ధికి విశేషంగా తోడ్పడగలము.

మన దేశంలో స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవాలంటే, మన ఇంటిని చక్కబెట్టుకోవాలంటే స్వతంత్ర రాజ్యాల నాయకత్వాన్ని సమర్థతతో నిర్వహించాలి. అభ్యుదయాన్ని సాధించడానికి అమెరికా అతి ఉత్సాహంతో కృషిచేయాలి.

రానున్న 10 సంవత్సరాలు ప్రపంచంలోని మానవులందరూ మహత్తర నిర్ణయాలు చేయవలసిన సమయం. మనం అనుసరించే విధానాలు, మనం నిర్వహించే బాధ్యతలు ప్రపంచ భవిష్యత్తును నిర్ణయిస్తాయి. పూర్వం మనం అనేక కష్టాలను ఎదుర్కొన్నాము. ఈనాడు మనం స్వీకరించవలసిన కొత్త బాధ్యతలను మన శక్తిని కోల్పోకుండా నిర్వహించగలము.

# జయం పొందగలమా?

## 10 వ అధ్యాయము

శాంతిని సాధించడానికి అన్ని రంగాలలోను శాయ శక్తులా మనం పాటుపడుతా మనుకోండి. మన ఆర్థిక పరిస్థితులను పటిష్ఠం చేసుకొని, స్వతంత్ర దేశాల నాయకత్వాన్ని స్వీకరిస్తా మనుకోండి. అప్పుడేం జరుగుతుందని మనం ఆశించవచ్చు? అంత ప్రయత్నంచేసిన తరువాత కూడా ప్రచ్ఛన్న యుద్ధం ఇంకా జరుగుతూనే ఉంటుందా? క్రెమ్లిన్, దాని ఉపగ్రహ ప్రభుత్వాలు ప్రపంచంలో ఇంకా అశాంతికరమైన పనులు చేస్తూనే ఉండగలవా? రెడ్ ఆర్మీ ఇంకా నానాటికీ పెరిగి పోతూనే ఉంటుందా?

లేక, మనం అప్పుడు బలం చేకూర్చుకొంటాం గనుక ఇతర దేశాలతో క్రెమ్లిన్ కూడా సుహృద్భావంతో వ్యవహరించే పరిస్థితి ఏర్పడగలదా? అసలు క్రెమ్లిన్ నియంతృత్వాన్ని బదాబదలుచేసే అవకాశం అంటూ రాగలదా?

ఈ పై ప్రశ్నలే నన్ను బాధిస్తున్నవి. అమెరికా లోను, ఇంకా ఇతర దేశాలలోను నేను కలుసుకొనడం సంభవించిన రాజకీయ విజ్ఞులను నే నా ప్రశ్నలనే వేస్తు న్నాను. వాటిని గురించి పూర్తి అంగీకారంగల సమా

ధానాన్ని ఒక నివేదికరూపాన సమర్పించాలని నేను అను కొంటున్నాను. అయితే, ఆప్రశ్నలను గురించి అనేక అభిప్రాయ భేదాలున్నందువలన అటువంటి నివేదికను తయారు చేయడం నాకు వీలులేదు.

అయితే ఒక విషయంలో మాత్రం అందరూ ఏకీభవిస్తున్నారు. మన రక్షణ సైన్యాలు ఇతోధిక మైనప్పుడు పరిస్థితులు చక్కబడగలవని అందరూ అంటున్నారు.

ఉదాహరణకు ఆ విషయం మీద విన్‌స్టన్ చర్చిల్ చెప్పినమాటలను చూద్దాం: "ఇప్పటికంటె మన సైనిక బలం ఎక్కువైనప్పుడు సోవియెట్ యూనియన్ అమలులో పెట్టగల ఒప్పందాలను ఆ దేశంతో చేసుకొన గలము."

రాజకీయ రంగంలో క్రెమ్లిన్ రెండు పద్ధతుల నవలం బిస్తున్నదని చర్చిల్ మాటనుబట్టి నాకు తెలిసింది. సైని కంగా బలవంతమైన దేశాలతో సోవియెట్ యూనియన్ చేసుకున్న సంధులను గౌరవిస్తూనే అమలులో పెడు తున్నది. తనకన్న బలహీనమైన దేశాలతో క్రెమ్లిన్ చేసుకున్న సంధులను బుట్టదాఖలు చేస్తున్నది.

సోవియెట్ యూనియన్‌తో ఎటువంటి సంప్ర తింపులు జరుపవలసిందీ చర్చిల్ స్పష్టంగా చెప్పలేదు.

ప్రపంచంలో అక్కడక్కడ స్థానిక యుద్ధాలు కొన సాగించే పద్ధతికి క్రెమ్లిన్ స్వస్తి చెప్పేటట్లు చెయ్యాలని ఆయన ఉద్దేశమై ఉండవచ్చు.

సోవియెట్ యూనియన్‌లో ప్రస్తుతం అధికారంలో ఉన్నవారిలో హృదయ పరివర్తనం వస్తుందని నేను సంప్రతించిన వారెవరూ అనుకోవడం లేదు. ప్రపంచాధిపత్యం చేపట్టాలని సోవియెట్ రష్యాలోని పోలిట్ బ్యూరో గట్టిగా నిశ్చయించుకున్నది. కనుక తనతో పాటు అందరూ సుఖంగా బ్రతుకాలనే విశ్వాసం ఆ ప్రభుత్వానికి ఎన్నడూ కలగదని అందరూ అంటున్నారు. అందుచేత అక్కడి ప్రభుత్వ దృక్పథం మారుతుందని మనం ఆశించడానికి అవకాశం లేదు.

ఏదో ఒక పెద్దమార్పు వస్తేతప్ప సోవియెట్ ప్రభుత్వం ఇప్పట్లో మారబోదని నేను సంప్రతించిన వారందరూ అంటున్నారు. అయితే ప్రస్తుతం సోవియెట్ యూనియన్‌లో అధికారంలో ఉన్నవారిని తొలగించడానికేమైనా అవకాశాలున్నవా ? ఇది చాల ముఖ్యమైన విషయం.

బయటినుంచి ఏదో ఒక దాడి జరిగితేతప్ప ఆ దేశంలో ఉన్నవారెవరూ ఆ ప్రభుత్వాన్ని తొలగించలేనంతటి బలమైన నియంతృత్వ పరిపాలన సోవియెట్

యూనియన్‌లో ఉన్నదనేవారు నా సన్నిహితులలో అనేకులున్నారు. ఆ విషయంలో తమ దేశంలోని ప్రజలను, వస్తుసంపత్తిని పూర్తిగా తమ స్వాధీనంలో ఉంచుకొని నియంతృత్వ పరిపాలన సాగించిన హిట్లర్, ముసోలినీలను వారు నిదర్శనంగా చెపుతున్నారు.

అంతేగాక హిట్లర్, ముసోలినీల దేశాలకంటే సోవియెట్ ప్రభుత్వం అధీనంలో గల భూమి చాల విశాలమైనదనీ, అక్కడి వస్తుసంపత్తి, ఆహార ధాన్యాలు, ఆ దేశాన్ని స్వయం సమృద్ధం చేయగలవనీ కూడా వారు అంటారు. ప్రజలపై సోవియెట్ ప్రభుత్వం దౌర్జన్య విధానాల నవలంబిస్తున్నదనీ, ఆ విషయంలో హిట్లర్, ముసోలినీలను కూడా ఆ ప్రభుత్వం మించి పోయిందనీ నా స్నేహితులు చెపుతున్నారు.

అయినప్పటికీ సోవియెట్ ప్రభుత్వ నిర్మాణాన్నిబట్టే దాని పతనం తప్పదని నా నమ్మకం. జాన్‌ఫాస్టర్‌డల్లెస్, జనరల్ డగ్లస్ మెకార్థర్, జార్జి కెనాన్‌లవంటి ముఖ్య పరిశీలకుల భావాలుకూడా నా నమ్మకాన్ని బల పరుస్తున్నవి. విదేశాంగ మంత్రులలో కొందరుకూడా ఆ విషయంలో నాతో ఏకీభవిస్తున్నారు.

సోవియెట్ ప్రభుత్వం ఏ విధాన పతనమవుతుందో ఇప్పుడు చెప్పలేం. కాలమే ఆ విషయం నిర్ణయించాలి.

కాని, అక్కడి పరిస్థితులు మాత్రం నానాటికీ విషమిస్తు న్నవి. వాటినిబట్టి అక్కడ జరుగనున్న విషయాలను ఊహించవచ్చు.

సోవియెట్ యూనియన్‌లోని కార్మికులలో తెంగిపు, అసంతృప్తి, రోషం నానాటికీ ఎక్కువ అవు తున్నవి. రెండవ ప్రపంచ యుద్ధానంతరం జీవన వ్యయ ప్రమాణం పెంచగలనని సోవియెట్ ప్రభుత్వంచేసిన వాగ్దానాన్ని నెరవేర్చలేక పోయింది. ప్రజల జీవన వ్యయ ప్రమాణం పెంచడానికి వినియోగపడే డబ్బుతో బ్రహ్మాండమైన సైన్యాలను నిర్మిస్తూంది.

నిత్యజీవితావసరాలకు సంబంధించిన వాగ్దానాలను నిర్వర్తించలేక పోవడం చాలా ప్రమాదరకమైన విషయం. పైగా రెండవ ప్రపంచ యుద్ధంలో విదేశా లకు వెళ్ళిన సోవియెట్ సైనికులు, ఉక్కుతెర అవతల నున్న దేశాలలోని సైనికులు తమకంటె సుఖపడు తున్నారని తెలుసుకొన్నారు.

ఇక సోవియెట్ రష్యా జనాభాలో నూటికి 80 వంతులున్న కర్షకులలో కూడ సమష్టి వ్యవసాయంవలన అసంతృప్తి ప్రబలంగా ఉన్నది. క్రిందటియుద్ధంలో జరిగిన ఒక సంఘటన ఇక్కడ పేర్కొనదగింది. ఉక్రేయిన్‌ను నాజీలు జయించినప్పుడు అక్కడి ప్రజలు నాజీలకు స్వాగత మిచ్చారు.

తాము ఆక్రమించుకొన్న ప్రాంతాలలోని ప్రజల సానుభూతిని సక్రమంగా వాడుకొనడానికి బదులు నాజీలు వారిని అనేకవిధాల హింసించారు. ఇప్పుడు సోవియెట్ యూనియన్‌లో కూడా అదేవిధంగా జరుగు తున్నది.

అవన్నీ అలా ఉండగా సోవియెట్ ప్రజలలో అనేక మంది వ్యక్తిగతంగా అక్కడి ప్రభుత్వంమీద కక్షవహి స్తున్నారు. ఎందుచేత? లక్షలాది ప్రజలను నిర్బంధించి వెట్టి చాకిరీ కేంద్రాలకు కొనిపోవడం వలననే. ఒక దేశం జనాభాలో కనీసం నూటికి అయిదుమంది నైనా ఖైదీ లుగా ఉంచడం, అది ఎంత నియంతృత్వ ప్రభుత్వమైనా. తగని విషయం. మీ సన్నిహితులలో ఒకరిని ప్రభుత్వ రహస్య పోలీసుశాఖవారు ఎక్కడికో తీసుకువెళ్ళి నిర్బం ధంలో ఉంచినట్లయితే, ఆ ప్రభుత్వంపట్ల మీ కెటువంటి భావా లుండగలవు?

వాసు వీరననేల? సోవియెట్ ప్రజలందరూ బాని సత్వమే అనుభవిస్తున్నారు. సామాన్య పౌరుడు తన ఉద్యోగాన్ని అంటి పెట్టుకుండాలి. అటూ ఇటూ కదిలితే ప్రభుత్వ గూఢచారులు అనుమానిస్తారేమో నన్న భయం సర్వదా అతన్ని వెంటాడుతూనే ఉంటుంది.

అక్కడ జరుగుతున్న దౌర్జన్యాల వలన సోవియెట్ శాస్త్రజ్ఞులు, విజ్ఞానులు పనిచేయలేక పోతున్నారు.

వారి సృజనాత్మక శక్తి కుంటుపడుతూంది. ఏదయినా పొరపాటు జరిగితే ఎక్కడ సైబీరియాకు పంపిస్తారో నన్న భయంవలన కర్మాగారాల యజమానులు కొత్త పద్ధతు లవలంబించడానికి భయపడుతున్నారు. 1936-38 సంవత్సరాలలో సోవియెట్ సైన్యంలో అధికసంఖ్యా కులకు, సోవియెట్ సన్నిహితులలో కొందరికి పట్టిన దుర్గతి అక్కడి వివేకులందరినీ ఇప్పుడుకూడ కలవర పరుస్తున్నది.

సక్రమమైన పరిపాలనా యంత్రం గాని, పరిపాలనా పద్ధతులు గాని లేనప్పుడు ఒక నియంత తన అధికారాన్ని తన తరువాత ఇంకొకరికి సంక్రమింప చేయడం అసాధ్యం. పోనీ ఎవరినో ఒకరిని ఆనియంత నియమిస్తాడే అను కోండి. ఇతర సహచరులకు ఆయన అంటే ఇష్టంలేక పోవచ్చు.

మొదట అధికారాన్ని చేపట్టి క్రమంగా అధికారా లన్నింటిని స్టాలిన్ హస్తగతం చేసుకున్న రష్యాలో పై విషయం అక్షరాలా నిజం. సోవియెట్ యూనియన్‌లో అమలులోనున్న రాజ్యాంగం దృష్ట్యాగాని, మార్క్సిజమ్ దృష్ట్యాగాని స్టాలిన్‌కుగల ఇప్పటి అధికారాలు సమంజస మైనవికావు.

కమ్యూనిస్టు సిద్ధాంతాలలో ముఖ్యమైనదైన ఒక దాన్ని స్టాలిన్ త్రోసి రాజన్నారు. కేంద్ర కమ్యూనిస్టు

పార్టీని ఆయన విస్మరించారు. ప్రజలు తన తరువాత ఫలాని ఆయనను తమ అధినేతగా ఎన్నుకోమని స్టాలిన్ చెప్పినా ప్రజలు ఆమాటలను తోసిపుచ్చేటంత మేరకు తన వ్యక్తిగత అధికారాల నాయన పెంచుకున్నారు.

అందుచేత తన తదనంతరం సోవియెట్ పరిపాలనాధికారాన్ని తన సహచరులలో కొంతమంది చేపట్టే విధంగా రాజ్యాంగాన్ని సవరించడానికి స్టాలిన్ ప్రయత్నిస్తున్నారు. స్టాలిన్ కున్నటువంటి పరిపూర్ణాధి కారాలను కొంతమంది మధ్య పంచడం చాలా కష్టమైన విషయం.

ఎందుచేతనంటే నియంతృత్వాధి కారాలలో మూడో వంతు ఒకరికిచ్చి మిగిలిన వాటిని మరి ఇద్దరికి పంచడం సాధ్యంకాదు. ఒకవేళ అటువంటిదే జరిగినా, వారి ముగ్గురిలో ఒకరో, ఇద్దరో, తమరు అధికారంలో ఉంటేనే కార్మికునికి ఎక్కువ ప్రయోజనాలు కలుగుతవని నిర్ణయిస్తారు. అంతటితో అంతఃకలహం ప్రారంభమవుతుంది. సైన్యం ఒకపక్షాన, రహస్య పోలీసు శాఖవారు మరొక పక్షాన పోరాడతారు.

సోవియెట్ యూనియన్‌లో అంతః కలహాలు రాగల సమయాలలో స్టాలిన్ మరణ మొకటి.

సోవియెట్ పరిపాలనలోని ప్రజల జాతీయ భావాలకు, ప్రపంచాధిపత్యం చేపట్టాలని వాంఛించే అంతర్జాతీయ

కమ్యూనిజానికి ఆ దేశంలో కనిపించకుండా నిరంతరం సంఘర్షణ జరుగుతున్నదని జాన్ ఫాస్టర్ డల్లెస్ అంటున్నారు. రష్యా రష్యనులకు, పోలెండ్ ఆ దేశ ప్రజలకు, హంగరీ హంగేరియనులకు సంక్రమించే విధంగా ఆ సంఘర్షణలో తుదకు జాతీయ శక్తులకు జయం తథ్యమని డల్లెస్ అభిప్రాయం.

ప్రాచ్య దేశాలలో ఇటీవల వచ్చిన మార్పులను చక్కగా అర్థం చేసుకున్న జనరల్ మెక్ ఆర్థర్, స్టాలిన్ మరణానంతరం పై సంఘర్షణ బట్టబయలు కాగలదని అంటున్నారు.

సోవియెట్ రష్యా ఉపగ్రహాలలోనుంచి జారిపోయిన యుగోస్లావియాలో కూడా అటువంటి పరిణామాలే రావచ్చు. పెట్టుబడిదారి దేశాలైన అమెరికావంటి దేశాలపట్ల తనకు సహజంగా ఉన్న అసమ్మతినే సోవియెట్ రష్యా మరొక కమ్యూనిష్టు దేశమైన యుగోస్లావియాపట్ల ప్రకటించింది. యుగోస్లావియాను చూస్తే సోవియెట్ రష్యాకు భయం.

అమెరికా 'యుద్ధోన్మాది' అని సోవియెట్ రష్యా చేసిన ప్రచారం అక్కడి ప్రజలలో పని చెయ్యలేక పోయింది. ఎందుచేతనంటే ఒకప్పుడు కమ్యూనిస్టు నాయకులలో ఒకడని పొగడిన టిటోను సోవియెట్ రష్యా దేశ ద్రోహి అనీ, ఫాసిస్టనీ అనడం వల్లనే.

ఉక్రేయిన్‌లో, తదితర ప్రాంతాలలో ఇటీవల జరిగిన సంఘటనలు కూడా సోవియెట్ నియంతృత్వాన్ని అధిగమించ గలవు. ఇటలీలో ఇటీవల కమ్యూనిస్టుపార్టీనుంచి కొంతమంది వైదొలగడం, మరి కొన్ని ప్రాంతాలలో విషమ సమస్యలు ఏర్పడడం స్టాలిన్‌ను ఇప్పుడు వేధిస్తున్నవని నా నమ్మకం.

తమ పరిపాలనా వ్యవహారాలను తామే చూచుకోవాలని రష్యన్లకు గల కోరికను ఆధారం చేసుకొనే క్రెమ్లిన్ పతనం కాగలదని నా వ్యక్తిగతాభిప్రాయం. ప్రపంచచరిత్రలో ప్రజల ఆ కోరిక బ్రహ్మాండమైన శక్తిగా పరిణమించింది.

బ్రిటను, నెదర్లాండ్స్ ప్రభుత్వాలు సాదరంగా ఇండియా, ఇండోనీసియాలను పరిపాలిస్తున్నా, అక్కడి ప్రజలు ఆ కోరిక ననుసరించే స్వాతంత్ర్యం చేపట్టిన విషయాన్ని గడచిన సంవత్సరాలలో మనం చూచాము.

గడచిన అర్థశతాబ్దంనుంచీ జపానీయుల పరిపాలనలో ఉన్న కొరియనులలో ఆ స్వాతంత్ర్యేచ్ఛ నాకు ప్రస్ఫుటంగా కనిపించింది. 146 సంవత్సరాలపాటు పరాయి పరిపాలనలో ఉన్న పోలెండు ప్రజలకు ఆ కోరిక వల్లనే మొదటి ప్రపంచ యుద్ధానంతరం స్వాతంత్ర్యం సిద్ధించింది. తమ స్వాతంత్ర్యాన్ని వారు

తిరిగి చేపట్టగలరని నే నిప్పుడు కూడా ఆశిస్తున్నాను. అదేవిధంగా చెకోస్లోవాకియా ప్రజలు కూడా.

ప్రజల ఆ కోరిక క్రెమ్లిన్‌కు ప్రక్కలో బల్లెం వంటిది. ఆ కోరికే ఆయా దేశాలలో మున్ముందు రానున్న ప్రభుత్వాల రూపు రేఖలను దిద్ది తీర్చి సోవియెట్ ప్రస్తుతం అనుసరిస్తున్న విదేశాంగ విధానాన్ని పూర్తిగా తల క్రిందు చేయగలదు.

పై మార్పులలో ఏ ఒక్కటి వచ్చినా అవసరాన్ని బట్టి తన దేశంలో దౌర్జన్య విధానాన్ని కొంతవరకు తగ్గించుకుని, దురాక్రమణకు స్వస్తిచెప్పి ఇతర దేశాలతో సక్రమమైన పద్ధతులలో వ్యవహరించగల నాయకత్వం క్రెమ్లిన్‌కు వస్తుందని మనం ఆశించవచ్చు. అప్పుడు స్వతంత్ర దేశాలు ఆ దేశంతోపాటు సుఖంగా ఉండ గలవని సహేతుకంగా ఆశించవచ్చు. సోవియెట్ యూనియన్‌లోనే విప్లవంవచ్చి, అక్కడ ప్రజాస్వామ్యం నెలకొనడం పై మార్పులలోకల్లా ఉత్తమమైనది. ఆ విధాననే ప్రపంచంలో సుస్థిర శాంతి నెలకొనగలదు.

పై విషయాల దృష్ట్యా ఇదివరకు మనం అనుకున్న నాలుగురంగాలలో మనం పాటించవలసిన రెండు ముఖ్య విధానాలున్నవి.

సైనికంగాను, రాజకీయ సంబంధాల విషయంలోను, భావి కార్యక్రమాలను నిర్ణయించుకొనడంలోను

ఇతోధిక బలం చేకూర్చుకొనడం మొదటి విషయం. శాంతిని సాధించడానికి మనం అనుసరించే పద్ధతులలోనే సోవియెట్‌ను ఉక్కు తెర వెనకాలకు నెట్టివేసే సంఘటనలు గాని, లేక ఆ ప్రభుత్వాన్ని కూలదోసే సంఘటనలు గాని త్వరగా జరిగేటట్లు చూడడం రెండో ముఖ్య విషయం.

నేను వస్తుతః వ్యాపారస్థుణ్ణి. ఈ శాంతి సాధన కార్యక్రమాన్ని అమలులో పెట్టినందున మన పన్నులు తగ్గవనీ, మనజాతీయ ఆదాయ వ్యయ పట్టికలో ఒడుదుడుకు లుండగలవనీ నాకు తెలుసు. అయితే ప్రచ్ఛన్న యుద్ధనివారణకు తాత్కాలిక పద్ధతు లవలంబించ నప్పటి కంటే, శాశ్వతంగా శాంతిని నెలకొల్పినప్పుడు మాత్రమే మన సైనిక వ్యయం తగ్గి, పన్నుల భారం తగ్గి, మన ఆయవ్యయాలు సరితూగగలవు.

పన్నులు తగ్గించడంలోగల ప్రయోజనా లందరికీ తెలుసును గాని, జాతీయ ఆయవ్యయాలు సరితూగ వలసిన అవసరం చాలామందికి సరిగ్గా తెలియదు. ప్రపంచంలోని అనేక ప్రభుత్వాలను నేను చూచాను. తన ఆదాయానికి మించి ఖర్చుచేసే ప్రభుత్వం చాలా ఇబ్బందులు పడవలసి వస్తుంది. ఒక్కొక్కసారి ఆ కారణం వలన ఆ ప్రభుత్వమే పడిపోవచ్చు.

తన ఖర్చులను, ఆదాయాన్ని బట్టి తగ్గించుకోనగల ప్రభుత్వం మాత్రమే ఆర్థికంగా రాణించగలదు. అటు వంటి ప్రభుత్వం మాత్రమే సుస్థిరమైన ఆర్థిక వ్యవస్థను నెలకొల్ప గలదు.

అవన్నీ ఆదేశం వస్తుసంపదమీద, ప్రభుత్వ ఆర్థిక స్తోమతుమీద, తదితర విషయాలమీద ఆధారపడి ఉండే విషయాలు. అయితే నైతిక సుస్థిరత్వానికి మాత్రం ఈ 20 వ శతాబ్దంలో సుస్థిర శాంతి చాలా అవసరం.

అటువంటి శాంతిని సాధించ గలిగినచో గడచిన 37 సంవత్సరాల చరిత్రలోను మొదటి సారిగా యుద్ధాన్ని, యుద్ధ భయాన్ని నివారించ గలమన్నమాట. అంతేగాక ఇప్పుడు యుద్ధానికి, రక్షణ సన్నాహాలకు అర్థంలేకుండా ఖర్చయ్యే కోట్లాది డాలర్లను నిర్మాణాత్మకమైన పనులకు వెచ్చించగలము.

ఇప్పుడు మనం తప్పనిసరిగా ప్రతి అయిదు వేల కోట్లలోను నూరుకోట్ల డాలర్లను సైన్యాలకు ఖర్చు పెడుతున్నాము. ఆ డబ్బుతో రెండు లక్షలమంది విద్యార్థులు చక్కగా విద్య నభ్యసించగలరు. ఇంకా మిగిలే 40 కోట్లతో న్యూయార్క్, షికాగో, మెమ్‌ఫిస్, లాస్ఆంజిలీస్ పట్టణాలలో ఇండ్లు లేని వారికి గృహ వసతి చూపించవచ్చు. శాంతిసాధనకు ఎక్కువ

ఉపయోగకరమైన అణుశక్తి పరిశోధనలకు మరి పది కోట్ల డాలర్లు మిగల గలవు.

ప్రస్తుతం మన కనేక బాధలు, ఆందోళనలు ఉన్నా, చరిత్రలో అతి విశిష్టమైన ఒక దశలో మనం నివసిస్తున్నాము. శాంతిసాధనకై ప్రయత్నించి దాన్ని సాధించ గలిగితే ఈ 20 వ శతాబ్దంలోని యుగసంధ్యను గత మంతటికంటే విశిష్టతరం చేయగలము. ఆ కృషి ప్రారంభించడంలోనే మానవుడు మున్నెన్నడూ కని విని ఎరుగని శాంతి సౌధ నిర్మాణం ప్రారంభ మవుతుంది.

శాంతిసాధనకై వచ్చే దశాబ్దంలో మనం మన శాయశక్తులా కృషి చేయాలి. మన సంతానానికి, అటు తరువాతి వారికి శాంతిని లభింప చేయడమే గాక, సోవియెట్ యూనియన్ దాస్యంలో ఉన్నవారికి స్వేచ్ఛను కలిగించడం కూడా మన కర్తవ్యము. అదే మనల నిప్పుడెదుర్కొంటున్న సమస్య.

అనేక కష్టాలతో నిండి ఉన్న శాంతి సంస్థాపనకు పూనుకొన్నందుకు అదే మనం పొందగల బహు మానం. ఈ దశను గతంకంటె ఉత్తమమైన దాన్నిగా మార్చే మహత్తర అవకాశం మనకు లభించింది. మనలో మనకు విశ్వాసముండి, ఆ అవకాశాన్ని పురస్క-

రించుకొని కృషి ప్రారంభిస్తేనే మానవజాతి పట్ల మన విశ్వాసం ద్విగుణీకృతం కాగలదు.

అతి ముఖ్యమైన నిర్ణయాలు చేసుకొనే ఆ దశాబ్దం గడచిన తరువాత మాత్రమే మానవుడు మున్నెన్నడు కని విని ఎరుగని శాంతి సౌధానికి పునాదులు వేశామని మనం అనుకొనగలము.



పాల్ జి. హాఫ్మన్ వ్యాపారంలోను, ప్రభుత్వ పదవీ నిర్వహణ లోను అమోఘ విజయం సాధించారు. ఆయన స్టుడిబేకర్ కార్పొరేషనుకు మాజీ అధ్యక్షులు. రెండు సంవత్సరాలకు పైగా ఆర్థిక సహకార కార్యాలయం ఉన్నతాధికారిగా పనిచేశారు. ప్రస్తుతం ఆయన, 'శాంతి సాధనకై' 23,80,00,000 డాలర్లను వినియోగించనున్న ఫోర్డ్ ఫౌండేషన్‌కు డైరెక్టరు.

పాల్ జి. హాఫ్మన్‌ను డ్వైట్ డి. ఐసెన్ హోవర్ ఈవిధంగా ప్రశంసించారు: "పాల్ హాఫ్మన్ కార్యరూపంలో అమెరికాకు అమిత సేవ చేశారు. తద్వారా ఆయన ప్రపంచమంతటా స్వాతంత్ర్య పరిరక్షణకై కృషి చేశారు. 'శాంతిని సాధించగలము' అనే ఈ గ్రంథంలో ఆయన తన అమూల్యానుభవాన్ని, ప్రజ్ఞా విశేషాన్ని చూపారు. విస్పష్టంగా, సులభ శైలిలో, ఉన్నదున్నట్లు విషయాన్ని వివరిస్తూ, పండిత పామరులకు సులభ గ్రాహ్యమయేలాగ ఆయన దీనిలో ఉత్తేజకరమైన సందేశాన్ని ఇచ్చారు."